సం-37
1978 - MN

# పరివర్తన



బెహరా వెంకట సుబ్బారావు

గుడిసెలో అడుగు పెడుతూ నాగులు తల్లి చేతుల్లోని పెళపెళలాడుతున్న కొత్త పదిరూపాయల నోట్లను చూసి ఆశ్చర్యపోయాడు. అలాగే చూస్తూ గుమ్మంలోనే ఉండిపోయాడు. తల్లి తలెత్తి తనవైపు చూసాక —

"ఇంత డబ్బెక్కడిదమ్మా ?" కాలు కదపకుండానే అనుమానంగా అడిగాడు ఏడోక్లాసు చదువుకొంటూన్న నాగులు.

మందహాసం చేసింది తల్లి రత్తాలు ! కుడిచేతిలోకి ఒక నోటుని తీసుకొని చేయి చాపి —

"ఇంద ! తీసుకో !" అంది.

ఆశ్చర్యాన్నుంచి తేరుకోని నాగులు అడుగు ముందుకెయ్యలేదు. తల్లిని చూస్తూ అలాగే నిలుచుండిపోయాడు.

"తీసుకోరా !" లాలనగా చూస్తూ తనయునికి దగ్గరగా వెళ్ళి అందించింది

రత్తాలు ! అయినా అందుకోలేదు నాగులు.

"నా కెందుకమ్మా అంత డబ్బు ?" అన్నాడు నోటును చూస్తూ.

"పెద్ద పరీచ్చలన్నావ్ గదరా యీ సంవచ్చరం ! పుత్తకాలూ అయ్యో కొనుక్కో ! అదేదో లెక్కలు సేసుకో డానికి పెట్టె కొనుక్కోవాలన్నావు గదా, కొనుక్కో !"

"ఆ పెట్టె కొనుక్కో నక్కర్లే దమ్మా ! డాట్టరమ్మగారి రమేశ్ బాబు యిత్తానన్నారు ! అవునుగానీ అంత డబ్బెక్కడిదమ్మా ?"

తగ్గుస్వరంలో మరలా అడిగాడు ఏదో శంకిస్తూ.

తనయుని అనుమానం గ్రహించింది రత్తాలు.

"నే నేవీ తప్పుడుపన్లు సేయనేదురా ! ఇంద తీసుకో !" నోటును మరలా అందించబోయింది.

అయిష్టంగానే అందుకొన్నాడు నాగులు. తనింకా లెక్కలూ, ఇంగ్లీషూ, నోట్సులు తెల్గుకాగితాలూ కొనుక్కోవాలి. అవన్నీ కావాలంటే ఆ పదిరూపాయలూ చాలనే చాలవ్.

"సింహాద్రికి ఏదో పుత్తకం కావా లంటున్నాడు, ఆడికి పుత్తకం రావులికి ఓ పలకూ కొనరా నాగూ. ఆడు పలక ముక్కతో బడికెల్తున్నాడు !"

ఇంకా తనవేపే అనుమానంగా చూస్తున్న కొడుకుతో అంది రత్తాలు.

"అమ్మా..." ఏదో అడగబోతూ ఆగిపోయాడు నాగులు.

మిగిలిన నోట్లను విరిగిన పేకేజీ పెట్టెలో అట్టడుగున దాస్తూన్న రత్తాలు వెనక్కు తిరిగి

"ఏటిరా ?" అడిగింది.

"అంత డబ్బెక్కడిదమ్మా ?'' తల్లి కళ్లల్లోకి సూటిగా చూస్తూ మరలా అడిగాడు.

"నేనేవీఁ దొంగతనవూఁ రంకు తనవూఁ సేయనేదురా ! నీ యమ్మ అలాంటి తప్పుడు పన్లెప్పుడూ సే య దు రా ! డాక్టరమ్మగో రిచ్చి నార్రా !" అంటూ పెట్టెమూతని గట్టిగా నొక్కి లేచి నిలబడింది.

తల్లి కారెక్టరుమీద నమ్మకం కలిగింది, నాగులుకి.

"ఇంకా ఎంతుందమ్మా ?" తల్లికి దగ్గరగా వెళ్ళి అడిగాడు.

"అరవై యున్నాయిరా ! మీ అయ్యకి సెప్పక ! వారపొట్టివాడి బాకీ పాతిక రూపాయలూ యిచ్చేత్తా ! ఇప్పటికి యాభై రూపాయలు వడ్డీకింద కట్టాం ! తతిమ్మా డబ్బెట్టి నూకలూ అయ్యో కొందాం ! మీ అయ్యకి సెప్పక ! తెలిసిందా ?" హెచ్చరించింది.

అలాగే అన్నట్టు తలూపాడు నోటుని

మడతపెట్టి జేబులో పెట్టుకొని, "ఓ కోక కొనుక్కోకూడదా ?" అన్నాడు.

"నా కెందుకురా కోకలు! డాక్టరమ్మ గోరిచ్చిన రెండు కోకలున్నాయ్ సాన ! ఆరి రమేష్‌బాబయ్యి రెండు సొక్కాలు న్నాయ్ యిత్తానన్నారు ! నీకు తెత్తా ! సరేకానీ బేగా బజారుకెళ్ళి పుత్తకాలూ అయ్యీ కొనుక్కొని తెచ్చుకో ! మద్దాన్నం మీ అయ్యొత్తాడు అయిదారా బాదనుంచి ! ఆడు సూత్తే ఏయీ కొన్నియ్యడు ! లాక్కెట్టుకొని సక్కా బోతాడు !"

* * *

రత్తాలుకి నలుగురు పిల్లలు. భర్త నూకరాజుకి ఓ గవర్నమెంటు ఆఫీసులో బంట్రోతు పని. "జీతం రెండొందల యాభై" అని చెబుతాడు. కానీ అవీ యివీ కోసుకోగా నూట ఎనభై యే వస్తాయనికూడా చెబుతాడు. నూకరాజుకి జీతం ఎప్పుడు అందుతుందో రత్తాలుకి తెలియదు. కానీ సారాకొట్టు వెంకా సాయబుకీ, వారపొడ్డీల నారాయణ సామికీ, మార్వాడీకి మాత్రం బాగా తెలుసు నూకరాజు ఎప్పుడైతే రెండు మూడు రోజులు వరసగా యింటికి రాకుండా ఉంటాడో అప్పుడే వాడికి జీతం అందిఉంటుంది అని తెలుసుకుంటుంది రత్తాలు. పెద్దకొడుకు నాగల్ని నాలుగువైపులా పంపుతుంది ఎక్కడ పడిఉన్నాడో చూసిరమ్మని. వాడు చూసొచ్చాక ఎదురుపాకలో ఉంటూన్న రిక్షా డ్రైవరు సోములన్ననీ, పక్క గుడిసెలో ఉన్న పకోడిబండి యజమాని యాదగిరి తమ్ముణ్ణీ బతిమాలి భర్తను మోయించి యింటికి తెప్పించుకొంటుంది. నులకమంచంమీద నూకరాజుని పడేసి వాళ్లు పోగానే మొగుడి జేబులు తడుముతుంది. పదో పరకో ఉంటాయ్ ! తల బాదుకొం టుంది. "ఈ పిల్లల్కి ఎలా తిండి పెట్టాలి భగమంతుడా !" అంటూ ఓ పూట రాగాలు తీస్తుంది.

ఏకబిగిని తిండీతిప్పలూ లేకుండా తాగి మైకంలో ఉన్న నూకరాజు తెలివి వచ్చాక అప్పుడే యీనిన పులిలా గాండ్రుగాండ్రుమంటాడు. గిన్ని నిండా అన్నం పెట్టనందుకు పెళ్లాన్ని నానా బూతులూ తిడతాడు. ఆ తర్వాత కొడతాడు. గిన్నెల్నీ తపాళాలనీ నేల కేసి కొడతాడు. నానా బీభత్సంచేసి పోతాడు.

తండ్రి గుడిసె కొచ్చాడంటేనే భయపడతారు పిల్లలు తండ్రి గుడిసెలో అడుగు పెట్టగానే పిల్లలందరూ బిలబిలా బిలంలోంచి ఎలకల్లా బయట పడతారు. ఎదురుగా సినిమాహాలు దగ్గరా, టీకొట్లదగ్గరా, కిళ్ళీకొట్లు దగ్గరా తచ్చాడుతారు. పరిస్థితిని గమనించి నెమ్మదిగా ఒకళ్లా ఒకళ్లా గుడిసెలో దూరి తల్లిదగ్గరకు పోతారు.

సంసారం ఈదే బాధ్యత తనదేనని తెలుసుకొన్న రత్తాలు ఓ డాక్టరమ్మని మంచిచేసుకొని పనికి కుదిరింది. ఆమె మనకసుఁగేలా అన్నిపనులూ చేస్తూ ఆమె ఉదరాభిమానాలు సంపాదించు కొంది. డాక్టరమ్మగారి భర్త కూడా పెద్ద ఆఫీసరు. ఎప్పుడూ క్యాంపుల్లో వుంటారు వారి కిద్దరే పిల్లలు. పెద్ద బ్బాయి రత్తాలు పెద్దబ్బాయి యీడు వాడే. రెండోవాడు నాలుగో కొడుక్కు ఈడు ఆ పిల్లల బట్టలు వారి దృష్టిలో చిరిగిపోయినవీ, వెలిసిపోయినవీ రత్తాలు తెచ్చుకొంటుంది. రత్తాలు కెప్పుడూ ఏదో ఒకటి అవసరమే రత్తాలుకి జీతం "యింత'' అని ఒప్పందంలేదు రత్తాలు ఖచ్చితంగా అడగనూలేదు. అయితేనేం! బాగానే ముడుతుంది రత్తాలుకి. రత్తాలు దృష్టిలో డాక్టరమ్మ ఓ దేవత !

* * *

ఆవేళ పనంతా పూర్తిచేసి "నే పోతూన్నా అమ్మగారూ !" కేకవేసింది రత్తాలు వీధిమెట్లమీద నిలబడి.

"పనయితే వెళ్లవే !" డాక్టరమ్మ యింట్లోంచే జవాబీయడంతో డీలాపడి పోయింది రత్తాలు. చేతిలోఉన్న అన్నంగిన్నెను మెట్లమీదపెట్టి లోనికి చూస్తూ వుండిపోయింది రత్తాలు, 'కొంతసేపటికయినా వీధిలోకి రాక పోతారా !' అన్న ఆశతో. ఓ అయిదు నిముషాలు గడిచాయ్ దాని అదృష్ట వశాత్తు కూరలమ్మి వచ్చింది

"వంకాయలొచ్చాయ్ అమ్మగారూ!" కేకేసింది తన ఉనికి తెలియజేస్తూ.

"వంకాయలు అప్పన్న తెచ్చాడే !" అంటూ, డాక్టరమ్మ వీధిలోకి వస్తుంటే అంతవరకూ అడగాలనుకొన్న రత్తాలికి నోట మాటరాలేదు. అమ్మగారు మరలా లోనికి పోతారేమోనన్న భయం ! పై మెట్టువరకూ ఎక్కి తలవొంచుకొని నిలబడింది కూరలమ్మి వెళ్ళిపోయింది.

సైకాలజీ బాగా తెలుసుకొన్న డాక్ట రమ్మగారు "ఏవే ! యింకా యింటికి పోలేదా ?" అడిగారు.

ఆమె మాట్లాడకపోవడంతో ఎప్పటి లాగే డబ్బు అవసరంఉందని గ్రహించిన అమ్మగారు

"వస్తానుండు ! పిల్లలు కాన్వెంటుకి తయారవుతున్నారు !" అంటూ లోనికి పోయారు.

రత్తాలు తలెత్తి అమ్మగార్నిచూసింది.

'అమ్మగారిది ఎంతద్రుష్టం ! పట్నంలో రెండు మేడలున్నాయ్ ! కారుంది ! బోలెడంత డబ్బు ! ఇద్దరే పిల్లలు! ముచ్చాల్లా ఉంటారు! డబ్బున్న వాళ్ళకి ఎక్కువ పిల్లల్నియడు భగమంతుడు !' అనుకొంది.

డాక్టరమ్మగారి పిల్లలిద్దరూ కాన్వెంటులో చదువుతున్నారు పిల్లలు యింట్లో కూడా యింగ్లీషులోనే మాట్లాడు కొంటారు. ఆమెతో మాట్లాడినప్పుడు కూడా యింగ్లీషుమాటలు దొర్లించేస్తూ

ఉంటారు కొత్తలో అర్థంగాక గింజు కొనేది. తర్వాత అలవాటయింది.

పిల్లల్ని కారెక్కించి, తిరిగి గుమ్మం మెట్లు ఎక్కుతూ, రత్తాల్ని చూసి

"డబ్బేమైనా కావాలా ?" అని అడగనేలేదు అమ్మగారు

"ఏవే ! ఇంకా నిలబడేఉండి పోయావ్?" అని అడిగారు.

ఆ మామూలు ప్రశ్నకు అంతరార్థం బాగా తెల్సుకొన్న రత్తాలు

"అవునండమ్మగారూ ! మా నాగులు ఇంగిలీసు బుక్కు కొనుక్కోవాలంట ! మూడ్రోజుల్నుంచీ పేసీలు పెడుతన్నా దమ్మగారూ !" అంది తలగోక్కుంటూ.

డాక్టరమ్మ మాట్లాడకుండా లోనికి పోయారు. అమ్మగారు అలా మౌనంగా వుంటే సాయంచేస్తారని తెల్సు రత్తాలుకి. మరుక్షణంలో తిరిగి వచ్చారు డబ్బుతో. రత్తాలు ఆనందంతో ఉక్కిరి బిక్కిరయింది.

"సిన్నబాబుకి బలగేశ్శొళ్ళినాయ్ ! మళ్ళీ అమ్మగోరి కడుపు పండనేసేదు"

"నా కప్పుడే మూడు కాన్పులయ్యాయ్ !"

రత్తాలు మాటలు డాక్టరమ్మ విన్పించుకోలేదు కాబోలు ! ఏమీ అనలేదు.

"ఈ మూడ్రూపాయలూ పట్టుకెళ్లు!" అంటూ రత్తాలు చేతిలో నోట్లు పడేసారు.

రత్తాలు డబ్బును బెంగుకు కడుతూంటే అన్నార్నామె-

"చూడు రత్తాలూ ! నీతో చాలా కాలంగా చెప్పాలనుకుంటున్నా !"

"చెప్పండమ్మగోరూ !" అంది హుషారుగా

"నీకు నలుగురు పిల్లలు కదా ఇంక పుట్టకుండా చేసుకోకూడదూ ! నీ కుటుంబ క్షేమంకోరే చెబుతున్నా. బలవంతంలేదు !"

సిగ్గుతో తలవంచుకొని నేలచూపులు చూస్తూ అంది. నానే సేత్తానమ్మగారూ ! ఆడితో సెప్పిసెప్పి నోరు నెప్పెట్టి ఊరుకొన్నా ! నా కాపరేష నంటే సానా బయ్యం అమ్మగారూ !"

"సరే నూకరాజును ఆనక ఒకసారి రమ్మను ! వాడితోనే చెబుతా !"

"ఆ దూర్లో లేడమ్మగారూ! ఆఫీసరు గారితో అయిదారాబాదెల్లాడు ! వారం రోజులుదాకా రాడు !

"రత్తాలూ !"

"సెప్పండమ్మగోరూ ! బజారెళ్ళమంటారా ?"

"అహ ! అక్కర్లేదుగానీ ఓ గంట పోయాక అలా హాస్పిటల్‌కి రా ! పనుంది !"

"తప్పకుండా వత్తానమ్మగోరూ !''

"సరే వెళ్ళు ! నాకూ టైమవుతోంది !" అంటూ అమ్మగారు లోపలికి పోగానే బయలుదేరింది రత్తాలు.

హాస్పిటల్‌లో ఆపరేషన్ చేయించుకొన్న స్త్రీలను యిద్దరి ముగ్గురిని పలక

రించి అన్ని వివరాలు అడిగారు డాక్ట రమ్మ, రత్తాలును దగ్గర పెట్టి. రత్తాలు కున్న భయాలనూ, సందేహాలనూ ఆ విధంగా తీర్చింది. డాక్టరమ్మ చివరకు ఆపరేషనుకు వొప్పించారు. నూకరాజు హైదరాబాదునుంచి రా కుం డా నే ఆపరేషను చేసారు రత్తాలుకు. వారం రోజులు హాస్పిటల్లో ఉండి తిరిగి ఇంటికి వచ్చింది రత్తాలు డబ్బుతో.

* * *

"ఒరే బావూ< మీ అయ్యొత్తే ఏపీ కొన్నియ్యడు రా ! బేగా బజారెళ్ళి పుత్తకాలూ అయ్యీ కొని తెచ్చుకో !" అంది. పదిరూపాయలనోటును బయటకు తీసి మడతలు విప్పి పరీక్షగా చూస్తున్న కొడుకుతో.

నూకరాజు అదే క్షణంలో మబ్బులేని ఉరుములా వూడిపడ్డాడు. కొడుకు చేతిలో పెళపెళలాడుతున్న కొత్త పది రూపాయల నోటుని చూసిన అతని కళ్లు మిలమిల మెరిసిపోయాయ్ నోరు చప్ప రించాడు తండ్రిని చూసి తత్తరపడ్తూ నోటుని షాంటుజేబులో కుక్కుకొన్నాడు నాగులు ఆ డబ్బు మొగుడి కంటబడి నందుకు కంగారుపడింది రత్తాలు. లాక్కుపోతాడేమోనని భయపడింది.

"ఏటి! జమీందారులా పదిరూపాయల నోటిచ్చి కొడుకుని కొనుక్కోమంటు న్నావ్ ?" అడిగాడు చేతి సంచీని నులక మంచంమీదకి విసిరి రత్తాలు జవాబు చెప్పలేదు. బయటకుపొమ్మని కొడుక్కి సైగజేసింది. అది కనిపెట్టిన నూకరాజు ఒక్క అంగలో కొడుకు చెయ్యిపట్టు కొని తనదగ్గరకు లాక్కొన్నాడు. బిత్తరగా చూసాడు నాగులు తల్లివైపు.

"అణ్ణి వొగ్గే మావా !! ఆడి కర్జంటు పనుంది !"

"ఏటీ ? బుక్కులు కొనుక్కోడం అర్జంటు పనా ?" అని గలగలా నవ్వి "ఒరేయ్ నాగులూ ! ఆ పదిమీద మరో అయిదేసి జీతాలొచ్చాకిత్తాగానీ ఆ కాయితం యిటు పడీరా ! నాలిక నాక్కు పోతోంది ! ఎదవది వారం రోజు లయింది గ్లాసుమీద గ్లాసేసుకొని ! ఇలా తేరా ! అలా అమ్మేపు సూత్తా వేరా !"

దూరంగా జరగబోతూన్న కొడుకు వైపు ఆశగా లాలనగా చూశాడు. నాలుగడుగులు దూరంగా జరిగి జేబులో చెయ్యి పెట్టుకొని గట్టిగా పట్టుకున్నాడు నాగులు. కొడుకు వాలకం చూసిన తండ్రి దగ్గరగా వెళ్ళి రెక్క పట్టుకొన్నాడు.

"అణ్ణి ఒగ్గే మావా ! పెద్ద పరీచ్చలు దగ్గిరి కొత్తున్నాయ్ ! ఆడు పుత్తకాలు కొనుక్కోవాల! నేపోతే పరీచ్చ పోద్ది!"

"ఏటీ ? పదిరూపాయల పుస్తకాలా ? మతిగానీ పోయిందేటే మీ యిద్దరికీ ?" ఆశ్చర్యంగా అడిగాడు దగ్గరగా రాబో తున్న భార్యను దూరంగా తోస్తూ.



"తిరిగ్గా కొనుక్కోవచ్చుగానీ ఆ పదీ యిలా పడీయ్‌రా ఎదవా ! లేపోతే మక్కెలిరగదన్నగల్ను !"

అంటూ కొడుకుచేతిని జేబులోంచి బయటకు లాగేసాడు. నోటుని నలిపి గట్టిగా పిడికిటితో పట్టుకొన్నాడు నాగులు భయంగా చూస్తూ.

"ఏరా యిత్తావా ? యియ్యవా ?" కళ్లురిమాడు.

"నే నియ్యను !" ధైర్యం తెచ్చుకొన్నాడు నాగులు.

"ఇయ్యవూ ?" అంటూ కొడుకు వీపుమీద నాలుగుదెబ్బలు వేసాడు

ఏడుపు లంకించుకొన్నాడు కానీ చేతి పట్టు విడవలేదు నాగులు

"అణ్ణి వొగ్గుతావా వొగ్గవా ?'' అంటూ కొడుకును విడిపించడానికి పెనుగులాడింది రత్తాలు.

''నాయాం! నిన్ను సూసేకదే ఆడిలా తిరుగుతున్నాడు !" కోపంగా గట్టిగా ఓతోపు తోసాడు భార్యని.

ఆ తోపుకు పోయి గుడిసెరాటకు గుద్దుకొంది రత్తాలు. నుదురుమీద దెబ్బ తగిలింది. రక్తమండలం అయింది.

"ఏరా యిత్తావా యియ్యవా ! నాకు తిక్క రేగిందంటే ఓ పోటు పొడిసేసి ఆ నోటుని లాక్కుపోతా !"

కొడుకుమీదకిలంఘించాడునూకరాజు.

రక్తం కారుతున్నా లక్ష్యపెట్టకుండా గబగబా లేచి భర్తకు అడ్డంగా నిలబడింది రత్తాలు.

"ఇయ్యాలీ గుడిసిలో ఎవరి పాణం అయినా పోవాలా ఆ నోటు నీ చేతి లోకి రావాల ! ఒరే నాగులూ ! ఎదవా! పారిపోరా !'' అంది ఉద్రేకంగా కొడుకుని ఒకచేత్తో తోసి భర్తను మరో చేత్తో అడ్డుకొంటూ.

''నే నెందుకు పారిపోవాల ! నాకేటి బయ్యం!" మొండిగానిలబడ్డాడు నాగులు.

విషమపరిస్థితిలో పడింది రత్తాలు !

"ఆడికీయేడు పెద్దపరీచ్చలుమావాఁ! పుత్తకాల్లేపోతే ఎట్లాగవుద్ది ? అణ్ణి పోనీ మావాఁ !" భర్తను బ్రతిమాలింది

"అయ్యి తరవాత కొనుక్కుంటాడు గానీ నా కర్జంటుగా డబ్బు కావాల !" మొండిపట్టు వదల్లేదు నూకరాజు.

"హు ? అర్జంటట ! పీకలదాకా తాగేసి కుళ్లుకాలవల్లోపడి ఏడవడానికి!" అంటూ తండ్రిని అసహ్యంగా చూసాడు నాగులు.

"నా యిట్టంరా ! నాను తాగుతాను ! నువ్వెవడివి అడగటానికి ?" పెళ్లాన్ని పక్కకు తోసి కొడుకు మీదకి ఉరికాడు మరలా ; తక్కిన పిల్లలు భయంగా చూస్తూ దూరంగా నిలబడి ఉండిపోయారు. మరలా పెనుగులాట ప్రారంభంఅయింది తల్లీకొడుకులిద్దరూ కలిసి నూకరాజును గట్టిగా తోసారు. మంచంమీద పడ్డాడు నూకరాజు.

"తాగుతాట్ట ! తాగుతాడు ! అంత కన్నా నువ్వేం చెయ్యగలవ్ ? ఇంట్లో పెళ్లాం పిల్లలూ వున్నారూ ఆళ్లకూ తిండి పెట్టాలా అని గానంలేదు ! పేకాట ! బేకెట్లూ ! తాగుడూ ! ఆకలేత్తే గుడిసి కొత్తావ్ ! ఎక్కణ్ణుంచొస్తాది తిండి ? బాగా తాగేసి కుళ్లుకాలవల్లో దొల్లు తావ్, పందులు దొల్లినట్టు ! పంది పిల్లల్ని కనేసినటు కనేసావ్గానీ తిండి పెట్టవ్ ! ఛీ ఛీ ! నువ్వున్నావని చెప్పుకోడానికి సిగ్గుగా ఉంది ! ఎలా ఏడుత్తావో ఏడు ! నే నెక్కడికో పోతా ! ఈ ఊళ్లోనే ఉండను ! ఈ డబ్బు తీసుకొని నీ యిట్టం వచ్చినట్టూ ఏడు ?" ఆవేశంగా అనేసి ఆ నోటుని ఉండలా చుట్టి, తండ్రి మొహాన విసిరి గబగబా బయటకుపోయాడు నాగులు.

కొడుకు మాటలకి చేష్టలకి నిశ్చేష్టురాలైంది రత్తాలు నూకరాజు కొడుకు ధోరణికి ఆశ్చర్యపోయాడు. నోటమాట రాలేదు. మంచంమీదనుంచి లేవలేక పోయాడు గబాలున బయటకు వెళ్ళి చూసింది రత్తాలు. వెనక్కి తిరిగి చూడకుండా గబగబా పోతున్న కొడుకుని చూసి కంగారుపడింది. భర్తపై వెర్రికోపం వచ్చింది. ఆ పైన ఏడుపు వచ్చింది.

"నేనూ పిల్లలూ కూడా ఎక్కడికో పోతాం! నీ ధర్మమా అని కన్నాను గదా పిల్లల్ని! ఆళ్లని అడుక్కోమని వూళ్లోకి పంపి ఆళ్ళు తెచ్చింది తింటూ నా జివ్వానికి పడియేడుత్తూ!"

అంటూ ఆఖరిపిల్లను చంకనేసుకొంది రత్తాలు. మిగిలిన పిల్లల్ని బయలుదేరమంది.

నూకరాజు తిక్క యెగిరిపోయింది. పశ్చాత్తాపం పొందాడు. చివాల్న లేచి భార్యకు అడ్డంగా నిలబడ్డాడు.

"ఎక్కడికి పోతారే నన్నొగ్గేసి ?"

"అడ్డు లెగు మావాఁ! ఎక్కడికో పోతాం! బిచ్చం ఎత్తుకోడానికి ఏ ఊరైనా ఒక్కటే! ఈ ఈ ఊళ్లో ఉండవులే! నీ యిట్టం వచ్చినట్టు తాగి తందనాలాడు! అడిగేవోరుండరు!" భోరున యేడుస్తూ అడ్డంగావున్న భర్త చేతిని పక్కకు తోసింది.

నూకరాజు అడ్డు లేవలేదు!

"నా మాటినవే! అలాంటి పనులు యింకెప్పుడూ సెయ్యనే! నాను తాగనంటే తాగను! నన్నొదిలి పోమాకే!" ప్రాధేయపడ్డాడు అతని గొంతు గద్గదమైంది.

భర్త కళ్ళలో నీటిని చూసింది.

"తాగుబోతోళ్ళ మాటలు నమ్మకూడదు! ఇలాగే ఇదివరకెన్నో సార్లన్నావ్!"

"నిజమేనే! నా మాట నమ్మవే! పిల్లలమీదొట్టు!" భార్య చంకలోఉన్న పిల్లాడి నెత్తిమీద చెయ్యేసాడు.

"నిజంగా నమ్మమంటావా ?"

అడిగింది అపనమ్మకంగా.

"నా మాట నమ్ము రత్తాలూ! నీ మీదొట్టు ?" పశ్చాత్తాపంగా భార్య కళ్లలోకి చూసాడు.

గబాల్న చంకలోని పిల్లడ్ని క్రిందకి దించింది. భర్త కళ్లలోకి చూసింది ఆప్యాయంగా. భర్తలోని పతివ్రతనకి పరవశం చెందింది.

"నాగుల్ని లాక్కురా మావా! ఆడి కసలే కోపం ఎక్కువ! ఏ పనైనా సేసేత్తాడు! రైలు కిందయినా పడతాడు! ఆడు నీకు వారసుడేగదా! బేగెల్లు మావా!" భర్తను తొందర చేసింది.

"ఆ మాటనకే రత్తాలు! నాకు వారసులొద్దేవద్దు!" అంటూ వీధిలోకి పరుగెత్తాడు నూకరాజు.

———

# జలపాతం

జి. నరసింహమూర్తి



“వెళ్ళిపోతాను ఆంటీ - ఇంకెప్పుడూ ఇక్కడకు రాను. నాన్నను ఓసారి చూసి వెళ్ళిపోతాను,” అంటూ మళ్ళీ ప్రాధేయపడింది వసంత.

“అక్కర్లేదు. నీ ఖర్చులకోసం ఇంట్లో ఉన్నదల్లా ఊర్చి నీ ముఖాన కొడతారు. ఇపుడు పడుతున్న అవస్థలు గాక మళ్ళీ ఇదో గోల. వచ్చినదానివి వచ్చినట్టే వెళ్లు.” నోటికొచ్చినట్లు మాట్లాడుతోంది అనసూయ.

* * *

కూతురు వసంతంటే గోపాలరావుకి కొండంత ప్రేమ. ఎప్పుడూ ఆమె శ్రేయస్సే కోరుకుంటాడు. తన మనసంతా ఆమె దగ్గరే ఉంటాది. కాని పరిస్థితులటువంటివి.

వసంతను దూరం చేసుకున్నాడు. అది తనకు తప్పలేదు. దాని వెనకాల అగ్నిగుండాలున్నాయి. అగాధాలున్నాయి.

మొదటి భార్య సుగుణకు పిల్లలు కలగడంలేదని రెండుసార్లు ఆపరేషను చేయించాడు డాక్టర్ల సలహామీద. అయినా లాభం లేకపోయింది. మనిషి మొదటిన్నుంచీ అనారోగ్యంగా ఉండేది. ఈ ఆపరేషన్లవల్లా, తర్వాత ఆరోగ్యంలో

మార్పులు రావడంవల్లా పూర్తిగా జబ్బుకి అంకితం అయిపోయింది.

జబ్బు తీవ్రత పెరిగేకొలదీ పిల్లల మీద ప్రేమకూడా పెరిగిపోయింది సుగుణకు. జీవితాలు ఎడారులుగా మారలేదు గాని పిల్లలమీద ఆశ పోలేదు.

కడకు ఇద్దరి ఇష్టంమీదా వసంతను ఒక ఆయాదగ్గరనుంచి తెచ్చుకున్నారు.

వసంత పెంపకంలో సుగుణ తన జబ్బు మరచిపోయేది. ఆడపిల్లలకు కూడా సంఘంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్నాయని ఆమె నమ్మింది. వసంతను పెద్ద చదువులు చదివించాలనే కోరిక. ఆమె భవిష్యత్తుమీద భార్యాభర్తలిద్దరికీ ఎన్నో ఆశలున్నాయి

కొంతకాలం తర్వాత సుగుణ మంచాన పడింది. గోపాలరావు అప్పుల్లో పడిపోయాడు. ఆ ఉన్న కొద్ది ఆస్తిమీదా డబ్బు తెచ్చి మందులకోసం ఖర్చు చేశాడు. అయినా భార్య అన్యాయం చేసింది. ఖర్చుతోపాటు కష్టాల్ని కూడా గోపాలరావుకు వదిలి ఒకరోజున స్వర్గానికి వెళ్ళిపోయింది ఏడో యేటన పడిన వసంత మాత్రం తనకు మిగిలిపోయింది.

అదే సమయంలో గోపాలరావు అనసూయను ఏరి కోరి పెళ్లాడాడు.

భార్యాభర్తలిద్దరూ అంత అన్యోన్యంగా కాలం గడిపిన తరువాత మరో స్త్రీని పెళ్లాడడానికి గోపాలరావు ఒప్పుకోడని అంతా అనుకున్నారు. కాని, పెళ్లాడాడు. అదీ భర్త వదిలేసిన ఎవరో దూరపు అమ్మాయిని. పోనీ భర్త వదిలేస్తే భయమేమీలేదు. ఆమెకు ఇద్దరు పిల్లలున్నారు. పెద్దపిల్ల మూగది. పిల్లోడు పుట్టగుడ్డి.

కోరి ఈ సంత నెత్తినెందుకు వేసుకున్నాడు?

కొరగాని ఆదర్శాలతో మూగపిల్లనీ, గుడ్డి కుర్రోన్నీ గొంతుక్కి ఎందుకు వేలాడేసుకున్నాడు? ఎవరికీ తెలియదు. ఎంత అభ్యుదయ భావాలున్నవాడయినా ఇటువంటి త్యాగాన్ని గొంతుక్కి బిగించుకోడు.

అది వయస్సు పెట్టిన తొందరన డానికి కూడా లేదు. అతనికి ఒకవిధంగా అది పెళ్లాడవలసిన వయస్సు కూడా కాదు. కాని అంతా అయిపోయింది. గోపాలరావు జీవితంలో చిత్రంగా మరో స్త్రీ ప్రవేశించింది.

అనసూయ తన ఇంట్లో అడుగు పెట్టినప్పుడు కూతురు వసంతని చూపిస్తూ "ఈ బిడ్డకూడా నీ బిడ్డే అనసూయా!" అన్నాడు. అప్పుడు ఆమె లో కనిపించిన విముఖతా, ఈర్ష్యా తను, ఎన్నటికీ మరువలేడు. ఆ రోజూ, ఆ ఘటనా అతనిలో ముద్రపడిపోయింది. ఆశించిందీ, అనుకున్నదీ తలక్రిందులైంది. తన గుండెల్లో దాచుకున్నవన్నీ లోయల్లోకి త్రోసేశాడు.

గోపాలరావుకి ఇంతవరకూ వసంత

బాధ్యత మాత్రమే ఉండేది. ఇప్పుడు మరో ఇద్దరు పిల్లల్ని పెంచాలి. భార్యను పెంచాలి. ఆర్థికసమస్యలు అతన్ని వేటాడుతున్నాయి. వాటినే తిరిగి వేటాడకపోతే మనిషి మనుగడ రూపు మాసిపోతుంది.

సంపాదించాలి. కుటుంబాన్ని పోషించాలి. ఎన్నో ప్రయత్నాలు చేసాడు. కడకు ఓ కలపదుకాణం అతన్ని చిన్న గుమాస్తాగా స్వీకరించింది. నీ సంసారం కొండంతయినా నా జీతాన్ని మాత్రం గులకరాడుకి మించి ఇవ్వనంది !

గోపాలరావుకి ఇంకెక్కడా దగ్గర్లో అంతకంటే మంచి పని దొరకలేదు. రాజీపడి మెడ దించుకున్నాడు. నవ్వుతూ నడుం వంచాడు.

కొంత కాలం గడిచింది.

గోపాలరావు సాయంత్రం యింటి కొచ్చేసరికి అనసూయ వసంతమీద కేకలేస్తుంది.

"నన్ను అమ్మా అన్నావంటే నీ గొంతు నులిమేస్తాను. నీకు నేనెలా అమ్మనవుతానే దిక్కుమాలినదానా !" అంటూ మళ్లీ బలంకొద్దీ కొడుతుంది.

గోపాలరావు సిలువవేయబడ్డ క్రీస్తులా అలాగే గోడకి జేరబడిపోయాడు. క్రీస్తుకి చేతులకీ కాళ్లకీ మేకులు కొట్టారు. కాని తన హృదయానికి కూడా మేకులు కొట్టినట్టుంది.

వసంతకు తల్లిప్రేమ కరువవ్వకూడదని కదూ తాను అనసూయను పెళ్లాడింది.

అనసూయ బిడ్డల్ని కన్నది. కాని తక్కిన బిడ్డమీద ఏ కొంచమూ ఆదరణ చూపలేకపోతుంది. ఆమెది మాత్రం హృదయం కాదా ?

తాను మాత్రం తండ్రిగా ఆ అంగవైకల్యం ఉన్న పిల్లల్ని స్వీకరించాడు. ఎందుకని ?— వసంత తల్లిగా ఆమె ఆదరిస్తాదనే కదా !

"నన్నెప్పుడైనా అమ్మా అన్నావంటే కొరివికాల్చి వాతలేస్తాను. జాగ్రత్త" అంది జడిపిస్తూ.

"అనను. ఎప్పుడూ అనను." వణికిపోతుంది ఎప్పుడూ ఇటువంటి భయ మెరుగని వసంత

"ఈ సంగతి మీ నాన్నకు చెప్పావంటే తన్ని యీడుస్తాను."

"మరేమనను అమ్మా ?"

"ఆంటీ అను. అంతే."

అప్పన్నుంచీ వసంత అనసూయను 'ఆంటీ' అనే అంటూది.

ఇంట్లో వసంతకు అన్యాయం జరుగుతోంది. పసిహృదయం పగిలిపోతుంది. ఈ ఘోరం భరించలేకపోతున్నాడు గోపాలరావు.

వసంత పసిమనసుమీద అనసూయ పొడిచిన పోట్లు పెద్ద పెద్ద గాయాలై పోయాయి. ఆ గాయాల్ని పొడిచినవారే మాన్పాలి. తనకది సాధ్యంకాదు.

గాయపడ్డ ఆమనసు మరెన్ని గాయాలకు గురి కాకుండా చూడాలి. వసంత ఈ నరకంనుంచి బయటికెళ్లిపోవాలి. తన భవిష్యత్తు బంగారుబాట కావాలి. తన కాళ్లమీద తాను నిలబడాలి ప్రయోజకు రాలు కావాలి. సుగుణ వసంత జీతంలో చూడాలన్న వెలుగూ, విలువా ఆను చూపించాలి, ఎలా ?–

ఈ వాతావరణం తనను పెరగ నివ్వదు. అది ఆమెను విరగదీస్తుంది. అంగవిహీనులైన ఈ పిల్లలమధ్య తను పైకి రాలేదు. అన్నీ వున్నా వాళ్లతో పాటు ఓ అంగవిహీనురాలై బ్రతకాలి బ్రతుకు చీకటి చేసుకోవాలి.

గోపాలరావు ఇంకా చాలా లోతు కంటా వెళ్ళాడు. ఆలోచించాడు. వసంత గతంలో కెళ్ళాడు. ఆపుటలన్నీ పరీక్షిం చాడు. ఈ కుటిల వాతావరణం ఆమె జీవితాన్ని కాల రాసేస్తుంది తన ఆర్థిక సమస్యలు ఆమె పురోభివృద్ధికి కత్తిపోటు.

వసంత వెళ్ళిపోవాలి. దూరంగా వెళ్ళిపోవాలి. తన చదువు తాను చదువు కోవాలి. తన తోవ తాను చూసుకోవాలి. ఆమె ప్రవాహంలా పరుగెత్తాలి. దాని నెవరూ అడ్డుకోరాదు. ఆ అధికారం ఎవరికీ లేదు. దీనికంతకూ ఒకటే పరిష్కారం !

వసంతను తీసుకెళ్ళి దూరంగా ఓ మిషనరీలో చేర్పించేశాడు. వసంతను ఆశీర్వదించమని దేవున్ని వేడుకున్నాడు.

అనసూయ పీడ విరగడై పోయిందనుకుంది. చురుకుగా, తెలివిగా, అందంగా ఉండే వసంతని తన పిల్లల మధ్య చూడడం అంటే అనసూయకు ఒళ్ళుమంట. ఏ అంగవైకల్యమూ లేని ఆ వసంత తన బిడ్డలమధ్య తిరుగు తుంటే ఆమెకు ద్వేషం. సెలవుల్లో ఎప్పు డయినా వసంత యింటికొస్తే అనసూయ ఆమెను రాబందులా పీక్కుతినేది.

అటువంటప్పుడు వసంతకు పోయిన తల్లి సుగుణ జ్ఞాపకం వచ్చేది. ఆమె ప్రేమా, ఆదరణా తలచుకుంటే అనసూయ ఆంటీమీద అసహ్యమూ, ఆగ్రహమూ పెరిగిపోయేవి.

ఆ తల్లి ఎక్కడ దొరుకుతుంది తనకు. ఆ అమృతమూర్తిని తన కెవరిస్తారు ?

* * *

వెళ్ళిపొమ్మంటుంది ఆంటీ.

ఒకసారి నాన్నను చూడాలి.

అన్ని శ్రమలనూ ఆనందంగా అనుభ విస్తూ తన భవిష్యత్తును ఇలా తీర్చి దిద్దిన నాన్నను చూసి వెళ్ళిపోవాలి.

తనను మిషనరీ చదివించింది. తల్లిలా పెంచింది. పూనా పంపి అక్కడ తనకు స్టెనోగా ట్రైనింగ్ ఇచ్చింది.

ఇపుడు తనకు ఉద్యోగం కూడా

దొరికింది. తన బతుకు తాను బతక గలదు.

సంసారభారంతోపాటు వయోభారం కూడా మోయలేని గోపాలరావు అప్పుడే అక్కడికి వచ్చాడు.

కళ్ళద్దాలు సరిజేసుకుని వసంతను చూసాడు. చిన్ననాటి వసంత కాదు. పెరిగి పెద్దదయిన వసంత. కూతుర్ని చూసి రెండు సంవత్సరాలయింది. ఆమెలో ఎంతో మార్పు వచ్చింది.

వసంత తండ్రికి నమస్కారం చేసింది.

చినిగిపోయిన బట్టలూ, చిక్కిపోయిన శరీరమూ, క్షీణిస్తున్న ఆరోగ్యమూ చూస్తుంటే ఆమెకు అంతా అర్థ మయ్యింది.

"బాగున్నారా నాన్నా ?" అంటూ ఆప్యాయంగా అడిగింది.

. గోపాలరావు నిట్టూర్చాడు.

ఆ నిట్టూర్పులో ఉన్న బరువే వసంతకు ఓ పెద్ద సమాధానం.

"నీ బాగోగులెప్పుడైనా చూసుకో గలిగానామ్మా ? నాగురించెప్పుడూ ఆలోచించకు."

అలాగే నిలబడిఉంది వసంత.

"గుమ్మంలోనే నిలబడిఉన్నావే తల్లీ, లోనకు నడు" అన్నాడు గోపాలరావు.

గుమ్మంకి అడ్డంగా అ న సూ య నిలబడి ఉంది.

మనసులో ఆగ్రహం మనిషినిండా కనబడుతోంది.

లోననుంచి మూగ కూతురూ, గుడ్డి కొడుకూ బయటకు రాబోతుంటే కసిరి లోనకు గెంటింది. వాళ్ళమీద వంకబెట్టి వసంతను తిట్టింది.

వసంతకు లోనకి అడుగు వెయ్యబుద్ధి కాలేదు

"ఒక ముఖ్యమైన విషయం చెప్పి వెళ్ళడాని కొచ్చాను నాన్నా."

"చెప్పు తల్లీ !"

"నాకు ఉద్యోగం వచ్చింది నాన్నా!"

అనసూయ ముఖం తెల్లబడిపోయింది.

"నిన్ను ఆ దేవుడు ఆశీర్వదించాడు తల్లీ," అన్నాడు ఎంతో సంబరపడి పోతూ.

వసంతకు ఉద్యోగం వచ్చిందని విన్న అనసూయలో మరో దుర్బుద్ధి పొడుచు కొచ్చింది. ఆమె సంపాదనమీద ఆశ రేగింది. తనలో స్వార్థం, ఆశా నిండుకున్నాయి.

"లోనకు రా వసంతా !" అంటూ ప్రేమ ఒలకబోసింది.

ఆంటీ కుచ్చితం వసంతకు అర్థం కాకపోలేదు.

"నేను లోనకు రావడానికి రాలేదు ఆంటీ – నాన్నను చూసిపోవడాని కొచ్చాను. అంతే."

"అయితే నీ తోవ నువ్వు చూసు కుంటున్నా వన్నమాట."



"అవును ఆంటీ." నిర్భయంగా సమాధాన మిచ్చింది.

ఆమె సమాధానం విన్న అనసూయకు కోపం వచ్చింది.

"ఇంతకాలంగా పాముకి పాలుపోసి పెంచాము."

"పామువి నువ్వు. బిడ్డల్ని గుడ్డులోనే కబళించే విషసర్పానివి నువ్వు

అనసూయా," అంటూ కోపంతో రెచ్చిపోయాడు గోపాలరావు.

గోపాలరావు ఎందుకలా అన్నాడో అనసూయకు అర్థంకాలేదు.

"ఏ పాపాత్మురాలో పడేసినదాన్ని తెచ్చి ఇంత పెద్దదాన్ని చేస్తే కడకు ఆ పాడుబుద్ధులే చూపించింది."

గోపాలరావులో సహనం చచ్చిపోయింది. ఎంతోకాలంగా గుండెల్లో దాచుకుంటూ వస్తున్న ఆ అగ్నిగోళం బద్దలవడానికి సిద్ధమవుతుంది, కాని బలవంతంగా అదంతా తనలోనే మింగుకోవాలనుకుంటున్నాడు.

"అనసూయా ! నాకు కోపం రప్పించకు వెళ్ళు, లోనకెళ్ళు."

"ఇంతకాలమూ, ఈ యింట్లో తిని, ఈవేళ ఉద్యోగం దొరకడంతో తన తోవ తాను చూసుకుంటున్న మీ ముద్దుల కూతురుమీద కోపం రావడంలేదా ?"

"అదంతా నా యిష్టం. నా కూతురు సుఖమే నేను కోరుకునేది."

"హుం, మీకో కూతురూ, దానికో సుఖమూను. అసలు దానికి మీరెలా తండ్రయ్యారు ? ఎవడికో దానమ్మ కని వీధిలో పడేసిపోతే దాన్ని తెచ్చి ఈ యింటి గౌరవం గంగపాలు చెయ్యాలనుకున్నారు. పోనీయండి. ఇటువంటి దుందే నా పిల్లల పరువు కూడా బుగ్గిపాలవుతుంది."

"అనసూయా ! నీ కళ్ళు మూసుకుపోయి మాట్లాడుతున్నావు."

గోపాలరావు ఆవేశం పగ్గాలు తెంచుకుంటోంది.

"నా కళ్ళు కాదు మూసుకుపోత, మీ కూతురు కళ్ళు. అసలు దీన్నని యేం లాభంలే, దీన్ని కన్నదాన్ని అనాలి."

అతని గుండెల్లో దాచుకుంటూ వస్తున్న ఆ అగ్నిగోళం ఒక్కసారి బద్దలయింది.

"అను. నీ యిష్టం వచ్చిన ఈ వసంతను కన్నది ఎవరో నువ్వు చూడాలనుకుంటున్నావా ? ఎవరో కాదు. ఆ నీచురాలు ఎక్కడో లేదు. నేను నిజం చెబుతాను. నా కూతురు వసంతవల్ల నీ యింటి గౌరవం గంగపాలు కాకూడదు. నీ పిల్లల పరువు బుగ్గిపాలవకూడదు. అందుకే చెబుతున్నాను.

—నువ్వెవరివో, నీ గతజీవితం ఏమిటో నాకు తెలియదనుకున్నావా అనసూయా ? హుం నాకంతా తెలుసు. నేను ఏ రహస్యమూ దాచుకోనవసరం లేదు... నీ భర్త చలపతిరావు ఉద్యోగరీత్యా దూరంగా ఉన్న సమయంలో మరెవడికో గర్భం దాల్చావు. ఈ సంగతి అతనికి తెలియకుండా రహస్యంగా మరోచోటుకెళ్ళి రంగమ్మ అనే ఆయా దగ్గర పురుడు పోసుకుని ఆ బిడ్డను అక్కడే వదిలేసి వెళ్ళిపోయావు. అవునా ? ఆ ఆయాదగ్గరనుంచే మేము



# కవిసమయం

పాలడుగు వెంకటేశ్వరరావు

జులపాల జుట్టు, కళ్ళజోడు, గ్లాస్కో లాల్చీ, పైజామా, కాళ్లకి స్లిప్పర్లు ధరించిన ఒక యువకుడు హోటల్ మాధురి రెండో అంతస్తు నుండి గబ గబ దిగివచ్చి లాన్‌లోకి వచ్చి అటు ఇటు పారచూశాడు. సన్నగా వర్షపు జల్లు పడుతుంది. గేటు దగ్గర ఒక్క రిక్షాయే నిలబడి వుంది

అతను గబగబ రిక్షా వద్దకి వెళ్లేడు.

'ఏయ్ రిక్షా!' అని పిలిచేడు.

'అయ్యా.'

'వస్తావా ? టౌను హాలుకి వెళ్ళాలి.'

'వస్తాను బాబూ.'

అతన్ని ఎక్కించుకొని రిక్షా టౌను హాలువేపు పరుగులు పెట్టింది.

దారిలో అతను రిక్షావాడిని మాటల్లో పెట్టాడు. రిక్షా అద్దె ఎంత, ఎప్పట్నుంచి ఎప్పటివరకు, అద్దె పోగా రోజుకి ఎంత మిగులుతుంది, కుటుంబంలో ఎంత మంది వున్నారు, ఆ సంపాదన అందరికీ సరిపోతుందా, ఎక్కడ వుంటున్నారు. ఎలా తింటున్నారు ఇత్యాది ప్రశ్నలు

అడిగి సమాధానాలు రాబట్టాడు రిక్షావాడి నుంచి.

అతన్లో ఆవేశం పొంగింది. ఉద్రేకం కట్టలు తెంచుకుంది.

ఆది నిల్చుకోలేకపోయాడు. వణికి పోయాడు.

'నీ లాంటి నా సహోదరులందరు చెమటోడ్చి కష్టపడుతున్నారు. అయినా మీకు కడుపునిండా తిండి దొరకటంలేదు. వంటినిండా బట్టలేదు. ఉంటానికి గూడు లేదు. ఘర్మ జలానికి విలువలేదు. వ్చి కాలు కదపకుండానే, పొట్టలు పెంచే వాళ్ళు మేడలు కడ్తున్నారు. అదే మన దౌర్భాగ్యం. మీరే గాదు మన దేశంలో లక్షలాది సోదరీమణులు మగవాడి దౌష్ట్యం ముందు తలవంచి తరతరాల, శతాబ్దాల తరబడి అణగారిపోయి వున్నారు. ఈ పీడితులందరికి విముక్తి కావాలి అదే నా ధ్యేయం. అదే నా లక్ష్యం. అందుకోసం ప్రాణాలకయినా తెగించి పోరాడతాను ' పోరాటం నా ప్రాణం. కనుక సోదరా! వూరడిల్లు. మంచిరోజులు ముందున్నాయి. వాటి మీద ఆశల్ని నిల్పుకో. దీక్షగా శ్రమించి కృషిచెయ్యి. విజయం నీదే. నా వాక్యా తథ్యం...నిజం, అని ఉపన్యసించాడు.

రిక్షా అతను నవ్వుకుని అడిగాడు.

'అయ్యా, ఇంతకీ మీరెవరు? ఏం చేస్తూ వుంటారు? మీది చాల జాలి గుండె సార్.'

'దురదృష్ట జీవి! సోదరా. ఇంకా తెలీలేదా? నేను కవిని 'దూకుడు కవిని'. నా ధోరణికి అడ్డులేదు. నాకు అడ్డు వచ్చినవాడ్ని బండ బూతులు తిట్టి తల వంచుకొనేట్టు చేస్తాను తిట్టుకవితే అయినా నిండుగా బూతులు గుమ్మరిస్తాను ఎవడివాడి కవిత్వంలో లేని లోపాల్ని కూడ వెతికి వెలికిదీసి, బయటపెట్టి దులిపి పారెయ్యగలను. నా కవిత్వం గురించి సొంత డబ్బా అమోఘంగా వాయించుకోగలను. నా వంకర రాతలన్నీ ఘాటు విమర్శలుగా చెలామణి అయేట్టు చేసుకోగలను... అందువలన నేనంటే అందరికీ భయం!'

'అయ్యా. ఇవంతా ఎలా చేయగలరు మీరు?'

'నా అభాగ్య సోదరా!...పత్రిక నాయనా...నా చేతిలో పత్రిక వుంది. అందుచేత నా రాతకి తిరుగులేదు. విన్నావా? అందుకని నేను నీలాంటి పీడితప్రజల కొమ్ము కాశాను. కనుక భయంలేదు. నన్ను నమ్ము. మంచి రోజులు ముందున్నాయి మీకందరికీ...'

'కవిగారూ! చాల కృతజ్ఞులమండి. ఇంతకీ మీ దేవూరు? టౌనుహాలుకి ఎందుకు వెళ్తున్నారు?'

కవి చిత్రంగా చూసాడు.

రిక్షావాడిమీద జాలిని గుమ్మరించాడు చూపుల్తోనే.

'ఇంకా నీకు తెలీదా పీడిత

సహోదరా ! మీ వూరి టౌనుహాలులో ఇపుడు పెద్ద సభ జరగబోతోంది. అందులో నాలాంటి ప్రముఖులయిన కవులు ఉపన్యసిస్తారు నీకు తెలీదుగాని ఇవాళ్టితో మీ వూళ్లో గొప్ప మార్పు వచ్చి తీరుతుంది జనం వుత్తేజితులై ముందుకురుకుతారు. నడుం బిగిస్తారు. కార్యసాధన కుపక్రమిస్తారు...'

బాగానే వుంది కవిగారూ. ఇంతకీ మీ దేవూరు ? ఎక్కడో, ఎప్పుడో చూసి నట్లుంటేను ...... అడగాలనిపించింది. మరేం అనుకోకండి...'

'దాందే ముంది నా సోదర దామోదరా ! ఆంధ్రదేశంలో నేను తిరగని నాడూ వూరులేదు. నేను వుపన్యసించని గొప్ప మీటింగు లేదు. ఎక్కడో చూసి వుంటారు. నన్ను, ఇవాళా చూస్తావుగా. నేనెంత గొప్పగా వుపన్యసిస్తానో, జనం అది విని ఎలాగ వెర్రెత్తిపోతారో : నా సంగతి నీకు తెలీదు. నేను నోరు విప్పితే దిగ్గజాల్లాంటి ముసలి కవులు గూడ గజగజ వణికిపోవల్సిందే బూజు కవులు, పురాణ కవులు, నీతుల కవులు అందరు ఆ ఝంఝూమారుతంలో కొట్టుకుని పోవలసిందే అది గొప్ప ప్రవాహం. అది ఆగదు. ఆగనీయదు...'

టౌనుహాలు వచ్చింది.

కవిగారు దిగారు.

'నీ శ్రమ ఫలితం ఎంత సోదరా ?' జాలిగా అడిగారు కవిగారు.

'మీ దయ బాబూ. మరల మీరు నా రిక్షాలోనే హోటలు కెళ్ళాలి. ఇక్కడే వుంటా '

అంతలో సభానిర్వాహకులు పరుగెత్తుకుని వచ్చారు. 'మీరు రాలేదేమో అని కంగారుపడి తొక్కకు ఛస్తున్నాము. ఎలాగయితేనేం మీరు వచ్చారు. థాంక్స్' అని ఆనందం ప్రకటించారు. 'రాగానే వెంటనే మాధురిలో దిగాను. రేపటిదాకా వుండాలి గదా. అన్నట్టు రేపు వచ్చి ఆ ఎకౌంటు సెటిల్ చేయండి. రూం నంబరు 3౪, అన్నట్టు ఈ రిక్షా అతనికి ఓ రూపాయి ఇవ్వండి. పాపం పేదవాడు. మన సోదరుడు...' అంటూ నవ్వారు కవిగారు.

రిక్షావాడికి డబ్బులు ముట్టాయి.

కవిగార్ని లోనికి తీసుకుని వెళ్ళారు, అట్టహాసంగా.

టౌనుహాలు క్రిక్కిరిసి వుంది, ప్రజలతో.

ఆవేళ కవిగారు ఆవేశంతో వూగి పోయారు. అమోఘంగా కవితలు చదివారు పుస్తకం చూస్తూ. పీడిత జనాళి మీద, వారు కోరుకుంటున్న మార్పుల మీద, అందుకోసం ప్రజలు నిర్వర్తించ వలసిన బాధ్యతల మీద, రాబోయే మార్పుల్ని రానీకుండా అడ్డుపడేవారి మీదా ఏకధాటిగ, రౌద్రంగా పదిహేను కవితలు చదివారు. అన్నీ ఆధునిక కవితలు. ఆ కవితలు చదువుతూ కవి

గారు, వారి గొంతు, కాలు చేతులు తెగ వూగి జనాన్ని కూడ వూపి వదిలి పెట్టాయి.

ఆ తర్వాత,

ఓ గ్లాసు కాఫీ తాగి, చిరునవ్వు నవ్వి-అంతలో దీనంగా మొహం పెట్టి-

భారత స్త్రీ మీదా, ఆమె సమస్యల మీదా, ఆ సమస్యలకి కారకులయిన వారి మీదా, ఆమె అభ్యుదయం మీదా జాలిగ, కరుణాత్మకంగా, రౌద్రంగా-ఈ రసా లన్నింటిని సందర్భానుసారంగా ప్రదర్శిస్తూ, పది కవితలు చదివారు. దాంతో సభలో వున్న ఆడ ప్రేక్షకులు గొల్లుమని ఏడ్చి మొత్తుకున్నంత పనిచేసి ముక్కులు చీదుకుని భుజా లెగరేసారు. తల లూపారు.

సభ దిగ్విజయంగా జరిగింది. కవి గారి మెడనిండా దండలే. కవిగార్ని గురించి అన్నీ పొగడ్తలే. కవి గారి రూముకి వచ్చే పోయే వారితో హోటలు మాధురి కిటకిటలాడింది.

కవిగారిని ఆ జనం వదిలిపెట్టి కవి గార్కి ఒంటరితనం మిగిలేసరికి పన్నెండయింది రాత్రి. బాగా అలంకరించుకుని జరదా కిళ్ళీ నవుల్తూ, సిగరెట్టు వూదుతూ 'మాధురి' బయటికి వచ్చారు కవిగారు.

'ఏయ్ రిక్షా ? !' కవిగారి మాట తూలింది. గుప్పున వాసన కొట్టింది; విస్కీ.

రిక్షావాడు దగ్గర కొచ్చాడు'ఆయ్.' అంటూ దగ్గరగా రమ్మన్నట్టు సౌంజ్ఞచేసి వాడి చెవిలో నోరు పెట్టాడు కవి.

'మంచి సరుకు దొరుకుతుందా ?' రిక్షా వాడు తెల్లపోయాడు. 'తెలీలా ? పిల్లోయి. మంచి పిల్ల' అన్నాడు కవిగారు. రిక్షావాడు తలెత్తి చూసి కవిని గుర్తించి తల పైకీ క్రిందకీ వూపాడు.

'అయితే ఆలస్యం దేనికి ?' ఆనందం పొంగివచ్చింది కవిగారిలో.

'ఇక్కడికే తీసుకురమ్మంటారా ?' అన్నాడు రిక్షావాడు కవిని పరిశీలనగా చూస్తూ

'ఆఁ ? రూము నంబరు 34 వెనకదారినుంచి రండి వెయిట్ చేస్తుంటాను.ఇదుగో,నీకు మంచి బక్షీసు ఇస్తాలే. క్లాసు గుండాలి, ఎంతైనా ఫర్లేదు. అంతా వాళ్ళు నెత్తిన రుద్దేదేలే.'

తల వూపి రిక్షావాడు వూళ్ళోకి పోయేడు.

వెంటనే రూంకి వెళ్ళి, తల దువ్వుకుని అద్దంలో నాల్గుపార్లు అందాన్ని సరిదిద్దు కుని,లాల్చీకి,కర్చీఫుకి, సెంటు రాసుకుని ఆత్రంగా ఎదురుచూ సేడు, ఆ సమయం కోసం కవిగారు పావు గంటలో రిక్షావాడు 34 నెంబరు రూము తలుపు తట్టేడు.

అతని వెనకాలే ముసుగు కప్పుకున్న ఒక స్త్రీ అకారం వుంది.

గదిలోకి వెళ్ళగానే, తలుపు మూసి నవ్వాడు రిక్షావాడు. ఆ స్త్రీ మూర్తి బాత్




రూంలోకి వెళ్ళింది, వెంటనే. కవిగారికి ఉల్లాసం పొంగివచ్చింది.

'సెలక్షను బాగానే వున్నట్టుందోయ్. ఎన్నేళ్ళుంటచ్చు?' కవిగారడిగారు.

'పదిహేడండి. కొత్తగా పెళ్లయింది. మీరు కాస్త జాగర్తగా చూస్తోవాలి.'

'వెరీగుడ్. సర్లె. సర్లె.'

'మీరు నన్ను గమనించలా, ప్రొద్దున తవర్ని టౌనుహాలుకి నేనే తీసికెళ్ళింది గొప్పగా చెప్పారుబాబూ. బ్రహ్మాండం గుంది అన్నట్టు తమరు పుట్టినూరు ఏదో చెప్పలేదు బాబు. అన్నాడు రిక్షావాడు.

'ఏం నాయనా?' విసుగ్గా అన్నారు కవిగారు, రిక్షావాడు బయటికి పోతే బాగుండుననుకుంటూ.

'ఎక్కడో-ఎక్కడో చూసినట్లుం దేనూ?' నవ్వాడు రిక్షావాడు. కవిగారికి బుస్సున కోపం పొంగివచ్చింది. 'ఎక్కడ చూసివుంటావు? నీ మొహం' అన్నాడు.

రిక్షావాడు నవ్వుతూ కవిగారి మొహం లోకి చూస్తూ అన్నాడు. 'తమరి పేరు గణపతి గారండి. చిన్నప్పుడు తెలుగు మాష్టారిచేత పిడిగుద్దులు తినేవారం మనం. మీరు పెళ్ళయాక పెళ్ళాం పోరు పడలేక దేశాలు పట్టి పోయారు, నాటకా లంటూ. మీ వూరు, మా వూరు మన వూరే...'

కవి వులికిపడ్డాడు చిరాకుపడ్డాడు. అసహనంగా మొహం పెట్టాడు. గంభీర మైన ఠీవితో 'చాల్లే! ఈ సొదంతా ఎందుకుగాని త్వరగా పని కానివ్వు,' అంటూ తొందరపెట్టాడు.

అంతలో ఆ 'స్త్రీ' వచ్చి, కవిని వాటేసుకుంది, గట్టిగా. కవిగారు ఉక్కిరి బిక్కిరయ్యారు.

'నన్ను రక్షించాలి కవి బాబూ. లేక పోతే నన్ను బతకనీడు నా భర్త. ఛంపేస్తాడు. నాకు మీరే దిక్కు, బాబోయి. నేను చచ్చిపోలేను కవి బాబూ. నన్ను

నువ్వేకాపాడాలి బాబూ' అంటూ వూపిరాడ నంతగా కవిమీద పడింది. తన హృదయం ద్రవించి సట్లసిపించిం. కవికి జాలిగా మూలిగాడు.

కవి ఆ స్త్రీని ప్యారాన్నుగా ఓదారుస్తూ సంగతిసందర్భాలు విచారిస్తూ వుండగా—ఒక గొప్ప క్షణాన—ఆ స్త్రీ మూర్తి మీసం గరుగ్గా కవి చంపకి తగిలింది! కవి వులికిపడ్డాడు! ఆ మూర్తి, నిజానికి పురుషుడేనని తేలక, కవి కుపితుడై, 'ఎవడ్రా నువ్వు' అన్నాడు. రౌద్రంగా గర్జించాడు

'నీ మొగుణ్ణిరా' అంది, ఆ స్త్రీ, వేషం తీసేస్తూ. అంటోతుసంటి ఉరదుగుల సత్తిగాడి యొక్క అవతారం ఎత్తి.

'ఇందాక టౌనుహాలులో స్త్రీ జనాన్ని వుద్ధరిస్తానని ఆవేశంతో కోతలు కోసావుగదరా రాస్కెల్. ఇలాగేనుట్రా స్త్రీల నుద్ధరించటం? సిగ్గులేదట్రా? నువ్వు కవివా? దూకుడు త్రాగుబోతు కవివా? బ్లడీఫెలో, నువ్వు మనిషి అన్పించ కోటానికయినా అర్హుడివి కాదు గదరా!

ఇటువంటి నీచప్రవృత్తిగల నువ్వా ప్రజల్ని నడిపించేది? ఎందుకురా నువ్వూ, నీకవిత్వమూ, స్త్రీ గురించి స్లోగన్సూ? ఈసారి గనుక ఈ వూరొచ్చి నోరు తెరిచావో వుప్పులో పాతేస్తాను జాగ్రత్త...' అంటూ భీకరంగా గర్జించాడు అ 'స్త్రీ మూర్తి,' సత్తిగాడు కవి గారు తలవంచుకున్నారు. మొహాన నెత్తురుచుక్క లేదు భయంతో గజగజా వణికారు. 'ఒరే సత్తిగా చాల్లేరా. చచ్చిన పామునేం చంపుతావు?' అన్నాడు రిక్షా వాడు.

'కాదురా కామిగా ఇటువంటి పాముల్ని చంపి తగలెట్టాలి.' అంటూ కవిమీదకి వురకబోయిన సత్తిగాడ్ని, కామిగాడు బయటికి లాక్కొచ్చి తలుపేస్తూ 'గణపతీ! ఎదిగాననుకుంటున్నావ్!? పోన్లే తలుపేసుకుని పడుకో. ఇంతకీ నువ్వు మమ్మల్ని గుర్తించలేదను కుంటాను. సత్తిగాడూ, శర్మగాడూ, నేనూ, నువ్వూ క్లాసుమేట్సుము, అయిదో తరగతి దాకా. ఉద్యోగాల్లేక ఇలాగ మేము రిక్షా లాగి బ్రతుకుతున్నాంలే మార్పు—నువ్వు చెప్పిన ఆ మార్పు తప్పక వస్తుందిరా. కాని—కాని—అది నీ లాంటిదగుల్బాజీలవల్లగాదుగుర్తుంచుకో. మరలా ఇలాంటి వేషాలు ఎక్కడా వెయ్యకు. జాగ్రత్త. వస్తాం' అంటూ దఢీమని తలుపు వేసాడు, 'రిక్షా కామిగాడు.'

కవిగారి గుండె చలన వేగం ఎక్కువయి పావుగంటసేపు అలాగే జోరుగా కొట్టుకుంటూ వుండింది. కాళ్ళు వణుకు పోవటానికి అరగంట పట్టింది.

అప్పటికీ శరీరం నిండా చమటలు కారటం మానలేదు. అవమానంతో, కోపంతో పళ్ళు కొరకటం తగ్గలేదు. కవిగారు కపి అవతార మెత్తేవ

---

# కౌగిలి

## జి. నాగేశ్వర్



"అరే సోం! మన ప్రోగ్రాం విషయం తేల్చి చెప్పండి. కొన్నాళ్ల పాటు హాయిగా గడుపుదామంటే ఒక్కడూ రాడేమిట్రా ?" వసంతరావు అన్నాడు.

"వీడో ప్రకృతి ఆరాధకుడిలా వున్నాడేమిట్రా?" సుబ్బారావు అన్నాడు.

"కథ ఏమన్నా వ్రాయాలా ?" అన్నాడు నవ్వుతూ సోమసుందరం.

వాళ్లంతా మైసూరు అడవులు చూడాలని నిర్ణయించుకున్నారు. కాని యింత వరకూ ప్రయాణం పడలేదు.

"అడవిని చూడటం నీ కిష్టంలేదా ఏమిట్రా ?" సుబ్బారావు అడిగాడు.

"నాకు చచ్చే యిష్టం. మా తాతగారి వద్ద యిప్పటికీ ఓ తుపాకి వుంది. ఆయన చిన్నతనంలో పులిని చంపాడట."

"నీ వన్నీ మీ తాతగారి లక్షణా లేరా ?" వ్యంగ్యంగా అన్నాడు సోమసుందరం.

"ముందు ప్రయాణ మెప్పుడో నిర్ణయించండిరా ?" విసుగ్గా అన్నాడు వసంతరావు.

"వెళదాంలేరా బాబూ! పెళ్ళాం బిడ్డలు లేనివాడివి, చంద్రమండలమైనా సిద్ధమేనంటావు. మా అర్ధాంగులు మేమూ ఏస్తానుని పోరుపెట్టగలరు." సోమసుందరం అన్నాడు.

"మనకి నిజం చెప్పటం అలవాటు లేదు కదరా! బెంగుళూరు ఆఫీసు పని మీద వెళుతున్నానని చెప్పెయ్!" సుబ్బారావు సలహా యిచ్చాడు.

"నీ ఉచిత సలహాను పాటిస్తాను. నీ విషయం ఏమిటి ?"

"నేనేనాడో రెడీ అయ్యాను. అడవిలో మంచి టేకు చూసి వ్యాపారం చేద్దామనుకుంటున్నాను."

"నాకు తెల్సురా. నీ వే పనిచేసినా పుణ్యం పురుషార్ధం వుంటుంది." ఎత్తి పొడిశాడు.

ముగ్గురూ శుక్రవారం ప్రయాణానికి ముహూర్తం పెట్టారు. మైసూరు అడవులు మంచి టేకు, కలపకే కాక క్రూరమృగాలకు కూడా ప్రసిద్ధి.

వసంతరావు బళ్ళారిలోవున్న మేన మామకు టెలిగ్రాం యిచ్చాడు. మాలతికి పెద్ద ఉత్తరం వ్రాశాడు.

అనుకున్న ప్రకారం శుక్రవారం పెట్టే, బెడ్డింగులతో మిత్రత్రయం బయలుదేరారు. రామస్వామి ఆదరంగా వారిని యింట్లోకి ఆహ్వానించాడు. మాలతి వసంతరావుని చూసి పొంగి పోయింది.

ఆ రోజు రాత్రి అందరూ ముందు హాలులో పడుకోటానికి ఏర్పాటుచేసింది. ప్రయాణం చేయటంవల్ల సుబ్బారావు, సోమసుందరం వెంటనే నిద్రలోకి జారుకున్నారు.

వసంతరావు మాలతికోసం చాలా సేపు మేలుకొనివున్నాడు. మాలతికి కూడా అతనితో ఏకాంతంగా మాట్లాడా లనీ మనసులోని కోరికను వెళ్ళడించా లని వుంది.

ఆమె అతన్ని కలుసుకొనేటప్పటికి రాత్రి చాలా టైం అయింది.

చల్లనిగాలి మత్తుగా వారి శరీరాలకు తగులుతుంది.

"బావా ! మమ్మల్ని పూర్తిగా మర్చి పోయినట్లున్నావు ?"

"నీవు మనస్సులో మెదిలినప్పుడల్లా నాకు మతిమరుపు ఎక్కువౌతుంది" అన్నాడు కొంటెగా.

ఆమె నవ్వింది.

"మాలా ! రేపు మేము అడవిని చూడబోతున్నాము."

"అయితే తమరు వచ్చింది నాకోసం కాదన్నమాట."

"కాదని అంటే నీవు వూరుకుం టావా ?"

"బావా ! నీతో చాలా చెప్పాలి."

"యిప్పుడే చాలా చెప్పావు. యింకా ఏం మిగిలివుంది !"

"అదికాదు, మన విషయం."

"సరే చెప్పు. వింటాను."

"నన్ను పెళ్ళిచేసుకోవటం నీ కిష్ట మేనా ?" కుండ బద్దలు కొట్టినట్లు అడిగింది.

"లేదు" అన్నాడు ఆమె కోపం తెప్పుకోవటం అతనికి చూడబుద్ధవు తుంది

"యిన్నాళ్ళూ ఆశలు పెంచటం

ఎందుకు ?" అని విసురుగా వెళ్ళి పోయింది.

అతను ఎంత పిలిచినా పలకలేదు.

మరునాడు వారు వచ్చిన పని రామ స్వామికి చెప్పారుట. కలప వ్యాపారం చేయాలని తనకున్నదనీ అందుకు టేకు చూడటం అవసరమని సుబ్బారావు చెప్పాడు. టేకుచెట్లు అడవిలో పరుచు కొని వుంటాయి ఒకచోట పుచ్చుపుట్టిం దంటే అక్కడి చెట్లన్నిటికీ పుచ్చు వుంటుంది. చూసుకోకుండా కొంటే వ్యాపారానికి నష్టం వస్తుంది.

"అడవిలోకి మీరు పోవటం చాలా ప్రమాదం. అడవికి దగ్గరలో ఓ పల్లె టూరు వుంది. అందులో నాకు తెలిసిన ఒకతను వున్నాడు. ఆయన మీకు తోడుగా మనుష్యులను పంపుతాడు. మీరు మాత్రం చాలా జాగ్రత్తగా వెళ్ళాలి. ఏ అనుమానం వచ్చినా వెనక్కు వచ్చేయండి," అని ఆయన వారికి తాను చెప్పవలసినది చెప్పాడు.

రామస్వామి స్నేహితుడు రాంసింగ్‌కు వేటలో మంచి ప్రావీణ్యం వుంది. అతని యింటిలో పులిచర్మాలు, ఏనుగు దంతాలు అలంకారాలుగా పెట్టారు. అతనికి ఆ పల్లెటూరిని వదల బుద్ధికాక అక్కడే వున్నాడు.

ముగ్గురూ రాంసింగ్‌ని ఆ మరురోజు కలుసుకున్నారు. ఆయన వారి వుత్సాహం చూసి చాలా సంతోషించాడు. ఆ రోజు వారికి ఆతిథ్యమిచ్చి మరునాడు అడవిలోకి పోవడానికి ఏర్పాటుచేశాడు. నమ్మకంగా తన వద్ద పనిచేసే కోయజాతివారిని వెంట పంపాడు. వారికి ఓ గన్, రెండు పిస్టళ్ళు యిచ్చి పంపాడు.

వారి వెంట వచ్చేయిద్దరిలో ఒకతన్ని నాయకుడంటారు వారిద్దరూ యీటె లతో వారికి ముందు ఒకరు వెనుక ఒకరు వున్నారు.

రకరకాల చెట్లు పక్షుల అరుపులు వాటి కూతలు వింటూ మైమరచి పోయారు. ఎగిరిపడే అలల్లా వుంది వారి మనస్సు. ప్రతి చెట్టు కాయను కోరికె చూసేవారు. అలా చాలా దూరం పోయారు సమయం పన్నెండుగంట లయింది. ఎండ తీవ్రంగా వున్నా చల్లగానే వుంది. అడవిలో జంతువులు గుంపులు గుంపులుగా వుంటాయి. దూరంగా లేళ్ళు పరుగెత్తుతుంటే ఆశ్చ ర్యంగా చూశారు ప్రతిచిన్నవిషయాన్నీ వింతగా చూడటంవల్ల వారు లోనకు పోలేకపోయారు. సాయంత్రం నాలుగు గంటలవరకూ తిరిగారు. అప్పటికే అలసిపొయ్యారు

తిరుగుముఖం పట్టేటప్పటికి చాలా దూరం తిరిగా మనిపించింది. సూర్యుడు కొండలలోకిపోయాడు ఎర్రని కిరణాలు ఆకాశాన్ని కప్పివేశాయి. పక్షుల రకరకాల అరుపులు ఎక్కువైనాయి.

చిన్నగా వెలుగు రేఖలు జారుతున్నాయి. చీకటితెర లోకాన్ని కప్పివేస్తుంది

అడవిలో చెట్లు యిప్పుడు దయ్యాల్లా అగుపిస్తున్నాయి అందమైన పక్షులకు బదులు ఎన్నో రకాల కళ్ళు మెరుస్తున్నాయి. దూరంగా ఏవో జంతువుల అరుపులు, కీచురాళ్ళ శబ్దం తప్పితే వేరే ఏ శబ్దమూ లేదు. అందరూ మౌనంగా ముందుకు పోతున్నారు. నిరానుష్యంగా వుంది. చీకటి భయాన్ని కలిగిస్తూంది.

అంతలో అలికిడయిన శబ్దం, వారి ముందు ఏదో కదలాడినట్లుంది. నాయకుడు ఒక్కసారిగా ఆగిపోయాడు. ముగ్గురూ భయంతో వణికిపోయారు. రెండడుగులు వెనక్కు వేశారు. వెనుక నున్న కోయవాడు యీటె పట్టుకొని ముందుకు వచ్చాడు.

రెండు పాములు బాట కడ్డంగా పెన వేసుకొని వున్నాయి.

టార్చి వేసి చూశారు.

సుమారు ఐదడుగుల పొడవున్నాయి. ఒకటి నల్లగా నిగనిగలాడుతూ మెరుస్తుంది.

వసంతరావు పిస్టల్‌ను వాటికి గురి పెట్టి వుంచాడు.

నాయకుడు వాటినేమీ చేయవద్దని సైగచేసి యీటెతో ఆకులు కదుల్చుతున్నాడు. కాని అవి అక్కడి నుంచి కదల్లేదు.

ధన్ మని పిస్టల్ పేలింది. నల్ల త్రాచను రాసుకుంటూ గుండు దూసుకు పోయింది.

మరు క్షణంలో వారూహించని విధంగా బుస్‌మని నల్లత్రాచు ఒక్కసారిగా పైకి లేచింది. అందరికీ హృదయ స్పందన ఆగింది. ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని చైతన్యరహితులయ్యారు. సుబ్బారావుకి చేతులు వణకటం మూలాన చేతిలోని పిస్టల్ ఎక్కడ పడిందో అతనికే తెలియదు.

బుస్ మనే శబ్దం ఆగకుండా వస్తూంది.

ఎవరినో ఒకరిని కాటువేయక మానదనుకున్నారు.

"దొరా ! అది కొట్టటానికి చిక్కదు. ఏం చేయకండి ! అదే పోతాది." చిన్నగా గొణిగాడు కోయవాడు.

రెండు పాములలో ఒకటి బరబరా పొదలలోకి వెళ్ళింది. నల్లత్రాచు కొద్ది సేపు నిలబడి అదీ వెళ్ళిపోయింది.

ఆగిపోయిన గుండెలు కొట్టుకో సాగాయి.

"దొరా! బేగి పోదాం." నాయకుడు వడివడిగా నడిశాడు.

"ఎంతపని చేశావురా వసంతం" అన్నాడు సోమసుందరం.

"నీదో అర్థంలేని భయం. నీవు భయపడింది కాక మమ్మల్నీ భయపెడతావు. అదేం చేస్తుంది ?" అన్నాడు.

వారు రాంసింగ్ యింటికి జేరుకునే టప్పటికి రాత్రి చాలా టైం అయింది రాంసింగ్ వారికోసమే ఎదురుచూస్తు న్నట్లుగా వుంది స్నానానికి వేడినీళ్ళు పెట్టించాడు. స్నానం చేసేటప్పటికి పోయిన శక్తి వచ్చినట్లయింది. భోజనం ముగించారు

రాంసింగ్‌కు నల్లత్రాచుని కాల్చినట్లు, గుండు తప్పినట్లు చెప్పాడు వసంత రావు ఆయన పాము మంత్రగాడిని పిలిపించి మంత్రం వేయించాడు. సుబ్బారావుకు, సోమసుందరంకు అప్పటికి ప్రాణాలు కుదుటపడ్డాయి.

దినకరుని వేడికిరణాలు చురుక్కుమని తట్టిలేపేవరకూ వారికి మెలుకువ రాలేదు. రాంసింగ్ అప్పుడే వచ్చాడు.

''రాత్రి బాగా నిద్రపట్టిందా ?'' అడిగాడు

''నిద్రలో అన్నీ పాము కలలే.'' సుబ్బారావు అన్నాడు

''పోరా పిరికివెధవా.'' వసంతరావు అన్నాడు

''యీ రోజు వెళతారా?'' అడిగాడు రాంసింగ్.

''యీ రోజు వెళ్ళలేము. వొళ్ళు విరగొట్టినట్లు నొప్పులు.'' సోమసుందరం అన్నాడు.

''భయపడ్డావా ?''

''భయం కాదు నొప్పులు.''

ఆయన వారి భయానికి నవ్వు కున్నాడు.

రేపు మరలా వెళదామని అనుకు న్నారు.

మరుసటిరోజు వుదయాన్నే బయలు దేరారు. నాయకుడు ముందు నడుస్తున్నా యీసారి వారు చుగ్గరగా ఆ ప్రాంత మంతా తెలుసునన్నట్లు ముందుకు పోతున్నారు.

''నాయకా ! మరోదారిగుండా వెళదామా ?'' అడిగాడు వసంతరావు.

''అట్లాగే దొరా !'' అంటూ ఓ సన్నని దారివెంబడ తీసుకెళ్ళాడు

చెట్లు యిరుగ్గా వున్నాయి. చిన్న చిన్న పాములు ఎన్నో కనిపించాయి. వాటిని చూస్తే యీసారి భయమనిపిం చటంలేదు ప్రక్కకు తొలిగిపోతు న్నారు. భీకరమైన అరుపులు వినిపిం చేటప్పటికి త్రుళ్ళిపడి ప్రక్కకు చూశారు. అడవిపందులు అరుస్తూ గుంపుగా వస్తున్నాయి క్షణాలముందు హాయిగా వున్న అడవి యిప్పుడు వికృ తంగా వుంది ప్రాణాలు పోయినట్లే భావించారు. వారివైపే వస్తున్నాయి. కోయవారు పెద్దగా అరిచి వెళ్ళగొట్ట టానికి ప్రయత్నిస్తున్నారు. సోమసుందరం తుపాకి గురిచూసి కాలుస్తున్నాడు. ఆ గుండ్లు తగిలాయో తగల్లేదో కాని అవి ప్రక్కకు వెళ్ళిపో సాగాయి హాయిగా వూపిరి పీల్చారు.

ఓ చోట కుందేళ్ళు, మరో చోట దుప్పులు దుముకుతూ తిరుగుతున్నాయి.

నెహ్రూ జూ పార్కులో అన్నిరకాల జంతువులను, పక్షులను, పాములను చూశారు. కానీ నిర్భయంగా అడవిలో తిరుగున్న వీటిని చూస్తుంటే వారి హృదయం పరవళ్ళు తొక్కుతుంది. యివి జీవంతో కదలాడుతున్నట్లు, జూ పార్కులోవి నిర్జీవంగా వున్నట్లు వారి కనిపిస్తుంది.

అడవిలో ఎంతో దూరం వచ్చారు. వచ్చేకొద్దీ వుత్సాహం హెచ్చుతుంది. ప్రతిచెట్టు కాయనీతి పటం, అవి చేదుగా వుండటం పరిపాటి అయింది.

వారికి కొద్ది దూరంలో గలగల మంటూ నీళ్ళు పారుతు్న శబ్దం వినవస్తుంది.

అందరూ అక్కడికి వచ్చారు.

నిర్మలంగా నీళ్ళు వురవడితో పారుతున్నాయి. కాలువలో నీళ్ళు తక్కువగా వున్నాయి. అవి ఎండకు మిలమిల మెరుస్తున్నాయి.

నీళ్ళు చల్లగా వున్నాయి. ఎన్ని తాగినా ఇంకా తాగాలనిపిస్తుంది. దాహం తీర్చుకున్నారు.

''సోం ! యీసారి కాలువ ప్రక్కగా వెళదాం'' అన్నాడు వసంతరావు.

''యిటుగా వెళదామా ?'' అడిగాడు కోయవానివైపు చూసి.

''యిటు దారిలేదు దొరా !''

''యిటే వెళదాం,'' అన్నాడు వసంతరావు పట్టుదలగా.

నాయకుడు కాలువ ప్రక్కగా దారి తీశాడు. ఇటు పోవటం కొద్దిగా కష్టమనిపిస్తుంది. పెద్ద పెద్ద ముళ్ళుకూడా వున్నాయి. దారికడ్డంగా లతలు పెనవేసుకొని వున్నాయి. వాటిని తొలగించుకోవటం కష్టమనిపిస్తుంది. చాలా దూరం కష్టమైనా అలాగే వెళ్ళారు

పోతున్న నాయకుడు టక్కున ఆగాడు పరీక్షగా ఒక చెట్టును చూస్తున్నాడు. వెనకనున్నవారిని మాట్లాడవద్దని సైగచేసి చెవులు రిక్కించి వినసాగాడు. దూరంనుంచి ఏవేవో అరుపులు వినిపిస్తున్నాయి. అందరికీ మళ్లీ భయం పట్టుకుంది. ఒక చెట్టు వద్దకు వెళ్ళి నిశితంగా చూశాడు.

''ఏమిటి నాయకా ?''

''యిది పేనూదమయిన దారి దొరా! మనకు దగ్గరలో పులులు వున్నాయి. ఇదిగో చూడండి. యీ చెట్టుకు పంజా చారలు ఎక్కడో పొంచివుంటాది. పులి దొంగది ''

ముగ్గురూ చెట్టును చూశారు

''పులి పంజాకు పదును పెట్టుకోటానికి చెట్టును గట్టిగా కొట్టి రాస్తుంది. అట్టా అది గోళ్ళను పదును చేసుకుంటాది.''

''మరేం చేద్దాం ?'' సుబ్బారావు నీరసంగా అడిగాడు.

''యనక్కి పోవటంగూడా కష్టమే. యిటు పక్కగా ఎల్లిపోదాం'' అని దక్షిణం వైపుకు మళ్ళాడు.

కోయవాళ్ళు యీటెలను గట్టిగా పట్టుకొని వున్నారు. సోమసుందరం గన్‌ని రెడీగా పెట్టుకొని ముందుకు వెళుతున్నాడు ఎవరికి వారే జాగ్రత్తగా బిక్కుబిక్కు మంటూ పరిసరాలను చూస్తున్నారు.

ప్రాణాలను గుప్పిట్లో పెట్టుకున్నారు. ఏం జరగనున్నదో ? ఏ కొద్ది సవ్వడి అయినా పది కళ్ళు అటు తిరుగుతున్నాయి

నాయకుడు ఆగి ప్రక్కకు పరికించి చూస్తున్నాడు.

వారు ఓ చెట్టువద్ద కొచ్చారు. అలసట కలిగినట్లుంది. వసంతరావు చెట్టుపై చేయివేసి నాయకుడు ఏం చెబుతాడోనని వుత్కంఠతో ఉన్నాడు.

చెట్టు మ్రాను పైభాగంనుంచి అతని చేతివైపు ఓ జీవి చిన్నగా కదలాడుతూ వస్తుంది. అతను దాన్ని గమనించనే లేదు. అది అతని చేతి దగ్గరగా వస్తుంది. అది అతని చేతిని పట్టుకోబోయింది. మరో క్షణంలో పట్టుకుంటుంది.

వెంటనే వెనుక వస్తున్న కోయవాని యీటె చేతిపైగా చెట్టుమ్రానుకు గుచ్చుకుంది. వసంతరావు ఏదో జరిగిందని ముందుకు పరుగెత్తాడు. కోయవాడు యీటెను బలంగా బయటికి లాగాడు. ఆ జీవికి గుచ్చుకున్న యీటె బయటికి వచ్చింది కాని ఆ విసురుకి అది ఎగిరి అతని కాలిపై పడింది. కాలి బొటన వ్రేలును గట్టిగా కరిచింది.

అది అచేతనంగా వాలిపోయింది.

ముందున్న నాయకుడు అప్పుడూ వెనక్కు చూశాడు.

కోయవాడు మెలికలు తిరుగుతూ పడిపోయాడు.

"నాయకా ఏమిటిది ?"

"అది వూసరవల్లి దొరా ! అది రంగులు మార్చుతుంది. అందుకే చెట్లలో అది కనపడదు. ఆకుల్లో వుండినప్పుడు పచ్చగా వుంటాది. కొమ్మపై వున్నప్పుడు కొమ్మరంగులో వుంటాది. అయిపోయింది దొరా! ఆడు సచ్చాడు." బాధగా వాడివద్ద కూలబడ్డాడు.

ముగ్గురికీ హృదయాన్ని పిండినట్లయింది. తనకోసం చనిపోయాడని విచారించాడు వసంతరావు.

వూసరవల్లి చావబోయేటప్పుడు రంగులు మార్చుతూ చస్తుంది అలాగే కోయవాడు క్షణానికోరంగు మారుతూ చివరకు పచ్చ, నలుపు కలిపినరంగుకొచ్చాడు. ఆ రంగు వచ్చిందంటే ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసి పోయినట్లే గదా.

"నాయకా ! మా వలన వో నిండు ప్రాణం పోయింది."

శవాన్ని వో గుంటలోకి లాగి బయలుదేరారు.

వసంతరావు చాలా బాధపడ్డాడు. యిలా జరుగుతుందనకుంటే అసలు వచ్చేవారేకాదు.

యు

అప్పటికే సంధ్యాకాంతులు ఆక్రమించుకుంటున్నాయి. వెనక్కు తిరిగారు. నల్లని చీకటి వెలుగును హరించి రాజ్యం చేస్తుంది. ఎప్పుడు ఏం జరుగుతుందో తెలియదు. ప్రమాదం ఎలా వస్తుందో వూహాతీతం. చెట్లలో మెరిసే కళ్ళు, భయంకరమైన అరుపులు వారిని త్వరగా ముందుకు నడిపిస్తున్నాయి.

వెన్నెల కాసాగింది. వెన్నెల వారికి కొంతంత ధైర్యాన్ని కలిగిస్తుంది. జీవితంలో మరువలేని అనుభవం. కాలం గడిచేకొలది వెన్నెల వెండిలా కురువసాగింది ఎక్కడ ఏశబ్దం అయినాసోమసుందరం గుండును ఖర్చు చేస్తున్నాడు.

ప్రమాద మొచ్చినప్పుడు చెప్పలేని భయం కలుగుతుంది. మరలా ఎక్కడలేని ధైర్యం వస్తుంది. అదో విచిత్రానుభూతి.

ఎన్నో పాములు దారి కడ్డంగా వచ్చేవి. కొన్నిటిని చంపేవారు. కొన్ని పొదల్లోకి పోయేవి.

వారు కాలువ వద్దకు వచ్చారు. హాయిగా శ్వాస పీల్చారు. నీరు తాగిన వెంటనే కోయవాడు వెళదామని అన్నాడు.

అంతలో గలగల మనే శబ్దం వినిపించింది. ఎండుటాకులపై నడుస్తున్న ధ్వని. అందరి గుండెలు కొట్టుకోసాగాయి. చుట్టూ చూశారు. ఎక్కడా జీవి ఉన్నట్టు కనిపించలేదు

నాయకుడు జాగ్రత్తగా శబ్దాన్ని వింటున్నాడు. వారిని ఓ బండచాటుకు రమ్మని సైగచేశాడు. అతని సైగ ప్రకారం అలికిడి కాకుండా బండవద్దకు వచ్చారు. ఆ బండచుట్టూ టార్చి వేసి ఏమీలేదని నిర్ణయించుకొని దాన్ని చాటుచేసుకొని కూర్చున్నాడు.

శబ్దం ఎక్కువైంది. భయంతో చుట్టూ చూస్తున్నారు. నాయకుడు యీటెను సిద్ధం చేస్తున్నాడు సోమసుందరం గన్ గురిపెడుతున్నాడు

వుత్కంఠతో, అప్రమత్తంగా ఉన్నారు వారు. ఒక్కసారిగా ఆశ్చర్యంగా నోరు తెరిచారు కలో, నిజమో తెలుసుకోలేని స్థితిలో వున్నారు. ఆ శబ్దంచేసింది ఏ జంతువూ కాదు ఓ యువతి. ఆమె కాలువ నీటిలోకి దిగుతుంది ఆమె వంటిపై లంగా తప్ప మరే వలువలూ లేవు యౌవనం పరవళ్ళు తొక్కుతుంది. ఎత్తైన అవయవాలు నగ్నంగా వుండటాన దివ్యసుందరిలా అగుపిస్తుంది

వసంతరావు దృష్టి ఆమెమీదే వుంది. ఈ మహారణ్యంలో వంటరిగా, నిర్భీతితో స్త్రీరావటం అతనికి ఆశ్చర్యం కలిగించిన విషయం నాయకుడు వెళదామన్నట్లు చేయివూపాడు. కానీఅతనికి ఆమె ఎచటికి పోతుందో చూడాలని వుంది. అతని మాటలు పట్టించుకోక ఆమె అవయవ పొంకం చూస్తున్నాడు. నాయకుడు



ఒక్క క్షణం వుండకుండా ముందుకు వెళ్ళాడు. సోమసుందరం, సుబ్బారావు అతన్ని అనుసరించారు. అతనికీ వారి వెనుక పోక తప్పలేదు.

తెల్లవారింది. రాంసింగ్ వారిని అడివికి పొమ్మనలేదు. సుబ్బారావుకు, సోమసుందరంకు విసుగు పుట్టింది. ఒక్కో క్షణం భయంతో తిరగాలి. ఏ క్షణంలో ఎవరికి ప్రాణాపాయం కలుగుతుందో చెప్పటం కష్టం. కోయవాని చావు మరువలేని దుర్ఘటన.

"మరోమారు వెళదాం రా," అన్నాడు వసంతరావు.

"ఈసారి నీవొక్కడివే పో..." అన్నారు.

"యిదే ఆఖరిసారి. మనంనాయకునితో పాటు మరో యిద్దరిని తీసుకెళదాం. యీ ఒక్కసారికి వొప్పుకోండిరా! యిక యీ ప్రాంతాలకు ఎప్పుడు వస్తామో, ఏమో!" బ్రతిమిలాడుతూ అడిగాడు.

"మేం నడవలేం." కచ్చితంగా అన్నారు.

వారిని ఎంత బ్రతిమిలాడినా ప్రయోజనం శూన్యం అనుకున్నాడు అతనికి వెన్నెలలో ఆ స్త్రీని మరోమారు చూడాలనిపిస్తుంది ఆమె ప్రతిరోజూ అక్కడకు వస్తుందనపిస్తుంది.

మధ్యాహ్నం టిఫిన్‌చేసి కాఫీ తాగారు. సోమసుందరం, సుబ్బారావు కబుర్లలో పడిపోయారు. వసంతరావుకు వారితో మాట్లాడాలనిపించలేదు.

"అరే సోం ! అలా బయటికి వెళ్ళొస్తా," అన్నాడు.

యీ పల్లెటూరిలో ఏముందిరా చూడటానికి."

"టైం పాస్ అవుతుందికదాని."

"త్వరగా వచ్చెయ్ ! మాకు బోర్ కొడుతుంది" అన్నారు.

మంచి అవకాశ మనుకున్నాడు. తానొక్కడే వెళతానంటే వారు అంగీకరించరు. అతనికి ఎక్కడలేని గుండె నిబ్బరం కలిగింది. ఏదో ఆవేశం లాక్కెళుతుంది. నిర్భయంగా అడవిలోకి వెళుతున్నాడు. ఎందుకైనా మంచిదని పిస్టల్ జాగ్రత్తగా పట్టుకున్నాడు.

సంధ్యా సమయంలో అలా వెళ్ళటం హాయిగా వుంది. వారితో కలిసి వెళ్ళేటప్పుడు పక్కలనుండి ఏ జంతువన్నా వస్తుందని భయం కలిగేది. యిప్పుడా భయం లేదు. చీకట్లు అలుముకుంటున్నాయి. పిచ్చివాడిలా నడుస్తున్నాడు.

ఓ చెట్టుపై గుడ్లగూబ రెక్కలు టపటపా కొడుతుంది. ఒక్కక్షణం తనస్థితి మర్చిపోయాడు.

ముందుకెళ్ళేకొలది ధైర్యం వస్తుంది. వెన్నెల కిరణాలు పర్చుకొంటున్నాయి. వెలుగు భయాన్ని పారద్రోలుతుంది. కాలువ వద్దకు వచ్చాడు.

చెప్పలేని పారవశ్యం కలుగుతుంది. నీళ్ళను తాగి నీళ్ళలోకి చూస్తూ కొద్దిసేపు గడిపాడు. ఈరోజు రాదేమో? తన ప్రయత్నం వృధా అవుతుందేమో? కాని వెంటనే ఆ ఆలోచనకు స్వస్తి చెప్పాడు. తప్పక వస్తుంది అని సరిపెట్టుకున్నాడు

వెన్నెల ప్రభావం అడవిలో ఎక్కువేమో ? విరగబడి కాస్తుంది. నీళ్ళలో కాలుపెట్టాడు. చల్లగా తగిలాయి. ఆ నీళ్ళు వెచ్చదనాన్ని కలిగిస్తున్నాయి. ఆకులు గలగలమని వినిపిస్తున్నాయి. కదలికల శబ్దం వస్తూంది. హృదయం ఆనందంతో పొంగుతూంది అవి దగ్గర అయేకొద్ది ఉత్సాహంగా ఉంది

ఆమె వచ్చింది.

శరీరంపై లంగా, పొడవైన నల్లని కురులు వీపుపై పరుచుకొని వున్నాయి. నీటిలోకి దిగింది.

అతను ఆమెవద్దకు వెళుతున్నాడు. నీళ్ళలోకి దిగాడు. అంతవరకూ అతన్ని చూడనేలేదు. ఏమిటాని చూసింది. నవ్వుతూ దగ్గిరకు వస్తున్నాడు.

"ఎవరు నీవు ?" అడిగాడు.

భయంగా, విస్మయంగా చూస్తూ బయటికి వచ్చింది.

"నేనూ నీలాంటి మనిషినే. ఎందుకు భయపడతావు?" నవ్వుతూ అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. క్రూర జంతువును చూసినట్లు చూస్తూంది.




"ఏం ? మాటలు రావా ?"

అప్పటికే బయటికి వచ్చింది. పరుగెత్తాలని సంకల్పం.

"ఎందుకు భయపడతావు ?" నెమ్మదిగా అడుగులు వేస్తూ అన్నాడు.

వడిగా ముందుకు వెళ్ళబోయింది.

ఎక్కడలేని శక్తితో ఆమెను చేరుకున్నాడు. ఆమె చేతిని పట్టుకున్నాడు. ఆమె శ్వాస అతనికి వినిపిస్తుంది. నగ్నంగా ఉన్న వక్షం ఎగిరిపడుతుంది.

"నీ అందం నన్ను ముగ్ధుణ్ణి చేస్తోంది. హాయిగా యిక్కడ గడుపుదాం" అన్నాడు.

"నేను పోవాలన్నట్లు ఆమెచేతిని విసురుగా లాక్కోబోయింది.

అది గమనించి గట్టిగా పట్టుకున్నాడు. నరాలు బిగుసుకుపోటాన చేయి ఇనప ముక్కలా గట్టిపడసాగింది. అతని శక్తి చాలటంలేదు. వెనక్కు మడిచి ముందుకు లాగింది. అతను వెనక్కు పడబోయాడు. పట్టుతప్పటాన తప్పించుకొని పారిపోబోయింది ఎంతో దూరం పోలేకపోయింది. చెట్ల లతలు పెనవేసుకోటాన ఆమెను వెంటనే చేరుకున్నాడు. ఈసారి రెండుచేతులు నడుంమీద వేసి గట్టిగా పట్టుకున్నాడు. ఏంచేయలేక చేతులతో అతన్ని వెనక్కు నెట్టింది. అతను కసిగా పట్టుకున్నాడు. ఆమె ప్రయత్నాలు వృధా అయాయి.

ఆమెని ఎత్తుకొని తీసుకొచ్చాడు. వక్షం వుబికి ఎగిరిపడుతూంది. పిచ్చివాడిలా అవయవాలవైపు చూస్తున్నాడు.

"నేనేం అడవి జంతువును కాదు. నీలాంటి మనిషినే" అన్నాడు రొప్పుతూ.

అతనిలో కోరిక సెలయేరులా పరవళ్ళుతొక్కుతూంది. కళ్ళు కామంతో నిండిపోయాయి. అతని చూపులు ఆమెని చీల్చివేస్తున్నాయి. ఆమె మెడ చుట్టూ చేతులువేసి గట్టిగా అదుముకున్నాడు. అతని పెదవులు ముఖాన్ని

ముద్దులతో నింపివేస్తున్నాయి. చేతులు మెడమీద నుండి క్రిందకు జారాయి. ఆమెను నలిపివేస్తున్నాడు. శరీరం వేడెక్కింది

ఆమె అతన్ని వారింపలేదు. ఆమె చేతులు అతన్ని చుట్టాయి. గట్టిగా కౌగిలించుకుంది. ఆ కౌగిలికి కీళ్ళు పటపట లాడాయి. ఆ తమకంలో ఆ కౌగిలే ఎంతో హాయిగా వుంది.

అతను ఆగలేకపోయాడు

ఆమె అతనిపైకి వంగింది. ఆమె శ్వాస పాము బుసలాగుంది నోరు తెరిచి గట్టిగా ముద్దుపెట్టుకుంది. అతని పెదవులను నోటితో మూసివేసింది. గట్టిగా అతని పెదవులను కొరికింది. పెదవులు చిట్లి రక్తం కారసాగింది. బాధతో మెలికలు తిరిగిపోసాగాడు. అతనికి మాట్లాడాలనీ, గట్టిగా అరవాలనీ వుంది. మాట్లాడలేక పోతున్నాడు. అతని పెదవులను నోటితో పట్టుకుంది. ఆమెనుండి దూరంగా పోవాలనిపిస్తుంది. గట్టిగా నెట్టాలనుకున్నాడు. కాని అలసి పోతున్నాడు వగుడాకులా క్రిందకు జారుతున్నాడు.

ఆమె "కీ......" అని అరిచింది. వికృతంగా వినిపించింది అతను భయంతో వణికిపోతున్నాడు. తల తిరుగుతున్నట్లుగా వుంది ఏమీ తెలియటం లేదు క్రిందపడ్డాడు — పాము కాటుకు గురైన అభాగ్యునిలా.

* * *

వసంతరావు జాడ తెలియకపోయే టప్పటికి సుబ్బారావు, సోమసుందరం భయపడ్డారు. రాంసింగ్ నిప్పులపై అడుగుపెట్టినట్లు తిరిగాడు. అన్ని చోట్లా వెతికి చూశాడు.

"వీడు అడవిలోకే వెళ్ళివుంటాడు." అనుమానాన్ని వ్యక్తపరిచాడు సోమసుందరం.

రాంసింగ్ వెంటనే నాయకుని పిలిపించాడు. నలుగురూ అడవిలోకి వెళ్ళారు కాలువ వద్దకు వచ్చారు.

నలుగురికీ భయం, బాధా కలుగు తున్నాయి.

పడివున్న వసంతరావుని చూశారు. నిర్జీవంగా వున్నాడు. పెదాలవద్ద రక్తం నల్లగా గడ్డకట్టింది. శరీరం నల్లగా మారింది.

"నాయకా ఏమిటిది ?"

"పాము కాటేసినట్లుంది. పాము కాటుకే వళ్ళు యిలా అవుతాది."

నమ్మలేనట్లు చూశారు."ఆశ్చర్యంగా వుంది. పాము పెదాలపైకాటు వేస్తుందా?"

"యిక్కడో జాతి మడుసులున్నారు. ఆరు చిన్నతనంనుంచి పాము యిసం తింటారు. ఆరిని పాములు కరిచినా యిసం ఎక్కదు. ఆరు మంచోళ్ళను కరిస్తే ఆళ్ళు సత్తారు" అన్నాడు. వాళ్లకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి

———

# చల్లనితల్లి

గన్నంరాజు సుందరరావు



తల వంచుకొని భారంగా నడుస్తూ తన కన్సల్టింగ్ రూంలోకి వచ్చాడు డాక్టర్ శ్రీరాం.

'డాక్టర్' అంటూ తను కూర్చున్న కుర్చీలోంచి తడబడుతూ లేచి నిలబడింది రాగిణి ఆమె ముఖం దైన్యంగా వుంది. అపరిమితంగా ఏడిచినందువల్ల ఆమె కళ్ళు ఎర్రబారి వున్నాయి. దాదాపు రెండు గంటల నుంచీ ఆమె కన్సల్టింగ్ రూంలో కూర్చుని డాక్టర్ శ్రీరాం కోసం ఆదుర్దాగా ఎదురుచూస్తోంది.

డాక్టర్ శ్రీరాం రాగిణి వైపు ఒకసారి జాలిగా చూసి ఉస్సురంటూ నీరసంగా తన రివాల్వింగ్ చెయిర్‌లో కూలబడిపోయాడు. స్టెతస్కోపూ, కళ్ళ జోడూ తీసేసి టేబిల్‌మీద పడేశాడు. కుర్చీలో వెనక్కి జారగిలబడి, గాఢంగా నిట్టూర్చాడు. కళ్ళు మూసుకొని కుడి చేతి వేళ్ళతో నుదుటిమీద గట్టిగా రాసుకుంటూ దీర్ఘాలోచనలో పడిపోయాడు. అతనికి సుమారు అరవైసంవత్సరాల వయస్సుంటుంది. ఆజానుబాహువు. ఆరోగ్యంగా దృఢంగా వుండే అతని దేహాన్ని వయోభారం ఒక్కసారిగా క్రుంగదీసేసినట్టుగా వడిలిపోయాడు. చిరునవ్వులు చిందిస్తూ ఎల్లవేళలా

ప్రసన్నంగా ఉండే అతని వదనం వాడి పోయి విషాదం కమ్ముకొని వుంది.

డాక్టర్ శ్రీరాం ముఖంలోని భావాలను పరిశీలిస్తున్న రాగిణిలో ధైర్యం సడలి పోసాగింది. క్షణాలు దొర్లిపోతున్నకొద్దీ ఆమెలో ఆరాటం పెచ్చుమీరిపోతోంది భయాందోళనలు ఆమె హృదయంలో విలయతాండవం చేస్తున్నాయి. డాక్టర్ శ్రీరాం నోటినుండి ఎలాంటి దుర్వార్త వినవలసి వస్తుందో, ఆ తరువాత పరిస్థితులు ఎంత భయంకరంగా మారుతాయో అని కలవరపడుతూంది. 'ఎటువంటి అనర్థం జరక్కుండా రక్షించు భగవాన్' అంటూ వాపోతోంది.

రాగిణి వెంట వచ్చిన నౌఖరు రాజయ్య కూడా డాక్టర్ శ్రీరాం ఏం చెబుతాడో వినాలని కుతూహలపడుతూ తదేకంగా అతన్ని చూస్తూ చేతులు కట్టుకొని గోడవారగా శిలావిగ్రహంలా నిలబడిపోయాడు.

కొద్దిసేపటికి డాక్టర్ శ్రీరాం నిద్ర నుంచి మేల్కొన్నవాడిలా నెమ్మదిగా కళ్లు విప్పి, గంభీరంగా రాగిణినీ, రాజయ్యనూ చూసి దీర్ఘంగా నిట్టూర్చాడు. కూర్చోమన్నట్టుగా రాగిణికి చేత్తో సంజ్ఞ చేశాడు. వేళ్లతో నుదుటి మీద పడే జుట్టును ఎగదోసుకుంటూ అసలు విషయాన్ని రాగిణికి ఎలా చెప్పాలో నిర్ణయించుకోలేక మథన పడుతూ, ఆమె వైపు దిగులుగా చూస్తూ వుండిపోయాడు

"డాక్టర్ ఏం జరిగిందో త్వరగా చెప్పండి ప్లీజ్" గద్గదికంగా అంది రాగిణి, కలవరపాటును అణచుకోలేక.

"ఏం చెప్పమంటావు తల్లీ-జీవితంలో ఏనాడూ నేను ఇటువంటి క్లిష్టపరిస్థితిని ఎదుర్కోలేదు. నా శక్తి వంచన లేకుండా చెయ్యగలిగినదంతా చేశాను. అతనికి బ్లడ్ విపరీతంగా పోయింది. ప్రస్తుతం అతనికోసం 'ఎ' గ్రూప్ బ్లడ్ కావాలి. 'ఒ' గ్రూపయినా పరవాలేదు. అదీ అతనికి సరిగ్గా సూట్ అవాలి. అతనికి సూటయే బ్లడ్ ప్రస్తుతం మన హాస్పిటల్లో లేదు. దగ్గరలో వున్న బ్లడ్ బాంకిలో కూడా దొరకలేదు. బ్లడ్ దొరికితేగాని మనం ప్రొసీడ్ కాలేం. చాలా అర్జంటుగా కావాలి. ఆలస్యం అవుతున్నకొద్దీ అతనికి ప్రమాదం దగ్గరపడే అవకాశం వుంది. ఆ తర్వాత మనం శతవిధాల ప్రయత్నించినా ఫలితం ఉండకపోవచ్చు. అందుకే నీకు ఏమీ చెప్పలేక ఇంతసేపూ నాలో నేనే మథనపడ్డాను." నీరసించిన స్వరంతో అన్నాడు డాక్టర్ శ్రీరాం.

ప్రతిభావంతుడైన డాక్టర్ శ్రీరాం నోటినుండి నిరాశాపూరితమైన మాటలు వెలువడగానే హతాశురాలయింది రాగిణి. గుండెలో బాణం దిగబడినట్టుగా గిలగిల గింజుకుపోయింది. ఆమెకు దుఃఖం వెల్లువలా పొంగుకొచ్చింది.

"మరొక మార్గమేదీ లేదా డాక్టర్ ?"

అతి కష్టంమీద దుఃఖాన్ని అరికట్టు కుంటూ అంది రాగిణి.

"అయాం సారీ, మరొక మార్గం వుంటే నేనెందుకిలా కుమిలిపోతాను? బ్లడ్ కోసం ఇక్కడ కూడా చాలా మందిని టెస్ట్ చేశాను. కాని ఫలితం శూన్యం. అతనికి సూటయిన బ్లడ్ దొరకడంలేదు. కొందరి బ్లడ్ సూటయినా అందులో ఇన్ఫెక్షన్సు ఉన్నాయి. అది ఎంతమాత్రం పనికిరాదు. ఈ రోజు ఎంత దుర్దినమోగాని ఎంతమందిని టెస్ట్ చేసినా కావలసిన బ్లడ్ దొరకడం లేదు. అందుకోసం నా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాను. అదృష్టం వుంటే తప్పకుండా దొరుకుతుంది. నువ్వు కాస్త ధైర్యంగా వుండాలి. భగవంతుడు కనికరిస్తే మన ప్రయత్నం తప్పకుండా ఫలిస్తుంది." రాగిణిని అనునయిస్తూ అన్నాడు డాక్టర్ శ్రీరాం.

"డాక్టర్! మీ ప్రయత్నం ఫలించాలి. తప్పకుండా ఫలిస్తుంది. ఆ నమ్మకం, ధైర్యం, నాకున్నాయి. నాకు తెలిసినంత వరకూ, ఇలాంటి క్లిష్టమైన కేసులలో ఎన్నోసార్లు మీరు ఘనవిజయాన్ని సాధించారు. ఈ కేసులో కూడా మీకు జయం కలగాలి. మా అన్నయ్య బ్రతికి బయటపడాలి. అన్నయ్యకి ఏ మైనా అయితే వదినను సముదాయించుకోవడం అసాధ్యం. ఆమె హార్ట్ ట్రబుల్ గురించి మీకు క్షుణ్ణంగా తెలుసు. అన్నయ్యకి ప్రమాదం జరిగిందని వదిన కింకా తెలియదు. ఆమెకు తెలిస్తే ఇక మనకు దక్కదు. అన్నా, వదినా, ఎంతో ఆదరంగా నన్ను సాకుతూ నాకు తల్లీ, తండ్రీ లేని లోటును భర్తీ చేస్తున్నారు. వాళ్ళిద్దరూ లేకపోతే వారి పిల్లలూ, నేనూ, దిక్కులేని పక్షులమైపోతాం" అంటూ దోసిట్లో ముఖం పెట్టుకొని బావురుమంది రాగిణి.

డాక్టర్ శ్రీరాం చలించిపోయాడు. అతని హృదయం ద్రవించింది. చెమ్మగిల్లిన కళ్ళను రుమాలుతో అద్దుకున్నాడు.

"అమ్మా రాగిణీ! నాకన్నీ తెలుసు. డాక్టర్ రాంగోపాల్ నీకు అన్నయ్య మాత్రమే కాదు అతను నాకు కుడి భుజం లాంటివాడు. ఈ హాస్పిటల్‌కి వెన్నెముకలాంటివాడని అంటే అది అతిశయోక్తి కాదేమో. అతను నా అసిస్టెంటుగా ఈ హాస్పిటల్‌లో చేరాక నాకు చాలావరకు రిలీఫ్ దొరికిందనే చెప్పాలి. పేషంట్లను శ్రద్ధాసక్తులతో, ఆదరాభిమానాలతో చూసుకుంటూ అనతికాలంలోనే చాల ఉదారబుద్ధి కలవాడనీ, తెలివైన డాక్టరనీ, అశేష ప్రఖ్యాతి నార్జించాడు. నా హాస్పిటల్ ఈనాడు ఇంత అభివృద్ధిలోకి వచ్చిందంటే, దానికి కారకుడు రాంగోపాల్ అని చెప్పితీరాలి. కార్లలో వచ్చేవారినీ, కాలినడకన వచ్చే వారినీ, సమభావంతో ఆదరించిగౌరవించే విశాలహృదయుడు. గొప్పా, బీదా,

అనే తారతమ్యం లేకుండా రోగులను కన్నబిడ్డలవలె ఆదుకుని ట్రీట్‌మెంటు చేస్తూ పేదల హృదయాలలో దైవంగా నిలిచాడు.

కఠోరమైన దరిద్రంతో, నరక ప్రాయమైన జీవితాన్ని గడుపుతూ, గుక్కెడు మందునీళ్లయినా దొరక్క ప్రాణాలు పోగొట్టుకొన్న నా తల్లి చివరి కోరికను తీర్చడానికి ఎన్నో కష్ట నిష్ఠురాలనూ, భయంకర పరిస్థితులనూ, చిక్కు సమస్యలనూ ఎదుర్కొంటూ, కష్టపడి చదివి డాక్టరు నయాను. ఆ చల్లని తల్లి కోరిక ప్రకారం రోగాలతో బాధ పడుతూ, తగిన మందులు కొనడానికి ఆర్థికంగా శక్తి లేక అగచాట్లు పడే నిరుపేదలను ఆదుకోవడమే ప్రధానోద్దేశంగా పెట్టుకొని ఈ హాస్పిటల్‌ను స్థాపించాను. కూటికి గతిలేని నిరుపేదలతో బాటు, కోటికి పడగలెత్తిన కుబేరులు కూడా ఈ హాస్పిటల్‌కు విరివిగా రావడం వలన అఖండైశ్వర్యాన్నీ, కీర్తినీ ఆర్జించాను. డాక్టర్ రాంగోపాల్ తన శక్తిసామర్థ్యాలను బీద ప్రజలను రోగాల బారినుండి రక్షించడానికేవినియోగిస్తూ, నా లక్ష్యాన్నీ ఆశయాన్నీ అక్షరాలా అమలుజరుపుతూ నాకు మితిలేని ఆనందాన్నీ, అటుపైన నా తల్లి ఆత్మకు శాంతినీ కలుగజేస్తున్నాడు. అతను లేకపోతే ఈ హాస్పిటల్ స్తంభించిపోతుందంటే అది అబద్ధం కానేరదు. అనేకమంది రోగార్తులు నిస్పృహ చెందిపోతారు అందుకని అతను బ్రతికి తీరాలి. అతన్ని బ్రతికించుకోవడానికి సర్వవిధాలా ప్రయత్నిస్తున్నాను. ఈ వార్ధక్య దశలో నాకు చేదోడు వాదోడుగా ఉంటూ, ఈ హాస్పిటల్ కీర్తి ప్రతిష్ఠలను ఇంకా ఇనుమడింపచేస్తాడని పొంగిపోయాను. ఇప్పుడు క్రుంగిపోతున్నాను. అతన్ని రక్షించమని హృదయపూర్వకంగా దైవాన్ని ప్రార్థిస్తున్నాను" ఆవేదనగా అన్నాడు డాక్టర్ శ్రీరాం.

అతని ఆవేదనాపూరితమైన మాటలు రాగిణి దుఃఖాన్ని రెట్టింపుచేశాయి. కళ్లు మూసుకొని టేబిల్‌మీద వాలిపోయి మౌనంగా రోదించసాగింది.

రాగిణి దుఃఖాన్ని చూడలేక డాక్టర్ శ్రీరాం నీరసంగా కుర్చీలోంచి లేచి డాక్టర్ రాంగోపాల్ బెడ్ దగ్గరకు వెళ్ళిపోయాడు.

అంతవరకూ స్థాణువులా నిలబడిపోయిన రాజయ్య ఇక అక్కడ ఉండలేక కన్సల్టింగ్ రూం బయటకు వచ్చి, దూరంగా ఉన్న హాస్పిటల్ గార్డెన్‌లోకి పోయి, ఒక చెట్టు కింద ఉన్న సిమ్మెంటు బెంచీమీద చతికిలబడ్డాడు.

మోటారు సైకిల్ ఆక్సిడెంట్‌లో బలమైన గాయాలు తగిలి డాక్టర్ రాంగోపాల్ ప్రాణాపాయస్థితిలో పడినందుకు రాజయ్య హృదయంఆనందంతో పరవళ్లు తొక్కుతోంది. తన కష్ట తీరే

సమయం ఆసన్నమైందనీ, దీర్ఘకాల నిరీక్షణ సఫలీకృతమౌతోందనీ, పొంగి పోతున్నాడు అంతలోనే ఏదో ఆలోచిస్తూ పళ్లు పట పట కొరికాడు. అతని పిడికిళ్లు బిగుసుకుపోయాయి. కోపంతో ముఖం జేవురించింది, కళ్లు ఎర్రబారాయి.

అప్పుడు ఉదయం పదిగంటలు దాటింది. రోహిణి కార్తె ఎండ మండి పోతోంది. మండే ఎండకన్న మిన్నగా రాజయ్య గుండె మండుతోంది. తీక్షణంగా ఉన్న ఎండా, గుండెల్లోని మంటా, అతన్ని తీవ్రంగా గాబరా పెట్టేస్తున్నాయి. చెమటకు తడిసిన చొక్కా విప్పేసి విసుగ్గా పక్కన గిరాటేశాడు. కండలు తిరిగి బలిష్టంగా ఉన్న అతని శరీరం చెమటపట్టి నిగనిగ మెరుస్తూ, అతని సంపూర్ణారోగ్యాన్ని ప్రస్ఫుటితం చేస్తోంది.

గతాన్ని గుర్చి తలపోస్తూ పంట్లాం జేబులోంచి బీడీకట్టా, అగ్గిపెట్టే తీసి, బీడీ వెలిగించాడు. అగ్గిపుల్లను కసిగా నేలకేసి కొట్టాడు. గుండె నిండుగా దమ్ములాగి విసురుగా పొగ బయటకు వదిలాడు. 'దొంగముండాకొడుకు రక్తం దొరక్కపోతే చస్తాడుట, చావనీ పీడ విరగడైపోతుంది.' పళ్లు నూరుకుంటూ అనుకున్నాడు రాజయ్య.

రాజయ్య డాక్టర్ రాంగోపాల్ దగ్గర గత పదిహేను సంవత్సరాలనుంచీ నౌఖరుగా పనిచేస్తున్నాడు. రాంగోపాల్ తనకు చేసిన ద్రోహాన్నీ, అన్యాయాలనూ తల్చుకుంటూ ఆవేశంతో వూగిపోతున్నాడు.

'ఇంతవరకూ ఒక్క క్షణం కూడా తనని నిశ్చింతగా బ్రతకనివ్వలేదు, వెధవ. తన బ్రతుకును నాశనం చేశాడు. తన ఇంటి దీపాన్ని ఆర్పేసి తనకు జీవితమంతా మనశ్శాంతి లేకుండా చేశాడు. వీడు డాక్టరుగా ఎంతోమంది ప్రాణాలను కాపాడి వుండవచ్చు. అది తనకు అనవసరం. తన మొదటి భార్య అలివేలు ఎంత అందంగా, ఆరోగ్యంగా వుండేదని! గంగిగోవులాంటి అలివేలుని నిర్లక్ష్యం చేసి హతమార్చేశాడు. అలివేలుకి అది మొదటి కాన్పు కావడం వలన నరకయాతన పడింది. కడుపులో చచ్చిపోయిన కవలపిల్లలను వీడు ఆపరేషన్ చేసి బయటకు తీసి అలివేలు ప్రాణాన్ని నిలబెట్టాడని తను ఎంతో పొంగిపోయాడు. కాని ఆపరేషన్ అయిన గంటలోగానే శక్తిని కోల్పోయిన అలివేలు పరిస్థితి విషమించిపోయింది. అలివేలు పడుతున్న బాధను చూడలేక తను వెళ్ళి మొరపెట్టుకుంటే వీడు పరుగు పరుగున వచ్చి అలివేలును పరీక్షించి పరిస్థితి చెయ్యిదాటిపోయిందని ఆక్రోశించాడు. అంతవరకూ తనకు తెలియజెయ్యకుండా ఉపేక్షించినందుకు అలివేలు దగ్గర డ్యూటీ చేస్తున్న నర్సును చెడా మడా తిట్టిపోశాడు.

వెంటనే అలివేలుకి చివరి ప్రయత్నంగా ఇంజక్షను చేశాడు. అంతలోనే ఎవరో వచ్చి మరెవరికో సీరియస్‌గా వుందని చెబితే అలివేలు రూంలోంచి అటు పరుగెత్తాడు. అలివేలుకి ఇచ్చిన ఇంజక్షను సత్ఫలితాన్నివ్వలేదు. ఆమె పరిస్థితి పూర్తిగా దిగజారిపోయి గిలగిల తన్ను కుంటూ ప్రాణం వదిలేసింది. ప్రాణం పోయే ముందు అలివేలు తనను దగ్గరగా పిలిచి 'కక్ష తీర్చుకున్నాడు నేను లొంగ లేదని నా మీద కక్ష తీర్చుకున్నాడు, అంటూ తనని నిస్సహాయంగా చూస్తూ కన్ను మూసింది. అ లి వే లు కలువ రేకుల్లాంటి కళ్ళు శాశ్వతంగా మూసుకు పోయిన క్షణంలో, తన రెండు కళ్ళూ పోయినట్టుగా, లోకమంతాచీకటిగా మారి పోయింది. వీడి అసలు రంగు అలివేలు ద్వారా బయటపడినప్పుడు తన కళ్ళు భగభగ మండాయి. తన హృదయంలో పగ పడగ విప్పి బుసకొట్టింది. కాటు వెయ్యడానికి తగిన సమయం కోసం, అవకాశం కోసం, ఆ నాటినుంచీ ఎదురు చూస్తున్నాడు. పది సంవత్సరాలు దొర్లి పోయినా, తనకా అవకాశం లభ్యం కాలేదు. దైవికంగా ఈ నాడు తను ప్రతీకారం తీర్చుకొనే అవకాశం దొరికింది.

తను సీతని రెండోపెళ్ళి చేసు కున్నాడు. ఇద్దరు పిల్లలు పుట్టారు. పిల్లలను తనూ, సీతా, ఎంత గారాబంగా చూసుకుంటున్నా, వీడి పిల్లలు తన పిల్లలిద్దరిచేతా అర్థమైన పనులూ చేయించు కుంటున్నారు. చెయ్యకపోతే తంతున్నారు. పిల్లలకు బాగా చదువు చెప్పించి వృద్ధి లోకి తేవాలని తనెంతగానో అభిలషిం చాడు. కాని గొడ్డుచాకిరీకి అలవాటు పడిపోయిన పిల్లలకు చదువు అబ్బలేదు. వాళ్ల బ్రతుకులు నాశనమౌతున్నాయి.

తన తండ్రి వీళ్ల కొంపలో పూడిగం చేస్తూ హతమారిపోయాడు ఆ రోజు తన తండ్రే కారును నడిపి వుంటే ఆ ప్రమాదం జ రి గి వుండేది కాదేమో. ఆతన్ని పక్కకు నెట్టి, వీడి బాబు, కారును నడిపి లారీకి గుద్దించేశాడు. ఇద్దరూ చచ్చారు. ఆ బెంగతోనే తన తల్లి కన్ను మూసింది. అప్పటికి తనకి పదిహేనేళ్లు—పదవతరగతి చ దు వు తున్నాడు. దిక్కులేని తనపై సానుభూతిని చూపిస్తూ, చదువును మానిపించి వీడి కొంపలో పూడిగానికి పెట్టుకున్నాడు. ఆనాటినుంచీ అర్థమైన చాకిరీ చేయించు కుంటున్నాడు. తన తండ్రి జీవితం వీళ్ళకి సేవ చేస్తూండగానే అంతమై పోయింది. ప్రస్తుతం తనూ, సీతా, పిల్లలూ గొడ్డుచాకిరీ చేస్తూ, అడుగులకు మడుగు లొత్తుతూ, బానిస బ్రతుకులు బ్రతకాల్సి వస్తోంది. ఇప్పుడే కాకుండా భవిష్యత్తులో కూడా తన పిల్లలు వీడి పిల్లల క్రింద చాకిరీ చేస్తూ బ్రతకాల్సి ఉందేమో. దీన్నిబట్టి చూస్తే ఈ వ్యవ

హారం ఇలాగే తరతరాల వరకూ కొనసాగేటట్టుగా కనిపిస్తోంది. ఇంక ఈ అన్యాయం ఇలా అన్యాయంగా కొనసాగ డానికి వీల్లేదు. తన బ్రతుకూ, సీత బ్రతుకూ ఎలాగూ కాలిపోతున్నాయి. తన పిల్లల భవిష్యత్తు వీళ్ల కాళ్లకింద పడి నాశనం కాకూడదు. అది తను భరించ లేడు. తన పిల్లల భవిష్యత్తు బాగుండా లంటే, వీడు తనకి చేసిన ద్రోహానికి తగిన శాస్త్రి జరగాలంటే, తక్షణం వీడు చావాలి, చచ్చి తీరాలి. దృఢంగా అనుకుంటూ కుడిచేతి పిడికిలితో సిమ్మెంటు బెంచీమీద గట్టిగా గుద్దాడు, రాజయ్య.

డాక్టర్ రాంగోపాల్ ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడని తెలిసి జనం గుంపులు గుంపులుగా వచ్చి తమ సంతాపాన్ని వ్యక్తం చేస్తున్నారు. అందరి ముఖాల్లోనూ దైన్యం తాండవిస్తోంది. రోజూ మాదిరిగా అతని దగ్గర ట్రీట్‌మెంటు కోసం వచ్చిన రోగులు ఆర్తనాదాలు చేస్తున్నారు. హాస్పిటల్ లోపలా, బయటా, అంతా కోలాహలంగా వుంది. మెయిన్ ఎంట్రెన్సు దగ్గర జనం గుమి గూడి వున్నారు. అదంతా గమనిస్తూ మరొక బీడీని వెలిగించి గట్టిగా దమ్ము లాగి నిదానంగా పొగ వదిలాడు రాజయ్య.

'ఎంతమంది జనం వస్తున్నారు! వాళ్లందరికీ వీడు దేముడు! కాని వీడి నిజస్వరూపం ఈ అమాయకపు జనాలకి తెలియదు. ఆ సంగతి తను చెప్పినా వాళ్లు నమ్మరు. తల బాదుకొని గోల పెట్టినా వినరు. పైగా తనని ముక్కలు ముక్కలుగా కోసి పారేస్తారు. తమ దైవాన్ని తూలనాడితే సహిస్తారా వాళ్లు? హుం దైవం' అనుకుంటూ కోపంతో బుస కొట్టాడు రాజయ్య. ఆరిపోయిన బీడీని విసుక్కుంటూ విరిచి పారేశాడు.

'ఇప్పుడు వీడి ఆయువుపట్టు తన చేతిలో వుంది. తను రక్తదానం చేస్తే బ్రతికిపోతాడు. తన రక్తం వీడికి సరి పడుతుందట! ఇదివరకు తను ఎవరికో రక్తదానం చేసినప్పుడు చెప్పాడు. అదృష్టంకొద్దీ ఆ సంగతి మరెవరికీ తెలియదు. భక్తి విశ్వాసాలతో పనిచేసు కుంటున్న తనకి తీరని ద్రోహం చేశాడు. ద్రోహానికి ద్రోహమే తగినశాస్తి. తను కనీసం ఒక్క చుక్కయినా రక్తాన్ని ఇవ్వకూడదు. అలాగే వుండి వుండి మరెక్కడా రక్తం దొరక్కపోతే చస్తాడు. ఆ కబురు తెలిసి వాడి భార్య కరుణాదేవి గుండె పగిలి చస్తుంది. అసలు అలివేలు చావుకి మూలకారణం వీడి భార్య. గుండె జబ్బు కారణంగా దాన్ని దూరంగా వుంచాల్సి వచ్చి, వీడు అలివేలు వెంటబడి వుంటాడు. కామాంధుడు. అలివేలు లొంగలేదని కక్ష పెట్టుకొని హతమార్చేశాడు రాక్షసుడు. చేసిన పాపం వూరకే

పోతుందా-ఈ దెబ్బతో ఇద్దరూ కూలి పోతారు. తరువాత-తనూ, సీతా పిల్లలూ స్వేచ్ఛగా, హాయిగా జీవించవచ్చు. అసలు అలివేలు పోయినప్పటినుంచీ పీడి కొంపలో వూడిగం మానేద్దామని తను శతవిధాల ప్రయత్నించాడు. కాని ఎక్కడా మంచి నౌఖరీ దొరకలేదు. వీడూ, కరుణాదేవీ, చచ్చిన తరువాత తనకా అదృష్టం పట్టవచ్చు." మీసాన్ని మెలివేసుకుంటూ ఆనందంతో పొంగి పోయాడు రాజయ్య కాని...

రాజయ్యలో ఆ ఆనందం ఎంతో సేపు నిలువలేకపోయింది. దేవతలాంటి కరుణాదేవి రూపం అంతరంగంలో మెదలగానే, అతనికి ఎవరో గుండెల మీద బలంగా తన్నినట్టయింది. అమాయకురాలూ, కరుణామయీ, అయిన కరుణాదేవి అంతాన్ని అన్యాయంగా కోరి నందుకు అతని మనసు నడుం విరిగిన పాములా గిలగిలా కొట్టుకుపోయింది. క్రమక్రమంగా అతని ఆనందం హరించి పోతున్న కర్పూర హారతిలా దిగజారి పోతూ, ఆ స్థానంలో పశ్చాత్తాపం చోటు చేసుకోనారంభించింది. అమితమైన పశ్చాత్తాపం అతని కన్నులలో నీరు నింపింది.

"కరుణాదేవిలాంటి చల్లని తల్లి మరణాన్ని అన్యాయంగా కోరిన తను పరమ కిరాతకుడు. మహా పాపాత్ముడు. ఆ తల్లి మహాత్మురాలు. ఇంత చదువు కున్నా, ఎన్ని సంపదలున్నా, ఆమెది విశాలహృదయం. పేరుకు తగ్గట్టు కరుణారస పూరితమైన ప్రవర్తన ఆమెది! ఆ మహనీయురాలు కలకాలం సుఖంగా జీవించాలి. ఆమెకు ఎటువంటి అనర్థం జరగకూడదు. అది తన మూలంగా అసలు జరగకూడదు. ఆ మహాసాధ్వికి ఎంత ద్రోహాన్ని తల పెట్టాడు తను! తనింకా బ్రతికున్నా డెందుకు? తన తల పగిలి ముక్కలు కాకుండా వుందేం? శత్రువునైనా కనికరించి చేరదీసే దయార్ద్ర హృదయు రాలు! సాటి మానవులకు ఆమె చేసే సహాయం ఎనలేనిది. తన సీతకు జబ్బు చేసినప్పుడు ఆ తల్లి దానికి ఎంత ఉదారంగా సేవలు చేసిందని! అప్పుడు తనెంత పొంగిపోయాడు. 'మీ దయ వలనా, అపారమైన సేవ వలనా, సీత బతికి బయటపడింది. మీరు ఆదుకోక పోతే సీత నాకు దక్కకుండా పోయేది. మీరు మా పట్ల చూపిస్తున్న దయకు ప్రతిఫలంగా ఏమివ్వగలం? భగవంతుడు మీకు మేలుచేస్తాడు తల్లీ" సీతకు, అని ఆతల్లి పథ్యం పెట్టిననాడు, చెమ్మగిల్లిన కళ్లను ఒత్తుకుంటూ అన్నాడు తను. 'ఇదొక సేవ కాదు దయచూపించడం అంతకన్నా కాదు. నా విద్యుక్త ధర్మాన్ని నేను నిర్వర్తించుకున్నాను. అంతే కాని మరేమీ కాదు. ఆపదలోవున్నవారిని చేతనయినంతవరకూ ఆదుకోవడానికి



ప్రయత్నించాలి. మనకి అటువంటి అవకాశం వచ్చినప్పుడు దాన్ని జారవిడుచుకోకూడదు. సాటివారిని కష్ట సమయంలో ఆదుకోవడంలో అమితమైన ఆనందం వుంది. జీవితకాలం బహు స్వల్పం. అందులో సాధ్యమైనంతవరకూ కలుషితం లేకుండా చూసుకోవాలి. తెలియక మనం ఎన్నో పాపాలు చేస్తూనే వున్నాం. తెలిసీ పాపాలు చేసేదానికి బదులు పుణ్యకార్యాలు చేయగలిగే అవకాశం వచ్చినప్పుడు, దాన్ని సద్వినియోగం చేసుకోవాలి దైవస్వరూపమైన ప్రేమను సర్వ జీవరాసుల మీదా చూపే అవకాశం ప్రతి వ్యక్తికీ వుంది. సాధ్యమైనంతవరకూ దాన్ని ఆచరణలో పెట్టాలి. దౌర్జన్యం, మోసం, ద్రోహం, హింస— ఇలాంటివన్నీ ఘోరపాపాలు. వీలున్నంత వరకూ వాటిని దూరంగా వుంచాలి. వజ్రాన్ని వజ్రం తోనే కొయ్యాలి, కత్తిని కత్తితోనే ఎదుర్కోవాలి, మోసానికి

మోసమే సరయిన జవాబు. ద్రోహానికి ద్రోహం చెయ్యడమే తగిన శాస్తి—అనే సిద్ధాంతం అన్ని సందర్భాలలోనూ ఆచరించదగినది కాదు. ఎంతటి ద్రోహి అయినా ప్రాణాపాయస్థితిలో ఉండి మన సహాయాన్ని అర్థించినప్పుడు గాని, లేక మన సహాయం వలన అతని ప్రాణం నిలబడే అవకాశం ఉన్నప్పుడు గాని, అతను మనకు చేసిన ద్రోహాన్ని మనసులో పెట్టుకొని, నిర్లక్ష్యంచేసి అతని ప్రాణం పోవడానికి దోహదం చేసేకన్నా ఆపదలో వున్న ఆ వ్యక్తిని కాపాడడంలోనే వుంది ఔన్నత్యం. అందువల్ల మనం పొందే మానసికానందం అద్వితీయమైనది.' తననూ, సీతనూ, ఆప్యాయంగా చూస్తూ ఎంత చల్లని మాటలు చెప్పింది ఆ తల్లి! అదొక అపూర్వ సందేశం! ఆమె బంగారు పలుకులు మరువరానివి! ఆచరించ దగినవి...అయితే ఆ చల్లని తల్లి మాటలకు తనేం విలువనిచ్చాడు? ఆమె తమపట్ల చూపే ఆదరణకు ఆమె మరణాన్ని కోరుకోవడమా తనిచ్చే ప్రతి ఫలం? తనను భగవంతుడు క్షమిస్తాడా? ...ఎన్నటికీ క్షమించడు. కరుణాదేవికి కీడు తలపెట్టడం క్షమించరాని నేరం. ఏమయినా సరే, తను కుటుంబంతో సహా సర్వనాశనం అయినా సరే, తర తరాల వరకూ, వీళ్ల సేవకు తన వంశం అంకితమై అధఃపాతాళానికి అణగారి పోయినా ఫరవాలేదు. కరుణాదేవి అమూల్య వాక్కులను ఆచరణలో పెట్టాలి. అదృష్టంకొద్దీ తన కిప్పుడా అవకాశం దొరికింది. ద్రోహపూరితమైన తన నిర్ణయాన్ని మార్చుకోవాలి. రాంగోపాల్‌కి తన రక్తాన్ని ధారపొయ్యాలి అవసరమైతే ఒక్క చుక్క రక్తమైనా తన దేహంలో ఉంచుకోకుండా అర్పించాలి. అతన్ని బ్రతికించాలి. ఆ చల్లనితల్లి పసుపు కుంకాలను నిలబెట్టాలి. అయితే...తన కక్ష తీరేదెలా?...కసి చల్లారేదెలా?...ఎలాగ?...కరుణాదేవి కోసం తను కక్ష తీర్చుకొనే అవకాశాన్ని జారవిడుచుకోవాలా?......రాజయ్య మనసు చిందరవందర అయిపోసాగింది. మోకాళ్ల మధ్య తలను పెట్టుకొని మధన పడసాగాడు. అలివేలు చివరి మాటలు అతని చెవుల్లో గంటల్లా మ్రోగుతున్నాయి. వేయిరూపాల్లో గోచరమౌతూ, కక్ష తీర్చుకోమని అలివేలు గొంతు చించుకొని అరుస్తోంది...ఎలాగ?...తనిప్పుడేం చెయ్యాలి?...ఎటువైపు మొగ్గాలి?..., పట్టరాని వ్యధతో క్రింది పెదవిని పళ్లతో నొక్కిపెట్టి పిడికిళ్లు బిగించి సిమెంటు బెంచీకేసి కొట్టుకున్నాడు. జుట్టు పీక్కున్నాడు. 'భగవాన్ ఏమిటీ విషమ పరీక్ష' అనుకుంటూ ఆకాశంవైపు నిశ్చలంగా చూశాడు. కరుణాదేవి దేవతలా నిలబడి కర్తవ్యాన్ని బోధిస్తున్నట్టుగా కనిపిస్తోంది. మరొకవైపు కక్ష








తీర్చుకోమని అలివేలు గగ్గోలు పెడుతోంది. రాజయ్య మనస్సు సుస్థిరతను కోల్పోయి ఎటూ తెగని ఆలోచనల మధ్య ఊగిసలాడిపోసాగింది. అంతరంగం యుద్ధరంగంగా మారి మంచికీ-చెడుకీ, మానవత్వానికీ—దానవత్వానికీ మధ్య ఘోర సమరం సాగుతూండే భరించలేక నుదుటిమీద గట్టిగా చేత్తో రుద్దుకుంటూ విలవిల లాడిపోయాడు రాజయ్య. చివరకు మంచిని ఎదురించి పోరలేక చెడు వెలవెలపోయింది. మానవత్వం ముందు రాక్షసత్వం నిలువలేక చిత్తు చిత్తుగా ఓడిపోయి పారిపోయింది. హాలాహల జ్వాలలు అణగారిపోయి అమృతం ఉద్భవించింది.

రాజయ్య మనసు నిర్మలంగా ప్రశాంతంగా మారింది. దృఢనిశ్చయం ఏర్పడి వజ్రంకన్నా గట్టిపడిపోయింది. 'రాంగోపాల్ ప్రఖ్యాతిగాంచిన డాక్టరు. చుట్టుపక్కల మూడు నాలుగు జిల్లాల మేరకు అతన్ని మించినవాడు లేడు. అతని అపారమైన సేవలో వేలాది రోగార్తులు రోగాలు నయం చేసుకుంటున్నారు. ఎంతోమంది మృత్యుముఖంనుంచి బయటపడుతున్నారు. అలివేలు కాలం తీరి చచ్చిపోయి ఉండొచ్చు. డాక్టర్లు రోగులందరినీ బ్రతికించి తీరాలనుకోడం వెర్రితనం. మానవ సహజమైన మానసిక దౌర్బల్యం వలన అలివేలుని కాంక్షించి వుంటాడు. తను లొంగకపోయినందువల్ల కక్ష

తీర్చుకున్నాడని అలివేలు అపోహపడి ఉండొచ్చు. అలివేలు పోయాక ఈ పది సంవత్సరాలూ తను రాంగోపాల్ మీద అనవసరంగా కక్ష పెట్టుకున్నాడు. ఈనాటికి భగవంతుడు, తన కళ్లు తెరిపించి మహోపకారంచేశాడు తను రక్తాన్నివ్వక పోతే, ఒక్క రాంగోపాల్ మాత్రమే నష్టపోడు. అతని మరణవార్త విని దేవతలాంటి కరుణాదేవి కూలిపోతుంది. డాక్టర్ శ్రీరాంగారు పిచ్చెత్తిపోయే అవకాశం వుంది. తలమానికంలాంటి హాస్పిటల్ ఔన్నత్యం నేలపాలవుతుంది. వేలాది ప్రజలు రోగాలతో తీవ్రమైన బాధలకు గురికావలసి వస్తుంది. అటువంటి దుర్భర పరిస్థితి ఏర్పడితే తను భరించలేడు. కరుణాదేవికీ, రాంగోపాల్‌కీ, శ్రీరాంగారికీ, వేలాది ప్రజలకూ, తీరని ద్రోహంచేసి తను నిశ్చింతగా బ్రతకడం అసంభవం. అప్పుడు బ్రతికున్నా చచ్చినా ఒకటే... అమ్మా కరుణాదేవీ నీ ఉపదేశం ఇంతటి ఘోరపాపాన్ని చెయ్యకుండా నన్ను కాపాడింది. నీ కోసం నా ప్రాణాన్నయినా ఇచ్చేస్తాను. నా గుండెను కోసుకొని రక్తాన్ని పిండి, రాంగోపాల్ బాబుకి ధారపోస్తాను.' కుడి చేతి పిడికిలి బిగించి ఆవేశంగా అనుకున్నాడు రాజయ్య. అతని కళ్లలో నీళ్లూరాయి. వెనువెంటనే డాక్టర్ శ్రీరాం దగ్గరకు పరుగుతీశాడు.

సుమారు రెండు గంటల తరువాత, డాక్టర్ శ్రీరాం ఆనందంతో పొంగిపోతూ రాజయ్యను గాఢంగా కౌగిలించుకున్నాడు. "రాజయ్యా సమయానికి దేవుడిలా వచ్చి నీ రక్తాన్ని ధారపోసి రాంగోపాల్‌ని బ్రతికించావు. అంతేకాకుండా, అతని సేవలో రోగాల బారినుండి విముక్తి చెందుతున్న వేలాది ప్రజలను రక్షించావు. ఆపదలో వున్నవారికి తమ ఆరోగ్యవంతమైన రక్తాన్ని నిస్వార్థంగా దానంచేసే నీలాంటి మహానుభావులూ, ఔదార్యవంతులూ, మానవాళికి ఎంతో అవసరం." అభిమానం హద్దులు మీరుతూండగా రాజయ్య వీపును ఆప్యాయంగా నిమురుతూ అన్నాడు డాక్టరు శ్రీరాం.

'నాలాంటి పాపాత్ములు కాదు. కరుణాదేవిలాంటి దేవతలు, చల్లని తల్లులు, మానవాళి మనుగడకు అవసరం' హృదయపూర్వకంగా అనుకున్నాడు రాజయ్య, డాక్టర్ శ్రీరాం చూపే అభిమానానికి ఉక్కిరి బిక్కిరవుతూ.

ఆనందాశ్రువులు జాలువారుతూండగా వాళ్ళిద్దరినీ కృతజ్ఞతతో చూస్తూ వుండిపోయింది రాగిణి.



# తృప్తి

తులసి బాలకృష్ణ



ఆ రోజు —

గుండెల్లో అగ్నిపర్వతాలు బ్రద్దలవడమంటే ఏమిటో, మెదళ్లో సప్తసముద్రాలు పొంగిన హోరు వినిపించడం అంటే ఏమిటో, ఆకాశం, భూమి అతి వేగంగా, దగ్గరయిపోతూండగా ఆ మధ్యలో నలిగిపోవడం అంటే ఏమిటో తెలిసొచ్చింది.

నా ఒళ్ళో తలదాచుకుని, పద్మ శోక సముద్రంలో తలమునకలు అవుతోంది.

ఆమెను ఓదార్చే శక్తిగాని, నేర్పు

గాని ఆ సందర్భంలో నాకు లేవు. కారణం – ఆమెను బాధించిన విషయం అంతగా నన్ను బాధిస్తూండడమే. పబ్లిక్ గార్డెన్స్‌లోని లాన్స్‌లో రోజూ లాగే కూర్చుని మాట్లాడుకుంటున్నాం. రోజూలాగే హుషారుగా కాకుండా ఆ రోజు ఆమె అదోలా ఉండడం, చీకటి పడినా లేవకుండా, 'ఇంకొంచెంసేపు కూర్చుందాం' అనడం నాలో ఏవో అనుమానాల్ని రేకెత్తించాయి.

బాగా చీకటిపడింది. లాన్స్‌లోని జనమంతా వెళ్ళిపోయేరు.

– చటుక్కున నా చేతిని తన చేతుల్లోకి తీసుకొని, ముద్దుపెట్టుకుంది పద్మ. అయోమయంగా చూసాను ఆమెవైపు నా మొహంలోకి ఒక్కసారి చూసి, గబుక్కున నా ఒళ్ళో తల దాచుకుని బావురుమంది. మతిపోయినట్లయింది నాకు. నెమ్మదిగా ఆమె జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి నిమిరి, తల పైకెత్తాను.

"ఏంవిటిది పద్మా, ఏంవయిందని?!"

"శశీ! నా అంత దురదృష్టవంతురాలు మరొకరుండరు."

"ఛ ఛ ... ఏంవిటిది ? ... అసలు విషయం ఏవిటి చెప్పు."

"మా ఇంట్లో ఈ రోజు మా నాన్నతో పెద్ద గొడవ జరిగింది. మన పెళ్ళికి మా నాన్న ఒప్పుకోవడంలేదు. ఈ రోజుతో మన సంబంధం తెగిపోవాల్ట నేను మా బావనే పెళ్ళాడాలట, లేకపోతే తను ఆత్మహత్య చేసుకుంటార్ట......" అంటూ వెక్కుతూ నా ఒళ్ళోకి వాలిపోయింది.

– ఆ తర్వాత మా మధ్య ఎంతసేపటివరకూ మాటలు లేకపోవడం జరిగిందో చెప్పలేను. మూగభాషలో మాత్రం ఓదార్చుకున్నాం. సానుభూతి చూపించుకున్నాం. అటువంటి పరిస్థితి పగవాళ్ళకూడా రాకూడదనుకున్నాం.

నిజానికి నేను అప్పటికే జీవితంలో రాజీపడ్డం నేర్చుకున్న మనిషిని. కారణం – కొన్ని తప్పకుండా జరుగుతాయి అనుకున్నవి కాకపోవడమే. కాని నేను కలలో కూడా ఊహించని మంచి జరిగిన సందర్భాలుకూడా ఉన్నాయి. కనుకనే జరిగిందేదో మన మంచికోసమే అని సర్దిచెప్పుకోవడం అలవాటు చేసుకున్నాను. నిజానికి అలా తృప్తిపడకపోతే చేయగలిగిందేదీ లేదు.

"పద్మా! లే...చూడు – అనవసరంగా బాధపడకు. మనం అనుకున్నవన్నీ జరిగితే మన కోర్కెలకి అంతం ఉండదు. ఏది జరిగినా మన మంచికే అనుకోవాలి." ఎలా చెప్పానో నాకే తెలియదు. కుంచించుకుపోయేను.

"అంటే నువ్వనేది... ?" అనుమానంగా చూస్తూ అడిగింది.

"ఉం... మీ బావని ... ఒప్పుకోమని"

"శశీ !?!...నువ్వు...నన్ను...వేరే

వ్యక్తిని పెళ్లాడమంటున్నావా ?!! ... అయితే...అయితే నీ ప్రేమ..."

- సూటిగా ఆమె కళ్లలోకి చూసాను.

"పద్మా ! ప్రేమకి పరిపూర్ణత పెళ్ళితోటే లభిస్తుందంటే – అది నీ ఉద్దేశ్యంలో అవివేకమే. ప్రేమంటే ఆకర్షణ కాదు, ఇద్దరు వ్యక్తుల్ని శాశ్వతంగా కలిసుండాలని శాసిస్తూ కట్టిపడెయ్యడమూ కాదు. ఒకవ్యక్తి క్షేమం కోసం, స్నేహం కోసం, బాగుకోసం మరొక వ్యక్తి అనుక్షణం లోలోనే పడే తపన, ఆర్తే ప్రేమ. ఆ వ్యక్తితో అనునిత్యం కలిసుండక్కర్లేదు. వాళ్లమధ్య భార్యాభర్తల సంబంధమే ఉండఖ్ఖర్లేదు అది ఒక మగ, ఆడల మధ్యనే ఉండఖ్ఖర్లేదు. ఎవరైనా ఎవర్నైనా ప్రేమించొచ్చు. కాబట్టి మనిద్దరం భార్యాభర్తలం కానంతలో – మనం ఒకర్నొకరు మరిచిపోతామని నువ్వనుకోనఖ్కర్లేదు మీ ఇంట్లో అంతా కూడా మన పెళ్ళికి అంగీకరిస్తారని ఆశించాం. కాని అలా వ్రాసిపెట్టుంది. ఏం చేస్తాం ? లెటిట్‌బి – మీ బావని పెళ్ళిచేసుకో. మీ మావయ్య మీ నాన్నకి చిన్నతనం నుంచీ ఉపకారం చేస్తూ వచ్చాడని చెప్పావు కదూ ' ఆ ఉద్దేశ్యంతో మొదట్నుంచీ మీవాళ్లకి నిన్ను మీ బావకి యిచ్చి చేద్దామని వుండొచ్చు వాళ్లకి మాటకూడా యిచ్చి ఉండొచ్చు. నన్ను పూర్తిగా మరిచిపొమ్మని, ఇక నీకూ నాకూ సంబంధంలేదని చెప్పలేదు నేను. నీ బావతో నీ పెళ్ళి జరిగినప్పట్నుంచి నా ముఖ్యస్నేహితు డవుతాడు అతను. మన స్నేహం మీ వివాహానికి ఎటువంటి ఆటంకం కాకుండా మీరిద్దరూ అన్యోన్యంగా నూరేళ్లూ జీవించాలని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను." గుక్క తిప్పుకోకుండా, ఆమెకు మధ్యలో మాట్లాడే అవకాశం యివ్వకుండా చేప్పేశాను

ఏదో అనబోయి, నా ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది గానీ, ఆమెకు నోటమాట రాలేదు.

* * *

ఓ రోజు —

ఓ శుభముహూర్తాన పద్మకు ఆమె బావతో వివాహం వైభవంగా జరిగిపోయింది నా పద్మ వివాహం – నా కళ్లెదురుగా — మరొక వ్యక్తితో — జరుగుతూండగా చూస్తున్నాను. ఎంత నిబ్బరించుకున్నా కంటిలో చెమ్మ అద్దుకోక తప్పిందికాదు నాకు. వాళ్ళు కోరినట్లుగా వాళ్ళ అమ్మాయి వివాహం జరగడానికి నే నేవిధంగానూ ఆటంకం కాకపోవడం కారణంగా పద్మ తల్లిదండ్రులు నన్ను ఎంతగా పొగిడారో, ఎన్ని మర్యాదలుచేశారో మాటల కందని విషయం

నా కాళ్లకి దణ్ణంపెట్టి భర్తకి నన్ను పరిచయంచేసింది పద్మ.

పద్మ భర్త సుకుమార్ బావున్నాడు. అతని ఉద్యోగం బాగుంది — బ్యాంకు ఏజంటు. అతని వెనక ఆస్తికూడా బాగానే ఉంది. అన్నిటినీ మించి నాకు షేక్‌హాండ్ యిస్తూ అతను నవ్విన వెన్నెలనవ్వు చాలా చాలా బావుంది. వారి వివాహ జీవితం మూడు పువ్వులూ, ఆరు కాయలూగా విరాజిల్లాలనే నా అభిలాషని వారికి తెలియజేసి, శెలవు తీసుకున్నాను.

*　　*　　*

ఈ రోజు —

ఇంతటి ఘోరం జరుగుతుందని నాకు ఎప్పుడూ పీడకల కూడా రాలేదు. గత రెండేళ్ళలోనూ నా శరీరం, హృదయం మిలట్రీలో ఎంతగా రాటు దేలినా యీ వార్తని నేను ఓర్చుకోలేని రోజు.

సుకుమార్‌కి కారుప్రమాదం అయ్యిందని తెలిసి యిక్కడి కొచ్చాను. హాస్పిటల్‌కి పరిగెత్తాను. నన్ను చూస్తూనే పద్మ హృదయవిదారకంగా బావురుమంది. ఆమెను ఓదార్చడానికి నా వద్ద మాటలు లేవు. సుకుమార్ని చూస్తూంటే గుండె తరుక్కుపోతున్నట్టయ్యింది

— అతని రెండు కాళ్ళూ తీసేశారు.

హృదయమంతా విచారం నిండిపోగా, పెగలక పెగిలిన స్వరంతో, "ఎలా జరిగిందిది ?" అన్నాను. అంతకంటే అసలు ఏం మాట్లాడాలో తోచలేదు.

సుకుమార్ తేలిగ్గా నవ్వేశాడు. "విధి" అన్నాడు. ప్రక్కనే కూర్చుని ఏడుస్తున్న పద్మభుజం నిమిరాడు.

అతన్ని చూస్తూ మౌనంగా కూర్చుండిపోయేను.

నన్ను యింటికి వెళ్ళి రెస్టు తీసుకోమని నౌకరుకి పురమాయించాడు సుకుమార్. ఇంటికి వచ్చాక నాకు రూము చూపించి, అన్ని సదుపాయాలు చూసాడు నౌకరు. పద్మ హాస్పిటల్లో భర్తవద్దే ఉండిపోయింది స్నానంచేసి, నాలుగు మెతుకులు కతికి, విశ్రాంతి తీసుకుందామని పక్కమీద వాలేనన్నమాటేగానీ, ఎక్కడి విశ్రాంతి ?! పద్మ జీవితం యిలా అయిపోవడం నాకు యెంతో బాధ కలిగిస్తోంది. మేమిద్దరం కలిసి జీవించేభాగ్యం కలగకపోయినా, నా జీవితంలో నా ప్రక్కన మరో యువతికి స్థానం కల్పించకూడదని నేను నిశ్చయించుకున్నా, పద్మ హాయిగానే జీవించగలుగుతోంది కదా అని సంతోషించాను. కాని...కాని... యింత ఘోరం......

"శశీ ! ఓ అరగంటపోయేక నాతో బయటకు రావడానికి నీకు వీలవుతుందా? రెస్టు తీసుకుంటావా ?"

ఉలిక్కిపడి, మోచేతుల ఆసరా మీద పైకి లేచి, గుమ్మంవైపు చూసాను.

పద్మ. చేతిలో ప్లాస్టిక్ బ్యాగూ,

ఫ్లాస్కు- అప్పుడే హాస్పిటల్‌నుంచి వచ్చినట్లుంది.

"అలాగే వస్తాను. రెస్టు అవసరం లేదు, నా కిప్పుడు. ఇప్పుడు రమ్మన్నా నేను సిద్ధమే." లేచి కూర్చుంటూ అన్నాను.

"అబ్బబ్బే, తొందర లేదులే - రెస్టు తీసుకో. ఓ అరగంట పోయేక వెళ్దాం" అని లోపలికి వెళ్ళిపోయింది.

అరగంట అరుగంటల్లా గడిచింది. లేచి, బట్టలు వేసుకుని, పద్మతో బయటకు బయల్దేరాను. టాక్సీని పిలిచి ఎక్కమంది. ఎక్కడికో తెలియక పోయినా మాటాడకుండా ఎక్కి కూర్చు న్నాను. తనూ ఎక్కి. "పబ్లిక్



గార్డెన్స్" అంది డ్రయివర్‌తో. నాకు మతిపోయింది. కంగారుగానూ, అయో మయంగానూ ఆమె ముఖంలోకి చూసాను. ఆమె బయటకు చూస్తూ కూర్చుంది.

- పబ్లిక్ గార్డెన్స్‌లో రెండేళ్ళక్రితం మేం కూర్చునే లాన్స్‌లో అదే స్థలంలో కూర్చున్నాం.

పద్మ రుమాలుతో కనుకొలకుల్ని తుడుచుకుంది.

"పద్మా ! నిజంగా, నీకు వచ్చిన యీ కష్టానికి నేనెంతగానో బాధపడుతున్నాను. అయామ్ గ్రేట్లీ గ్రీవ్డ్" అన్నాను బాధగా.

పద్మ మాట్లాడకుండా తలవంచుకుని కూర్చుంది.

"పద్మా ? ఎలా జరిగింది యీ ప్రమాదం ?" అన్నాను.

నెమ్మదిగా తల యెత్తింది పద్మ. సూటిగా నా కళ్లలోకి చూసింది.

"దేవుడు నన్ను చిన్నచూపు చూడబట్టి జరిగింది. యీ ప్రమాదం ఎలా జరిగిందో నీకు చెప్పడానికి కాదు నిన్ను యిప్పుడు యిక్కడకు తీసుకొచ్చింది... శశీ ! ... నువ్వు...నన్ను పెళ్ళిచేసుకుంటావా ?"

— నేను కూర్చున్న నేల అమితవేగంతో పాతాళంలోకి జారిపోతున్నట్లయింది. ఆమె వేసిన ప్రశ్నవల్ల కలిగిన షాక్‌ని తట్టుకోలేకపోయాను.

"ఇలాంటి ప్రశ్న, యీ పరిస్థితుల్లో ఈ మనిషి యెలా అడగ్గలుగుతోందని కదూ ఆశ్చర్యపోతున్నావు ?! నాకు తెలుసు శశీ ! కానీ... ఈ ప్రశ్నంటూ నేను వేయగలిగితే – అది నిన్నొక్కణ్ణే. ఇంకొకర్ని వేసే అర్హతగానీ, ధైర్యంగానీ నాకు లేవు. చెప్పు. నీ కభ్యంతరమా ?" అదే చూపు చూస్తూ రెట్టించింది.

"పద్మా! ఎందుకిలా అడుగుతున్నావు నువ్వు ?... నువ్వేమీ అనుకోవని తలచి ఓ ప్రశ్న అడుగుతున్నాను – నీ భర్త మంచివాడు కాదా ? – అంటే నా ఉద్దేశం...యిన్నాళ్లూ నిన్ను బాధలు పెట్టేవాడా ?"

"లేదు. ఏ బాధలూ పెట్టలేదు. ఆయన చాలా మంచివాడు. ఒక్కమాటలో – దేవుడు."

"మరి ?'! అంత మంచివాడయినప్పుడు...నువ్వు...నన్ను..."

"ఇప్పుడు నా వయస్సెంత ?" – చటుక్కున అడిగింది, నా మాటల్ని మధ్యలో త్రుంచుతూ.

ఆ ప్రశ్న అలా యెందుకు అడిగిందో నాకు అర్థంకాలేదు. తనే అందుకుంది, "ఇరవై అంటే అసలు అనుభవించవలసిన జీవితమంతా ముందే ఉన్నదన్నమాట. ఇలాంటి వయస్సులో భర్త శాశ్వతంగా అవిటివాడయిపోతే, యిక జీవితాంతం అతనికి సతీ అనసూయలా సేవలు చేసుకుంటూ గడపడం నాలాంటిదానికి సాధ్యంకాదు." ఆమె గుండెల్లోంచి దుఃఖం తన్నుకొచ్చి గొంతు వణికింది. కళ్లల్లో చెమ్మ.

"నీ మనసెంతగా బాధతో సతమతమవుతోందో నేను వూహించగలను పద్మా ! కానీ విధి నెదిరించడం ఎవరి తరమూకాదు."

"ఎందుకాదు ? అన్నీ సాధ్యమే. విధి, సంఘం – యివికాదు నాకు

ముఖ్యం. నా భర్తకి జరిగిన ప్రమాదానికి నేనుకూడా అతనితోబాటు జీవితాంతం సంతోషానికి దూరం కావాలంటే నా మనసుకి నేను సమాధానం చెప్పుకోలేకపోతున్నాను. ఇకముందు నా భర్తతో హాయిగా జంటగా తిరగలేనంటే గుండెల్లో వణుకు పుడుతోంది స్కూటర్ల మీద కిలకిల్లాడుతూ పోతూన్న నా ఫ్రెండ్సునీ, యితర జంటల్నీ చూస్తూంటే ఉక్రోషం, అసూయ కలుగుతున్నాయి. గుర్రాల్లా పరిగెట్టే నా కోర్కెల్ని యింత చిన్నవయసులో చంపుకోవడం అసాధ్యం. అది జనసత్వాలు ఉడిగినవారికి తిండికి గతిలేనివారికి మాత్రమే సాధ్యమేమో! నేనూ అందరు యువతుల్లాగే అన్ని సుఖాలనూ పొందాలిగానీ, యింత చిన్న వయసులోనే నా బంగారు భవిష్యత్తుని బూడిదపాలు చేసుకోవడం నా కిష్టం లేదు. నా ఈ పరిస్థితిని, నా మనస్సునీ అర్థంచేసుకున్నారు నా భర్త. నన్ను మళ్లీ పెళ్ళిచేసుకోమని ఆయనే అన్నారు. కావాలంటే యిప్పుడు నన్ను చేసుకున్న వ్యక్తితో వేరేగా కూడా వెళ్ళిపోవచ్చునన్నారు. తన మూలంగా నా బంగారు భవిష్యత్తు నాశనం అయిపోవడం తనకి సుతారామూ యిష్టంలేదన్నారు. ఇంక యెవ్వరి అడ్డంకీ లేదు. నీకు యిష్టమే కదూ?"

— నిజంగా ఆ సందర్భంలో నాకు పిచెక్కిపోతుందేమోనని భయంవేసింది. అసలు ఈ ఊరు రాకుండా ఉండవలసింది అనిపించింది. ఏనాడయితే మా ప్రేమకు పెళ్ళి జరగలేదో అనాడే పెళ్ళి అనే మాటకి గుడ్‌బై చెప్పి, మిలట్రీలోకి వెళ్ళిపోయి ఒకరకం జీవితానికి అలవాటుపడ్డ నేను యిప్పుడు మళ్ళీ పెళ్ళి విషయం తలపెట్టడమా?! అందులో ఆమె భర్త సజీవుడై ఉండగా?!... పైగా ఈ పరిస్థితుల్లో!!!... నా మెదడు వేడెక్కిపోయింది... ఆ వేడిలోంచే చిన్నమెరుపు పుట్టింది.

"పద్మా! నువ్వు పునర్వివాహం చేసుకోవాలనుకోవడం—అందరు యువతుల్లా నువ్వు సుఖాలనుభవించలేకపోవడం వారిలా స్కూటర్లమీదా, కార్లమీద, సినిమాలకి, షికార్లకి యిక ముందు భర్తతో సరదాగా తిరగలేను కదా అనే బాధతోనే కదూ!" అన్నాను తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో.

— మౌనంగా క్రిందిచూపుతో చూస్తూ తలాడించింది పద్మ.

"ఊఁ...మన వివాహం సంగతి ఒక్క అరగంటలో నేను నీకు చెబ్తాను. ఈలోగా కొన్ని విషయాలు చెబ్తాను. వింటావా?" అన్నాను

'అలాగే' అన్నట్లుగా తలూపింది.

మంచి ఉత్సాహం, ఒకవిధమైన ధైర్యం కలిగాయి నాకు

"కొందరికి మిలట్రీ అంటే మెకానికల్‌గా సాగిపోయే జీవితంలా కనిపించవచ్చుగానీ — నాలాంటివాడికి మాత్రం

చాలా ఆనందదాయకమైన జీవితం అది. టైమ్‌టేబిల్ ప్రకారం మేం యెంత క్రమశిక్షణాయుతమైన అలవాట్లు అలవరుచుకోవటసి వుంటుందో—లీజరు టైంలో అంత స్వేచ్ఛ ఉంటుంది మాకు. ఆ లీజర్ టైంలో మేం ఆడతాం, పాడతాం, కబుర్లు చెప్పుకుంటాం ... ఓహ్, ఒకటేమిటి. అలా కబుర్లు చెప్పుకునేటప్పుడు సుఖంగా జీవించే జంటల్ని గురించిన టాపిక్‌లు కూడా చాలానే వచ్చేవి. ఊరికే చెప్పుతాను — సరదాగా విను," అని ఆమె ముఖంలోకి చూసాను.

మొహంలో విసుగును కాని, వినాలనే కుతూహలాన్నిగాని చూపించలేదు పద్మ. వింటూ అలాగే చూస్తూ కూర్చుండి పోయింది.

"మాన్‌సింగ్ అనే పంజాబీ వాళ్ల ఊరికి సంబంధించిన ఒక విషయం చెప్పాడు. వాళ్ళింటి దగ్గరలో ఒక సింగుగారికి రంభలాంటి పెళ్లాం ఉండే దిట. భర్తని పూవుల్తో పూజించేటంతటి ఉత్తమ యిల్లాలు ఆమె. స్నేహితు లంతా కూడా సింగుగారి అదృష్టాన్ని తెగ పొగిడేవారు. ఊరు అందరి దగ్గరా సింగుగారు మంచిగానే వుండే వాడు, ఇంటికి రాగానే మాత్రం భార్యని చచ్చేలా బాదేవాడు. ఇంతకీ ఆవిడ చేసిన మహాపాపం ఏంవిటయ్యా అంటే అందంగా వుండడమే. జెలసీ. ఊళ్ళో అందరూ తన భార్యని పొగుడు తూంటే కట్టుకున్న భార్యమీదే జెలసీ అతగాడికి. తను ఆమెకి తగనివాడి నేమోననే ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు. గమ్మత్తేవిటంటే ఇంట్లో అంత రభస జరిగినా, సాయంత్రం అయ్యేసరికి భార్యతో షికారుకి బయల్దేరేవాడుట ఆయన. ఆ జంటను చూస్తే — వాళ్ళు ఇంటిదగ్గర యింత గొడవపడతారంటే ఎవ్వరూ నమ్మలేరన్నమాట." అని ఆమె ముఖంలోకి చూసాను. పద్మ ముఖం కొంచెం వాడింది. ఏవో ఆలోచ న్లోకి జారుతోంది ఆమె.

"అలాగే గణేశన్ అనే యింకో మిత్రుడు యింకో సంఘటన చెప్పాడు. వాళ్ల ఊళ్లో ఓ జంట వుంది. భార్యా భర్తలిద్దరూ సమానంగా చదువుకున్న వారే. ఆమె కూడా చదువుకున్నదే కాబట్టి కట్నం అవసరంలేదని ఆమెని వివాహమాడాట్ట ఆయన. కానీ వివాహం అయిన తర్వాత "నలుగురు మగాళ్ళ మధ్యా నువ్వు వుద్యోగం చెయ్యడానికి వీల్లేదు" అన్నాడు. సరేనని యింటి దగ్గరే వుండిపోయింది ఆమె. కానీ ఇంటిదగ్గర భార్య ఏం తప్పుడు పనులు చేస్తోందోనని అనుమానం అతగాడికి. యింటికి రాగానే అనవసరపు అనుమా నాల్తో నానా బాధలకు గురిచేసేవాడు ఆమెని. అలాగే, "కట్నం లేదూ, ఏం లేదూ, తేరగా యింటిదగ్గర కూచుని మెక్కుతున్నావు" అని నానా మాటలూ అనేవాడు తిండికూడా సరిగ్గా పెట్టేవాడు

కాదు. పాపం ఆ అమ్మాయి కుళ్ళి కుళ్ళి ఏడ్చేది. మళ్ళీ వాళ్ళు బయట పార్టీకిల, షికార్లకీ అందంగా తయారై ఎంతో హుషారుగా వెళ్తూండేవారు. వాళ్ల గురించి తెలియనివారు ఏమనేవారుటో తెలుసా - 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' కపుల్ అని." అంటూ మళ్ళీ పద్మ ముఖంలోకిచూసాను. ఆమె ముఖం బాగా మారిపోయింది. కళ్లల్లో ఏదో కంగారు తృప్తిగా లోలోనే నవ్వుకున్నాను.

"అలాగే వెంకట్రావు అని మన విశాఖపట్నం ఆయన యింకో సంఘటన చెప్పాడు. వాళ్ళ ఊళ్ళో ఒక పెద్ద డాక్టరుగారికి ఓ అందమైన భార్య వుంది. తనొక్కడితోనే ఆమె మాట్లాడాలని ఆయన ఆంక్ష పెట్టాడు. తన తమ్ముడితో కూడా మాట్లాడనిచ్చేవాడు కాదు. ఆఖరుకి ప్రొద్దున్నొచ్చే పాల వాడితోగాని, పేపర్ బాయ్‌తోగాని, అర్జంటు కేసు ఏదైనా వస్తే ఆపేషంటు తాలూకు మగవారితోగాని మాట్లాడ్డానికి వీల్లేదు ఒకసారి ఆమె కజిన్‌బ్రదర్ వచ్చినప్పుడు అతనితో ఆమె మాట్లాడిందని ఒంటిమీద ఆమెకు వాతలు పెట్టాట్ట. బయటకొస్తే మాత్రం యిద్దరూ నవ్వుతూ, హాయిగానే తిరుగుతూ ఉండేవారు. చివరికి ఆయనకి ఓ రోజున ఏక్సిడెంటయి ఓ కాలు పోయింది. తను అవిటివాడవడం అలుసుగా తీసుకొని ఆమె ఇష్టమొచ్చినట్లు తిరుగుతుందనే మూర్ఖభయంతో ఆమెని ఓ గదిలో బంధించి, బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా చేసాట్ట. స్నానం, భోజనం మొదలైన సందర్భాల్లోమాత్రం తగు కాపలాతో ఆమెని వదిలేవాడు. అలాగే అఊళ్ళోనే యింకో ఆయన..."

"ఆగు...!" అరిచింది పద్మ.

కంగారుపడ్డట్టు నటిస్తూ ఆమె ముఖంలోకి చూసాను.

"ఇంక చెప్పొద్దు. నేను వెంటనే మా ఆయన దగ్గరకి వెళ్లాలి నువ్వు వస్తున్నావా ? ఉంటావా ?" లేచి నిల్చుని సూటిగా ప్రశ్నించింది. కంఠధ్వనిలో ఏదో తొందర.

"అదేవిటి అప్పుడే లేచావు ?! కూర్చో - ఈ వింతకూడా చెప్పనివ్వు. పైగా మన పెళ్ళి విషయం......"

"ఇంకేం చెప్పొద్దు. నీకు దణ్ణం పెడతాను. జరిగినదానికే యెంతో సిగ్గుపడుతున్నాను. నన్ను ఆ భగవంతుడు కూడా క్షమించడు. నా పాలిట దేవుడు మా ఆయనే. ఆయనతోదే నా జీవితం. ఆయన్నే క్షమాపణ కోరుకుంటాను. క్షమించగలిగే మంచిహృదయం ఆయనకుంది. ఇకనుంచీ ఆయనకే అంకితం అయిపోతాను. దయచేసి వెంటనే పద. ఈ సమయంలో ఆయన్ని వదిలి వుండడమే మహాపాపం. ప్లీజ్ - త్వరగా నడు" అంటూ తను గబగబా వెళ్ళిపోసాగింది.

నవ్వుతూ లేచి, "థేంక్ గాడ్" అనుకుని, ఆమెని అనుసరించాను.

---

వయసు పైనబడుతున్నకొద్దీ పట్టాభి రామయ్య అభిప్రాయాలు, ఆలోచనా ధోరణులు తీవ్రమైనవి కావటం ఆయన వ్యక్తిత్వంలో విశేషం!

చిన్నతనంలోనే అతనికి నాటకాల పిచ్చి పట్టుకొంది. పౌరాణిక నాటకాలు వేసి పద్యాలు పాడేవాడు మొదట్లో. నలభై ఏళ్లు దాటేక అతనికి పద్య నాటకాల్లో కృత్రిమత్వం వెగటు వేసింది. వచన నాటకాలలోకి దిగేడు.



# జీవన్నాటకం

## కప్పగంతుల మల్లికార్జునరావు

అలాగే నూనూగు మీసాల కాలంలో అతను భావకవిత్వం రాశాడు. ఆడదాని అనుభవం లేనిరోజుల్లోనే విరహకవిత్వం రాసి కవిగా పేరు తెచ్చుకొన్నాడు. కానీ ఆ తర్వాత ఆత్మవంచన చేసుకోలేక పోయాడు. పెళ్లయి, యిద్దరు పిల్లలు పుట్టేక అభ్యుదయకవిగా మారేడు. ఆ మధ్య రిటైరయ్యే ముందు రెండు గేయాలు వ్రాస్తే వాటిని విప్లవ కవులు పొగిడేరు.

వ్యక్తిగత విషయాల్లోనూ అదే పరిణామాన్ని ఆయనలో చూడవచ్చు. పుట్టింది శుద్ధ శ్రోత్రియ కుటుంబంలో అయినా మొదటినుంచీ స్నేహితులు మాలపల్లెల్లో వాళ్లే. కొడుకు ఆ మధ్య వో క్రిష్టియన్‌ను పెళ్లాడతానంటే ఆయన కాదనలేదు.

పట్టాభిరామయ్య భార్య అన్నపూర్ణ చాట్టి ఛాందసురాలు. రూపం ఎంత చక్కనిదో మనసు అంత మంచిది. సహనంలో భూదేవితో పోటీపడుతుంది. పట్టాభిరామయ్యంటే తగని ప్రేమ.

'ఆ మహా యిల్లాలు భార్య కాబట్టే యీయన ఆటలు సాగుతున్నాయి' అని అందరూ అనుకొనేవారు. చిత్రం ఏమంటే ఆమె మనసు వయసుకన్నా ముందే ముసలిదై కూర్చుంది.

కాపురాని కొచ్చిన కొత్తల్లో భర్త ధోరణిని మార్చటానికి ప్రయత్నించింది. అతను ఏ నాటకాలదాన్ని పట్టుకొని పోతాడో అని భయపడుతుండేది. నిజానికి పట్టాభిరామయ్య కాస్తో కూస్తో కలిగిన వాడు, అందగాడు, చదువుకొన్నవాడు గౌరవప్రదమైన ఉద్యోగి కావటంవల్ల నటీమణులు చాలామంది అతని ఆశ్రయంలో బతుకుదామని ఆశించక పోలేదు.

కాని పట్టాభిరామయ్య ఆలోచనల్లో అయితే మార్పులు వచ్చాయి కాని ఆయన వ్యక్తిగత ఆలవాట్లలో మార్పు లేనాడూ రాలేదు. చిన్నప్పటినుంచి అతను నిరాడంబరంగా జీవించటానికి అలవాటు పడ్డవాడు. నాటకాల్లో తిరిగినా, కవిత్వాలు రాసినా, సిగరెట్టు తాగే అలవాటైనా అబ్బలేదు యిక తాగుళ్లు, ముండల సంగతి చెప్పేదేముంది?

భావకవిత్వపు రోజుల్లోపంచె, లాల్చీలే విప్లవ ధోరణి వచ్చినా కొనసాగించాడు. ఎంత నాటకాలు వేస్తున్నా తెల్లవారు ఝామునకల్లా లేచిపోవాల్సిందే. ఆసనాలు వేయాల్సిందే కసరత్తు వేయాల్సిందే ఆ తర్వాత స్నానంచేసి కాస్సేపు ధ్యాన ముద్రలో ఏకాంతంలో ప్రశాంతంగా కళ్ళు మూసుకొని కూర్చోవాల్సిందే అలా కూర్చొన్నప్పుడు ఆయన దేన్ని ధ్యానిస్తాడో ఎవరికీ తెలియదు

'మీ ఆయన పొద్దున్నే జపం చేస్తాట్టగా?'

'జపమా పాడా? అంతమాత్రం భక్తి కూడానా ఆయన జన్మకి? కేశవ నామాలే ఉచ్చరించడు. నా పోరు, పిల్లల పోరు, తప్పించుకోటానికి అలా వంటరిగా కూర్చొని నాటకాల పోర్షను నెమరువేసుకొంటుంటాడు లేకపోతే ఏ నాటకాలదాన్ని ధ్యానించుకొంటున్నాడో, ఎవరికి తెల్సు?' అనేది అన్నపూర్ణ నవ్వుతూ.

నాటకాల్లో ఆయన అంతగా లీనమై పోయాడు. అది ఆయన తపస్సు.

అయితే ఆయన వృత్తి నాటకాలు కాదు పదో పరకో నాటకాల కోసం ఖర్చుపెట్టేడే కాని పైసా సంపాదించ లేదు.

ఆయనవృత్తి కాలేజీ లెక్చరర్. పోనీ అందులోనన్నా ఏమన్నా సంపాదించాడా అంటే అదీలేదు అసలే తెలుగు లెక్చరర్. పైగా క్లాసుల్లో, యింటిదగ్గర ట్యూషన్లకు

పిల్లల్ని ఆకర్షించటంకోసం అర్థం కాకుండా శాస్త్ర శాస్త్ర చెప్పే స్వభావం కాదు. తెల్సిందంతా నాటక ధోరణిలో వొక్కసారి వింటే కలకాలం గుర్తుండేలా చెప్పటం ఆయన కొక్కడికే చాతనయిన ఆర్ట్. అందుకే ఆయన క్లాసును ఎటువంటివాడూ ఎగగొట్టడు. ఎంతటి హీరో వేషాలు వేసేవాడూ ఆయన క్లాసులో పిల్లిలా కూర్చోవల్సిందే. క్లాసు చెప్తుండగా ఎవరైనా కొద్దిపాటి గుసగుస లాడినా, నాటకం మధ్యలో మూడ్ పోయినట్లు, మాంచి మూడ్‌లో కథ రాస్తుండగా పెన్నులో యింకు అయిపోయినట్లు చిరాకుపడిపోతాడు. ఆ తర్వాత ఆయన ఎవర్నీ ఏమీ అనడు. పాఠం మటుకు యిక ఆ రోజుకు సున్నానే.

అంచేత తోటి లెక్చరర్లంతా ట్యూషన్లు చెప్పి, గైడ్లు రాసి రెండు చేతులా డబ్బు సంపాదిస్తుంటే, పట్టాభిరామయ్య మాత్రం 'నాటకాల మాస్టారు' అన్న బిరుదును, మంచి లెక్చరర్ అన్న పేరును, విద్యార్థుల అభిమానాన్నీ, ప్రేమను పుష్కలంగా సంపాదించాడు.

ప్రభుత్వ కళాశాలలో లెక్చరర్ కావటంచేత ఆయన చాలా వూళ్ళు తిరిగేడు. పనిచేసిన చోటల్లా ఆయనకు శిష్య బృందాలు తయారయ్యాయి. నాటకాలు వేయించినచోటల్లా ఆయన అభిమానులు తయారయ్యారు. పొద్దున లేచిన దగ్గరినుంచి రాత్రి పడుకోబోయే లోగా ఆయన ఎందరి నమస్కారాలను స్వీకరించేవాడో లెక్కలేదు.

పౌరాణిక నాటకాలపట్ల విముఖత్వం ఏర్పడ్డాక ఆయన నాలుగైదు సాంఘిక నాటకాల్లో నటించాడు. కాని ఆయన ఎంత ప్రయత్నించి నటనలో పౌరాణిక వాసనల్ని చెరిపేసుకోలేక పోయాడు. పైగా అప్పటికి వయస్సు కూడా పైన బడ్తోంది.

అంచేత నటించటం ఆపు చేసి కాలేజీలోనూ బయటా కూడా నటులను తయారు చేయడం ప్రారంభించాడు. ప్రపంచ నటన పరిణామాన్ని క్షుణ్ణంగా అధ్యయనంచేసి కొన్ని కొన్ని కొత్త పద్ధతుల్లో నాటకాలని ప్రదర్శింపచేశాడు. నటుడికన్న ఆయనకు దర్శకుడిగా, ప్రయోక్తగా గొప్ప పేరొచ్చింది.

ఏ కాలేజీకి పోయినా నాటకాల శాఖ బాధ్యత ఆయన నెత్తినే పడేది. ఆయన ఆ బాధ్యతను తీసుకోటానికి ఏనాడూ వెనుకాడలేదు. విద్యార్థులకు చదువుపట్ల ఎంత అభిరుచి కలిగించాలో, లలితకళల పట్ల, క్రీడల పట్లా అంత అభిరుచి కలిగించటం అవసరమని ఆయన విశ్వాసం. ఆ విశ్వాసంతోనే ఆయన విద్యార్థులకి శిక్షణ యిచ్చి నాటకాలు వేయించాడు. క్లాసులో లాగానే నాటకాల రిహార్సల్ రూమ్‌లో కూడా ఆయన క్రమశిక్షణకుమారు పేరు.

అలా క్రమశిక్షణకు లోబడి ఆయనవద్ద నటనలో 'ఓనమాలు' నేర్చుకొని గొప్ప నటులైనవారు ఎందరో వున్నారు.

అలాగే ఆయనవద్ద చదువుకొని గొప్పవాళ్లయినవాళ్లూ ఎంతో మంది వున్నారు. అయితే వాళ్లందర్నీ పట్టాభి రామయ్య గుర్తుపట్టలేదు. ఎక్కడైనా కన్పిస్తే వాళ్లే నమస్కారం పెట్టి చెప్పు కొంటారు. కానీ తనదగ్గర నటనలో శిక్షణ పొందినవాళ్లను కాని, శిక్షణ పొందలేక అపజయాన్ని పొందినవారిని కాని ఆయన పేర్లతో సహా చెప్పేయ గలడు.

ప్రభుత్వ వుద్యోగంలోనుంచి రిటై రయ్యేనాటికి పట్టాభిరామయ్యకు మిగిలింది యీ జ్ఞాపకాలు, ఎక్కడెక్కడో వేర్వేరు వుపాధుల్లో వున్న శిష్యులు, తనని అభిమానించే శిష్యులు వున్నారన్న తృప్తిమాత్రమే. ముగురు పిల్లల చదువులకి ఆయన పిత్రార్జితమైన ఆస్తి నమ్మే ఖర్చుపెట్టేరు. కూతురు పెళ్ళికి ఆ పిత్రార్జితం మీదే ఆధారపడవలసి వచ్చింది. అయితే పెద్దకొడుకు ఇన్‌కమ్‌టేక్స్ ఆఫీసర్ అయ్యాడు. రెండో కొడుకు యమ్మెస్సీ పాసయి స్వంత వూళ్లో ప్రైవేటు కాలేజీలో లెక్చరర్ వుద్యోగం సంపాదించాడు.

సంప్రదాయాలపైన అభిమానాల విషయంలో పెద్దకొడుకుది అంతా తల్లి పోలిక. అంత పెద్ద చదువు చదివినా, వుద్యోగం చేస్తున్నా అతను తలిదండ్రుల మాట నెన్నడూ జవదాటలేదు. అతని భార్యను అన్నపూర్ణే ఎన్నికచేసింది. చదువు లంతగా చదవని పిల్లను, అంద గత్తెను, కుటుంబ సాంప్రదాయాలను చూచి మరీ ఎన్నికచేసింది. కాని పెళ్లాం వచ్చిన నెలరోజుల్లోనే కొడుకు తలిదండ్రులకు వుత్తరాలు రాయటం మానేసేడు. పూర్తిగా భార్యావిధేయుడై పోయాడు. ఆ భార్యకు అత్తమామల పొడే గిట్టదు.

రెండోవాడికైనా గుణవంతురాలైన పిల్లను, రిటైరయ్యాక తమని కనిపెట్టి వుండే పిల్లను చూచి చేసుకొందా మను కొంది అన్నపూర్ణ. కానీ రెండో కొడుకు సుధాకరాని వన్నీ వాళ్ల నాయన ఆలోచనలు. అంచేత ఆ అవకాశాన్ని తలిదండ్రుల కివ్వలేదు. తనకన్నా రెండునెలలు పెద్ద, తోటి లెక్చరర్ అయిన గీతారాణిని ప్రేమించేసి, పెళ్ళికి రమ్మని శుభలేఖతోపాటు వుత్తరం రాశాడు తలిదండ్రులకు.

అసలే పండు తమలపాకు అయింది అన్నపూర్ణ. యీ వార్త విన్నాక ఎండు టాకులా అయింది. ససేమిరా పెళ్ళికి రానంది.

'నా పోలికనుకొన్న పెద్దకొడుకు అలా చేశాడు. రెండోకొడుకైనా తలకి

కొరివి పెడ్తాడనుకొంటే వాడు మీకేం తీసిపోనని నిరూపించుకొన్నాడు.'

యిద్దరు కొడుకులు చేసిందానిలో పట్టాభిరామయ్యకు తప్పేం కన్పించ లేదు. పెళ్లయ్యాక పెళ్ళానికి లొంబడి మంచిగా వుండి, అన్యోన్యంగా కాపురం చేసుకోటంలో తప్పేముంది? అలాగే ప్రేమించిన పిల్లను పెళ్ళిచేసుకోటానికి కులాలు, మతాలు, వయస్సులు ఎందుకు అడ్డం రావాలి? పెద్దలు వాటి పేరిట తమ పెద్దరికాన్ని నిలుపుకోటానికి ఎందుకు తాపత్రయపడాలి?

పెళ్ళికి వొక్కడే వెళ్ళి వచ్చాడు. కోడలు పెద్ద రూపసి కాదు. కానీ ఆమె కలగలపు మనిషి. యిట్టే మంచిచేసు కొంటుంది ఎంతవాళ్లనూ!

"అమ్మాయ్. నువ్వోసారి మీ అత్తయ్య దగ్గరకు రారాదూ?"

"వస్తాను మామయ్యా. మీరెలాగూ రెండునెల్లో రిటైరవుతున్నారుగా? అప్పుడొచ్చి అత్తా మామల్ని మా యింటికి పిల్చుకొచ్చుకొంటాను."

అన్నట్లే గీతారాణి వచ్చింది నెలకే. కానీ అత్తను పిల్చుకుపోవటానికికాదు. ఆమెను మొదటిసారిగా చివరిసారిగా చూచి కన్నీరు కార్చటానికి!

"ఏమండీ. నేను పోతే మీ రెక్కడుం టారు? ఏంచేస్తారు?"

నిజానికి రేపు వెయ్యబోయే నాటకాలను గురించి తప్ప, క్లాసులో రేపు చెప్పాల్సిన పాఠాల్ని గురించి కూడా ఎప్పుడూ ఆలోచించని మనిషి, ఏం చెప్పగలడు సమాధానం?

"నాటకాలు మానెయ్యరు కదూ? రెండో కోడలు క్రిస్టియన్ అయినా యోగ్యురాలు. మిమ్మల్ని కనిపెట్టి వుంటుంది లెండి. నా కోసం దిగులు పెట్టుకోరుకదూ?'

ధీశాలిగా పేరు పొందిన పట్టాభి రామయ్య కన్నీళ్లు కార్చేడు భార్య మాటలకి. భార్య చెంపల్ని మృదువుగా ముద్దు పెట్టుకొన్నాడు.

* * *

భార్య బతికుండగా నాటకాలని కలవ రించిన పట్టాభిరామయ్య భార్య చనిపోయాక ఆమె కోసం దిగులుపడ సాగేడు. రిటైరయిన ఆరునెలలకే ఆయన శరీరంలో గొప్ప మార్పు వచ్చింది. అంత వరకు అసలు వయస్సుకన్నా చిన్న వాడుగా కన్పించిన ఆయన యిప్పుడు, వయస్సుకన్నా ముసలివాడులా కన్పించసాగేడు. కోడలి సేవకాని, కొడుకు ధైర్యపు మాటలు కాని ఆయనలో యీ పరిణామాన్ని ఆపలేకపోయాయి.

యీ ఆరునెలలూ బాగా రద్దీగావున్న ప్రాంతాల్లో తిరుగుతుండటమే ఆయన పని. కనిపించిన వాళ్లనల్లా 'నువ్వు ఫలానా వూళ్లో చదివేవుకదూ?' అని అడుగుతుండేవాడు దురదృష్టవశాత్తు ఎవరైనా శిష్యుడు కన్పిస్తే యిక అతడిని

వదిలేవాడు కాదు. అయితే ఆ వూళ్లో ప్రభుత్వ కాలేజీ లేకపోవటంవల్ల ఆయన శిష్యులు ఆట్టే లేరు. అంచేత దారినపోయే వాళ్ళను పలకరించి తన శిష్యుల్లో ఎవ రెవరు ఎంతటి గొప్పవాళ్ళయిందీ చెప్పసాగేడు. అవన్నీ నిజమేనని కొందరికి తెల్సినా వినీ వినీ విసిగిపోయి ఆయన్ని 'పిచ్చివాడి' కింద జమకట్ట సాగేరు అంతా

సుధాకరం, అతని భార్య గీతారాణి యీ పిచ్చి పోగొట్టటానికి ఎన్నో ప్రయ త్నాలు చేసేరు. విఫలమై ఎన్నో విరుగుళ్లు ఆలోచించారు.

'యీ పిచ్చికి నాటకా లొక్కటే మందండీ ఆయనకి.' గీతారాణి అంది.

ఆ విషయం సుధాకరానికీ తెల్సు. ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా తన తల్లి ఆయన నాటకాల తిరుగుడుకి ప్రేరణ శక్తి-చైతన్యం. ఆమె అండ యింట్లో తనకుందనే ఆయన అన్ని వేషాలు వేసూ అలా తిరగ్గలిగేడు.

ఆమె హాస్యాలు, ఎగతాళులు, అప్పు డప్పుడు పెట్టిన మందలింపులూ అన్నీ అతనిలో నాటకాల పిచ్చి పెరగటానికి ఔషధాలుగా పనిచేశాయి. యిప్పుడా ఔషధం లేదు నాటకాలు వేయలేడు. అందుకే యీ పిచ్చి.

అలాంటి సమయంలో అదృష్ట వశాత్తు ఆ ప్రాంతాల్లో నాటకాల పోటీలు జరిగేయి. నిర్వాహకులు పోటీలకు గుణ నిర్ణేతల విషయం చివరిదాకా ఆలోచించ లేదు. ఎవరూ దొరకలేదు పట్టాభిరామయ్య 'నాటకాల పిచ్చి' తప్ప, యీ ఆరు నెలలుగా వున్న పిచ్చి తెలియని వారెవరో ఆయన పేరు సూచించారు.

'అన్నపూర్ణ పోయింతర్వాత యింకా నాటకా లేమిటి? నేనెక్కడికీ రాను, అన్నాడు మొదట్లో విచారంగా. కాని ఆయనకొడుకు, కోడలు యీఅవకాశంలో ఆయన మళ్ళీ మామూలు మనిషయ్యే ఆశను చూచేరు. ఆయన్ని వత్తిడి చేశారు.

'అత్తయ్యగారు చివర్లో ఏం మాట తీసుకొందో మర్చిపోయారా మామయ్యా?'

'నాటకాలు మానెయ్యరు కదూ?' అన్నపూర్ణే నిలేసి అడిగినట్లనిపించింది.

అలా నాటక వాతావరణంలో తిరిగి ప్రవేశించాడు పట్టాభిరామయ్య. తీరా జడ్జిగా కూర్చున్నాక ఆయన 'పిచ్చి' తెల్సి నిర్వాహకులు భయపడ్డారు.

కాని ఆయన యిచ్చిన తీర్పు చూసాక మానసికంగా ఆయనలో వేడి, ఆనాటి చురుకుతనం తగ్గలేదని అందరికీ తెల్సి పోయింది. జడ్జిమెంటు యిచ్చే ముందు, చూచిన ప్రతి నాటకాన్ని గురించి విశ్లే షిస్తూ గుణదోషాలను చర్చించాడు.

త్వరలోనే ఆయనకి జడ్జిగా డిమేండ్ పెరిగింది. మామూలు మనిషయ్యాడు. నాటకాల పిచ్చి మళ్లీ పట్టుకొంది.

నాటక పోటీల్లో ఆంధ్రదేశంలో అన్ని ప్రాంతాలనుండి, ప్రవాసాంధ్రనుంచి కూడా టీములు వచ్చి నాటక ప్రదర్శన లిస్తుంటాయి. అలా పట్టాభిరామయ్య ఎప్పుడెప్పుడో తనదగ్గర చదివిన శిష్యుల్ని, తనదగ్గర తరిఫీదైన నాటకాల శిష్యుల్ని రంగస్థలంమీద చూచే అవకాశం వచ్చింది. వాళ్ళని గుర్తుపట్టేవాడు. అభిమానించేవాడు. అంతే ఆ అభిమానం, నిర్ణయాన్ని మాత్రం ప్రభావితం చేయలేకపోయేది.

నాటకాల వాతావరణంలో పడ్డాక తిరిగి ఆయనలో యవ్వనం ప్రవేశించింది. పోటీలు జరిగే రోజుల్లో రాత్రంతా మేలుకోవాల్సి వచ్చేది. కుర్చీలో అలాగే కూర్చోవాలి. ఆయన పక్కన కూర్చున్న జడ్జీలు అరగంటకు వోటీ, అయిదునిముషాలకు వో సిగరెట్టు తాగుతుండేవారు.

'మీరేం యువకులయ్యా? యింత నిగ్రహం లేకపోతే ఎలా? శారీరకంగా యిన్ని బలహీనతలా? మానసికంగా చూద్దామంటే మరీ ముసలాళ్ళలాగా వెనక్కి తిరిగి చూస్తూ ఆలోచిస్తారేం? ముందుకు చూడండయ్యా.'

పాత సిద్ధాంతాలను సంప్రదాయాల్ని పట్టుకు వేలాడే జడ్జీలంటే ఆయనకి పరమ చిరాకు. వాళ్ళు యువకులౌతే మరీ చిరాకు. ఆ నాలుగు రోజులూ వాళ్ళకి నాటకాలని ఎలా చూడాలో, ఎలా అర్థం చేసుకోవాలో గుణదోషాలను ఎలా పరిశీలించాలో క్లాసులు పెట్టి లెక్చర్ యిస్తుండేవాడు.

రెండేళ్ళలో ఆయన పేరు దేశమంతా పాకిపోయింది.

ఆయనదగ్గర చదువుకొని కలెక్టరయిన వొకతని ఆధ్వర్యంలో వో జిల్లా కేంద్రంలో నాటక పోటీలు జరుపుతున్నారు. ఆ కలెక్టరు చిన్నతనంలో నాటకాలేం వెయ్యలేదు కాని చూచేవాడు. అలా అభిరుచిని పెంచుకున్నాడు కలెక్టరు అయ్యేనాటికి ఆ అభిరుచి పెరిగి నాటకాలు వెయ్యాలన్న కోరికదాకా వచ్చినా అది కుదిరే విషయంకాదు. అంచేత నాటకాలు వేసేవారికి ప్రోత్సాహం యివ్వటం ద్వారా తన కోరికను తీర్చుకోవాలనుకొన్నాడు.

పోటీలను పెద్ద ఎత్తున ఏర్పాటు చేశారు. పట్టాభిరామయ్యను నాటక పోటీలకు జడ్జీగా వుండమని ఆహ్వానించటమేకాక, చివరిరోజు ఆయన్ని సన్మానిస్తున్నట్లు కూడా రాసేడు కలెక్టరు. సన్మానానికి పట్టాభిరామయ్య ముందు అంగీకరించకపోయినా కలెక్టరు తన శిష్యుడినని చెప్పుకొని మరీ మరీ అర్థించాక అంగీకరించాడు.

'గుర్తున్నానా మాస్టారూ?' రైలు దిగంగానే స్వాగతం చెప్తూ అడిగాడు కలెక్టరు ఆశగా.

'నువ్వు నాటకాలు వేసేవాడివా?'

'లేదు మాస్టారూ. కాలేజీలో ఫస్టు మార్కులు నావే తెలుగులో నూటికి తొంభై అయిదు వచ్చినందుకు నన్నోసారి అభినందించారు కూడా.'

పట్టాభిరామయ్యకి ఎంత వెనక్కిపోయినా కలెక్టరు విద్యార్థిగా గుర్తుకు రాలేదు.

'చూచావుటోయ్ నా దురదృష్టం! కాలేజీలో ఫస్టుమార్కులొచ్చే వాళ్ళని నేను మర్చిపోతుంటాను. కానీ యిటు చదువుకీ అటు నాటకాలకీ పనికిరాకుండా పోయినవాళ్లు కూడా నాకు గుర్తుంటారు.'

'అదేమిటి మాస్టారూ?'

'చెప్తాను కాని-యీ సినిమా పిచ్చి నీకూ్కడా ఏమిటోయ్? నా సన్మానానికి సినిమానటుడే అధ్యక్షత వహించాలా ఏమిటి? బహుమతి ప్రదానోత్సవం సినిమా తారల్లేకపోతే రక్తికట్టదనా ఏమిటి, యిద్దర్ని పెట్టేవ్?'

పట్టాభిరామయ్య నుంచి కలెక్టర్ యీ 'ఎటేక్'ను ఆశించలేదు. అంచేత మాట్లాడలేకపోయాడు.

'అంతగా అయితే జిల్లాకలెక్టరువి-నువ్వే సభాధ్యక్షత వహించకపోయావ్ నా సన్మానానికి? వాడెందుకు?'

'ఎంతైనా నేను మీ విద్యార్థిని కదా మాస్టారూ? మీ సభకు అధ్యక్షత వహించే స్థాయి నాకుందా?'

పట్టాభిరామయ్య కళ్ళు చెమ్మగిల్లేయి. ఆప్యాయంగా కలెక్టరు భుజంమీద చేయి వేసి దగ్గరికి లాక్కున్నాడు.

'చాలా మంచి విద్యార్థివోయ్. నిన్ను చూచి నేను గర్విస్తున్నాను. కలెక్టరు 'కాంప్లెక్స్'తో మెలుగుతావేమోనను కొన్నాను. ఎంతైనా ఐ.ఏ.యస్.వి కదా?'

'విద్య చెప్పిన గురువులు మాస్టారూ మీరు. మీరు క్లాసులో చేసిన వుపన్యాసాలు యింకా యిప్పటికీ నా చెవుల్లో మోగుతున్నాయ్. ఆనాటి మీ మూర్తి నన్ను ఎప్పుడూ నడిపిస్తూనే వుంది ముందుకి. కలెక్టరయినా, గవర్నరైనా మరేదైనా మీ ముందు మే మెంత మాస్టారూ? అలా అనుకోకండి.'

'అనుకోనోయ్. మేస్టరుకి యీ అనుభూతి చాలోయ్. యిది వొక్క ఉపాధ్యాయుడి అనుభవంలోనే వచ్చే అనుభూతి యీ అనుభూతిని కోట్లు,లక్షలు రూపాయల్తో కొనుక్కో లేరెవరూ.'

'పొరపాటయింది మేస్టారూ. సభాధ్యక్షుడి విషయంలో మిమ్మల్ని సంప్రదించి వుండాల్సింది. మంత్రులంటే మీ కిష్టం వుండదని, కళాకారులు కదాని...'

పట్టాభిరామయ్య బిగ్గరగా నవ్వేడు.

'సినిమాస్టారుల్ని కళాకారులనుకొనే కలెక్టర్లని చూచి నవ్వ కేం చేయనోయ్? సినిమా పెద్ద వ్యాపార కళ. నాటకాలు ఆసలు సిసలు కళ. కనుక సినిమా

స్టారుల్లో చాలా మంది వ్యాపార కళాకారులు. నువ్వు ఆహ్వానించిన స్టారు లిద్దరూ అలాంటివాళ్లే.'

కలెక్టరేం మాట్లాడలేకపోయాడు.

'దిగులుపడకు. నీలాగే వాడూ నా శిష్యుడు. అయితే నీలాంటి శిష్యుడు కాదు. అటు నాటకాలకీ పనికిరాడని వాడిని డిస్‌క్వాలిఫై చేసేసేను. చదువు లోనూ పనికిరాడని–కాపీ కొట్టుంటే పట్టుకొని డీబార్ చేయించాలే. అందుకే వాడు గొప్ప సినిమా స్టారయ్యాడు.'

కలెక్టరు దిగాలుపడిపోయాడు. పట్టాభిరామయ్య ఆతని భుజం తట్టి నవ్వుతూ అన్నాడు.

'ఫస్టుక్లాసు తెచ్చుకొని కలెక్టరయిన శిష్యుడు నా సన్మానానికి సారథ్యం వహిస్తున్నాడు. ఎందుకూ పనికిరాడను కొన్న మరో శిష్యుడు నా సన్మానానికి అధ్యక్షత వహిస్తున్నాడు. మాస్టరికి యింతకన్నా కావల్సిందేముందోయ్.'

* * *

నాటకపోటీల్లో మూడు రోజుల కార్యక్రమా లయిపోయాయి. నాటకాలు మంచి స్థాయిలో వున్నాయి. నాలుగో రోజు రెండు ప్రదర్శనలు వున్నాయి.

రెండు ప్రదర్శనల మధ్య పట్టాభి రామయ్యకు సన్మానం.

సినిమాస్టారలు సాయంకాలానికే వచ్చారు. కలెక్టరు వాళ్ళను రిసీవ్ చేసుకోలేదు. వాళ్ళ దర్శనం కోసం ప్రజలు వాళ్ళ బస దగ్గర విరగబడి వున్నారని పట్టాభిరామయ్యకు తెల్సింది.

మొదటి నాటక ప్రదర్శన మంచి 'క్లైమాక్సు'లో వుండగా సినిమాతారలు ఆడిటోరియంలోకి ప్రవేశించారు. వొక్క సారిగా ప్రజల్లో సంచలనం–కుమ్ములాట. ప్రేక్షకులకు నాటకాన్ని చూచే 'మూడ్' పోయింది. ప్రదర్శకులు యీ హఠాత్ పరిణామానికి 'ఫంక్' తిన్నారు.

దీనికి తోడు సినిమానటుడు తనకి నమస్కరించి 'డిస్టర్బ్' చేస్తాడేమోనని భయపడ్డాడు పట్టాభిరామయ్య. కాని అతను ఆయన వైపే చూడలేదు. చిరు నవ్వులతో ప్రజలకు నమస్కరిస్తూ వెళ్ళి తన స్థానంలో కూర్చున్నాడు.

నాటకం అయిపోయింది. ప్రేక్షకులు సినిమావాళ్ళ ఆటోగ్రాఫ్‌ల కోసం సాగేరు. పోలీసులు ప్రజల్ని ఆదుపులో పెట్టాల్సి వచ్చింది.

అప్పుడతను వచ్చి నమస్కరించి పలకరిస్తాడని ఆశపడ్డాడు పట్టాభి రామయ్య. జడ్జీ సీటులో వున్న పట్టాభి రామయ్యకు రెండు కుర్చీల కవతలే కూర్చున్నాడా శిష్యుడు–ప్రముఖ సినీ నటుడు చక్రవర్తి సిగరెట్టు తాగుతూ!

యింతలో సభాధ్యక్షుడిగా చక్ర వర్తిని సేజిమీదకి పిలిచేరు. ఆ తర్వాత సన్మానితుడిగా పట్టాభిరామయ్యను ఆహ్వానించారు. కలెక్టరు వచ్చి స్వయంగా ఆయన్ని పైకి తీసికెళ్లేడు.

కానీ ప్రజల దృష్టంతా చక్రవర్తి పైనే వుంది. పట్టాభిరామయ్య సన్మానం సెకండరీ అయింది.

'చూచావుటోయ్! వాడు-ఆ చక్రవర్తి నన్ను పలకరించాడైనా కాదు!' స్టేజీ పైకి వెళ్తూ ఆపుకోలేక కలెక్టరుతో అన్నాడు పట్టాభిరామయ్య.

'స్టేజీమీద మాట్లాడతాడేమో లెండి మాస్టారూ.'

పట్టాభిరామయ్య స్టేజీ ఎక్కగానే అప్పటికే స్టేజీమీద వున్నవారంతా గౌరవంగా లేచి నిలబడ్డారు. కాని చక్రవర్తి మాత్రం లేవలేదు.

క్లాసులోకి వెళ్తే లేచి నిలబడని కుర్రాడిని చూచినప్పుడు వచ్చేటంతకన్నా ఎక్కువ కోపం వచ్చింది పట్టాభిరామయ్యకు. అంతకన్నా మించిన బాధ వేసింది.

'చిన్నప్పుడు క్లాసులోనూ అంతే. ఎప్పుడూ లేటుగానే వస్తుండేవాడు. రిహార్సల్స్‌లో క్రమశిక్షణతో మెలిగేవాడు కాదు. ఎక్కడ పట్టినా పిల్లతరహా చేష్టలు. అల్లరి గుర్తొచ్చి చిరాగ్గా అనుకొన్నాడు.

చక్రవర్తి పక్క కుర్చీలోనే కూర్చోవాల్సి వచ్చింది పట్టాభిరామయ్య. అప్పుడైనా లేచిపలుకరిస్తాడనుకొన్నాడు ఊహుఁ ... మోస్ట్ డిసొబిడియంట్ స్టూడెంట్.

అధ్యక్షోపన్యాసంలో, అంతా తనని గురించే చెప్పుకొన్నాడు చక్రవర్తి. తన చిన్ననాటి నాటకానుభవాలంటూ వున్నవీ లేనివీ చెప్పుకొన్నాడు. నాటకాల పట్ల తన కున్న భక్తిని వెలిబుచ్చాడు. తనింత వాడు కావటానికి నాటకానుభవమే కారణ మన్నాడు. పట్టాభిరామయ్య పేరు ఎక్కడా ఎత్తలేదు.

ఆ తర్వాత కలెక్టరు స్వయంగా సన్మానం చేశాడు. పట్టాభిరామయ్య కాళ్ళకు నమస్కరించాడు. నాటకాలు వెయ్యటాని కొచ్చిన నటులు చాల మంది ఆయనకి పూలమాలలు వేసి భక్తి పూర్వకంగా కాళ్ళకు నమస్కరించారు. వక్తలు ఆయన నాటకరంగానికి చేసిన సేవను పొగిడేరు. కలెక్టరు మాస్టరుగా పట్టాభిరామయ్య ప్రతిభను చెప్పేడు.

యింతైనా చక్రవర్తి తనతో మాట్లాడకపోవటం, తనని గురించి ఒక్క ముక్క చెప్ప పోవటం పట్టాభిరామయ్యకు తీరనిలోటుగా వుంది. ఎన్నెన్నో అనుమానాలు. సందేహాలు.

తనని గుర్తుపట్టలేదా? లేక నాటకాలకి పనికిరావని అనా దన్నందుకు యీనాడిలా సాధిస్తున్నాడా?పరీక్షల్లో కాపీ చేస్తుంటే పట్టుకొన్నందుకు కోపాన్ని మనసులో పెట్టుకొన్నాడా? లేక యీ నాటకాలవాడేమిటిలే అన్న అహం భావమా? యీ పిచ్చిమేస్టరు దేమిటిలే అన్న తిరస్కారమా?

భార్య చనిపోయిందని తెల్సి కూడా

నవ్వుతూనే నటించిన మహానటుడిలా అన్నిటినీ మనసులోనే వో మూలకు నెట్టి సన్మానానికిసమాధానాన్నిచ్చాడు. తెలుగు నాటకరంగంలో యువకుల కృషిని, ప్రతిభను పొగిడేడు.

కాస్సేపు విశ్రాంతి తీసుకొని బహుమతి ప్రదానం వేళకు వస్తానంటూ చక్రవర్తి సన్మాన కార్యక్రమం రాగానే నటీమణితో కల్సి వెళ్ళిపోయాడు.

చివరి నాటకం అయిపోయింది. జడ్జిమెంటు తయారయింది. కాని సినిమా తారలు యింకా రాకపోవటంవల్ల బహుమతి ప్రదానోత్సవం ప్రారంభం కాలేదు.

మనుష్యులు పిలవటానికి పోయిన అరగంటకు (నిద్ర) మత్తులోనుంచి లేచాట్ట చక్రవర్తి ఆ తర్వాత మేకప్ మరో అరగంట.

'సారీ మాస్టారూ. మావాళ్ళు సినిమా వాళ్ళను పిలుస్తానంటే వొప్పుకొని చాలా పెద్ద పొరపాటే చేశాను. మీకన్నా, నాకన్నా, యిక్కడి జనం అందరికన్నా తను గొప్పవాడి ననుకొంటున్నట్లుందా చక్రవర్తి. దటీజ్ బేడ్ '

చివరి కెలాగో వచ్చాడు చక్రవర్తి. కానీ మత్తు యింకా వదలనట్లే వుంది.

ఎవరో అతన్ని తీసుకొచ్చి పట్టాభి రామయ్యను పరిచయం చేశారు. అప్పుడైనా నమస్కరించి పలకరిస్తాడను కొన్నాడు పట్టాభిరామయ్య.

'యిందాక సన్మానం చేసింది వీరికేగా? చూసాను.'

పట్టాభిరామయ్య గుండెను పొడిచి నట్లయింది! చొక్కా పట్టుకొని వెనక్కి లాగి 'నిజంగా నీకు నేను గుర్తులేనుట్రా పూల్ ?' అని నిలేసి అడగాలనిపించింది.

నెల కాదు, రెండు నెలలు కాదు. రెండేళ్ళు తను వాడి క్లాసుకు పాఠం చెప్పేడు. చిన్న వేషం యిచ్చి మొహానికి రంగు పూసి స్టేజీ ఎక్కించాడు ప్రప్రథమంగా! మర్చిపోవటం అసంభవం. మర్చిపోయినా క్షమార్హం కాదు.

హీరో వేషం యివ్వనందుకు, నాటకాలకు పనికిరావన్నందుకు, కాపీ చేస్తుంటే పట్టుకొన్నందుకు – గురువు నిలా అవమానిస్తాడా?

'యీ సభలో నా విద్యార్థు లెంతో మంది వుండవచ్చు. నేను వేసిన నాటకాలని, వేయించిన నాటకాలని చూదిన వారు కూడా చాలామంది వుండవచ్చు. కానీ వారందరిలో యిప్పుడు నేను యిద్దరి శిష్యులని గురించి చెప్పబో తున్నాను. ఒకడు స్వయం ప్రతిభతో పరీక్షలు పాసై, గురువుపట్ల ప్రేమను వ్యక్తం చేసుకోటానికి సన్మానించిన కలెక్టరు. అతగాడు నా విద్యార్థి అని చెప్పుకొన్నా నేను గుర్తుపట్టలేక పోయాను. రెండోవాడు గుణంలో వెధవ. చదువులో మందమతి. నాటకాల్లో

డైలాగు చెప్పటం చాతకానివాడు. కాపీలు కొట్టి పాసవుదా మనుకొన్నాడు. వాడు నాకు బాగా గుర్తు. ఎందుకంటే నాటకాల్లో నువ్వు పనికిరావన్నది నేనే. కాపీలు కొట్టినందుకు పట్టుకొన్నదీ నేనే. యీ కారణాలచేతనే వాడికి నేను గుర్తున్నాను. కానీ వాడిప్పుడు ధనవంతుడు. అంచేత బలవంతంగా మర్చిపోయినట్లు నటిస్తున్నాడు. వాడెవడో కాదు. నా పక్కనే కూర్చున్న గ్లామర్ హీరో చక్రవర్తి' అని పబ్లిగ్గా స్టేజి మీదినుంచి చెప్పాలన్నంత బాధ, ఆవేశం, కోపం వచ్చాయి.

అయితే అంతలోనే కళాకారుడి మనః ప్రవృత్తినుంచి, ముప్పై అయిదేళ్ళకు పైగా అనుభవమున్న ఉపాధ్యాయుడి ప్రవృత్తి ఆయన శరీరాన్ని, మనసుని ఆవహించాయి. శిష్యుడి అజ్ఞానాన్ని తల్చుకొని నవ్వుకొన్నాడు. అతని అహంభావాన్ని క్షమించేశాడు.



అప్పుడాయనమనస్సుఆర్ద్రమయింది చక్రవర్తిని-అతని లేతవయస్సులో తను తప్పు అంచనా వేసానేమోనన్న అనుమానం వేసింది. ఆ తప్పును దిద్దుకోటానికి, ఆనాడు అప్రయోజకుడను కొన్న వాడి ప్రయోజకత్వాన్ని గుర్తించి ఆశీర్వదించటానికి యిది మంచి అవకాశం.

'చిరంజీవి చక్రవర్తి నాకు చిన్నప్పటి నుంచీ తెల్సు. నా శిష్యుడు. ప్రప్రథమంగా అతడిని రంగస్థలం ఎక్కించింది నేనే. ఆనాడు అతనింత ప్రయోజకుడవుతాడనుకోలేదు. బాధ్యత వున్న ఉపాధ్యాయుడిగా, యువకుల్లో నాటక కళపట్ల అభిరుచి పెంచాల్సిన పెద్దవాడిగా అతడిపట్ల నేను కొంత అపచారాన్ని చేశానేమోనని బాధపడుతున్నాను. అయితే ఉపాధ్యాయుడు ఏం చేసినా శిష్యుడి మేలుకోరే చేస్తాడు. అది మేలే అయిననాడు అతనికన్న

సంతోషించే వారుందరు. చిరంజీవి చక్రవర్తి యిప్పుడు గొప్పసినిమాస్టారు. ముందు ముందు చక్కటి నటుడు కూడా కావాలని ఆశీర్వదిస్తున్నాను."

ప్రజల్లో సంచలనం నెమ్మదిగా బయలువేరి త్వరలోనే వేదెక్కి ప్రేక్షకులు చక్రవర్తిని మాట్లాడమని అడిగేదాకా వెళ్ళింది.

'పట్టాభిరామయ్యగారు నన్ను తన శిష్యుడిగా చెప్పుకొంటున్నారు. యిలాంటి సంఘటనలు మాకు కొత్తకాదు. మాకు టీచర్లమని, ఎప్పుడో యింటిపక్క వాళ్ళమని, నాటకాలు కల్సివేసేమని—గుర్తుచేసి ధనసహాయాన్ని అర్థిస్తూ రోజుకు కొన్నివందలమంది వస్తుంటారు. కొన్ని వేలమంది నాకు వుత్తరాలు రాస్తుంటారు. ఆయన అన్నట్లు నేను ఆయనదగ్గర ఏ వొకటో క్లాసో రెండో క్లాసో చదివి వుండవచ్చు. నాకు గుర్తు లేదు. నా కేదో అపచారం చేసే మన్నారు. అదేమిటో నాకు గుర్తువుండే సమస్యేలేదు. ఎంచేతంటే ప్రేక్షకుల అభిమానాన్ని తప్ప నేను నాకపకారం చేసినవాళ్ళను మర్చిపోతుంటాను. అయినా ఆయన్ని క్షమించినట్లే అనుకో వచ్చు. బాధపడనవసరంలేదు.'

చప్పట్లతోహాలంతా ప్రతిధ్వనించింది.

'యీ మీ అభిమానమే నాకు ఆశీర్వచనం. ఆయన ఆశీర్వచనం నాకు నవ్వు తెప్పించింది. నేను నటుడిగానే మీ అందరి ముందు నిలబడ్డాను. మీ అభిమానాన్ని అందుకొంటున్నాను. నా చిత్రాలన్నీ శతదినోత్సవాలు చేసుకొంటున్నాయంటే మీ అభిమానమే, ఆశీస్సులే కారణం. అంచేత ఆయన ఆశీస్సును మార్చుకోవాల్సిన అవసరం వుందను కొంటున్నాను.

'కొందరు నవ్వేరు. మరి కొందరు, 'అవును వుంది వుంది.' అభిమాననటుడికి—జిందాబాద్' అంటూ, అరిచేరు.

చక్రవర్తి ప్రజలకు అతి వినయంగా నమస్కరించాడు.

ప్రజలు చప్పట్లు కొట్టూనేవున్నారు. చక్రవర్తి చివరిమాటల్ని చెప్పుకొని నవ్వుకొంటూనే వున్నారు.

పట్టాభిరామయ్య మాత్రం నవ్వాలో ఏడవాలో అర్థంకాని స్థితిలోనుంచి, నిర్వికల్ప, నిశ్చల సమాధిలోకి వెళ్ళిపోయాడు!






## 21

అక్కయ్య నేను వూహించినట్టుగా నిప్పులు చెరగలేదు ! నన్ను గుమ్మం బైటనుంచే వెళ్ళిపొమ్మని అనలేదు. అసలు అక్కయ్య పైకి కఠినంగా ప్రవర్తించినా, చిన్నప్పటినుంచీ నేనంటే ప్రాణమే ! ఎంత గారాబం చేసేదో, అంత క్రమశిక్షణ కూడా నేర్పేది ! నన్ను చూడగానే ఏడ్చింది. "కొంతమంది చచ్చిపోయిన తర్వాత దూరమైతే, మనం బ్రతికి వుండగానే దూరం అయాం, ఇదెక్కడి ఖర్మరా మనకి" అంది. నేను తప్పు చేసినవాడిలా నిలబడిపోయాను.

"రండి.లోపలికి రామ్మా జయా," అంది. ఆ క్షణంలో అక్కయ్య కాళ్ళకి పసిపిల్లాడిలా చుట్టుకోబుద్ధయింది. నేను తప్పుచేసాను. చిన్నప్పటినుంచి నన్ను అల్లారుముద్దుగా పెంచిన నా వాళ్ళని కాదని, పరాయివాళ్ళతో చేరిపోయాను! వాళ్ళమీద దావా వేసాను ! వాళ్ళు నలుగురిలో తలెత్తుకోలేనట్టుగా, నవ్వులపాలు చేసాను ! అయినా వాళ్ళు నన్ను క్షమించారు ! వాళ్ళు చూపిన యీ ఆదరం, క్షమార్పణ నాలోని కల్మషాన్ని కడిగేసినట్టయింది ! ఇంక నేనెప్పుడూ వాళ్ళని ఏ రకంగానూ బాధపెట్టను అనుకున్నాను !

అక్కయ్య పిల్లల్ని దగ్గరకి తీసుకుంది! జయతో కలుపుగోలు తనంగా మాట్లాడింది! భాగ్యమ్మగారు తనే కల్పించుని అక్కయ్యతో మాటలు కలిపింది!

అక్కయ్య ఆదరణ, నాన్న మంచితనం చూసి జయ మారుతుందేమో నన్న ఆశ నాకు ఎండమావి అయింది! జయ యీ యింట్లో కాలు పెట్టిన ఏ నెలరోజులు కాస్త కుదురుగా, యింటిపట్టున వుందో! మళ్ళీ తిరుగుళ్ళు ప్రారంభమైనాయి! నేను జయతో ఖచ్చితంగా చెప్పేసాను. "అక్కయ్యకిగాని, నాన్నకిగాని, మనసు నొచ్చుకునే పన్లు నువ్వేమీ చెయ్యకు. చేసావంటే మాత్రం వూరుకోను."

"వూరుకోకపోతే వురేసుకో!" జయ కిసుక్కున నవ్వింది. జయకి మొదటి నుంచీ నా మాట అంటే లక్ష్యం లేదు! నేను జయతో ఏది మాట్లాడబోయినా భాగ్యమ్మగారు వెంటనే అందుకునేది. ఇది నాకు చిరాకుని తెప్పించేది! అయినా తమాయించుకునే వాడిని! మీ అమ్మని మన మధ్య కల్పించుకోవద్దని చెప్పు, అని నేను ఎన్నిసార్లు జయకి చెప్పినా జయ తల్లికి ఆ మాట చెప్పిందో లేదో, లేక యీవిడ లక్ష్యపెట్టటం లేదో నాకు తెలియదు. భాగ్యమ్మగారికి భోజనంలోకి అక్కయ్య చేసిన వంట బాగాలేదని, తను షేరుగా వంట ప్రారంభించింది! అక్కయ్యకి యిది చాలా చిరాకుగా వుండేది.

నాన్న బట్టలషాపు నేను చూసుకో సాగాను! నాకు భార్యా పిల్లలు వున్నారు కాబట్టి డబ్బు విషయంలో నాన్న నన్ను పెద్దగా ఆరాలు అడగటం మానేసాడు. నేను లాయర్లని సంప్రదించి దావా ఉప సంహరించుకున్నాను! జయ అప్పు డప్పుడూ, నా దగ్గర సణిగేది. ఇంకా ఎన్నాళ్ళు యీ యింట్లో మీ అక్కయ్య పెత్తనం! నేను యీ యింటి కోడలిని! నా కేం అధికారం లేదా!" అంది.

"ఇంకోసారి అలాటి మాటలు నా దగ్గర ఎత్తకు." ఖచ్చితంగా చెప్పేసాను.

"అన్నీ మీరే అంటారు! నాకు యింట్లో పనేమీ వుండదు. బైటికి కదల కూడదంటారు. ఎలా?"

"పిల్లలు లేరా! వాళ్ళ సంగతులు చూడనవసరం లేదా!"

"పనిమనిషి వుందిగా!"

జయని మార్చటం ఆ దేవుడి తరం కూడా కాదనుకున్నాను! తను ముగ్గురు పిల్లల తల్లిని అనుకోదు! యింకా పెళ్ళి కాని యువతలా స్వేచ్ఛగా, బాదరబందీ లేనట్టుగా ప్రవర్తిస్తానంటుంది! జయమ్మ నన్ను జయని ఎరగాచేసి, యీ పెళ్ళి అనే వలలో చిక్కించింది కానీ, మామూలు పద్ధతి ప్రకారం అయితే, జయకి అసలు పెళ్ళి అయేది కాదేమో! ఎప్పుడూ, ఫాషన్స్ అంటూ గంటల తరబడి అద్దం

ముందు నిలబడి ముస్తాబుఅవటం, స్నేహితులతో తిరగటం, ఏ విషయం లోనూ బాధ్యత లేకుండా, బేఫర్వాగా బ్రతకటం జయకి బాగా అలవాటయి పోయింది!

ఒకో్కసారి నేను షాపులో వుంటే, నలుగురు స్నేహితులతో వచ్చేది! డబ్బు కావాలని అడిగేది! నేను జవాబు చెప్పక ముందే, డ్రాయరు సొరుగు లాగి, తనకి కావాల్సినంత పట్టుకుపోయేది! షాపులో మిగతా గుమాస్తాలు, జయ గారాలు, వయ్యారాలు చూసి, ముఖం చాటు చేసుకుని నవ్వుకునేవారు! మా యింటి పద్ధతులు గౌరవించటం తన ధర్మంగా భావించేది కాదు! తన అలవాట్లన్నీ మా నెత్తిన రుద్దటానికి చూసేది! ఎక్కడికైనా వెళ్తుంటే, అక్కయ్యకి చెప్పి వెళ్ళమని ఎన్నోసార్లు చెప్పాను! కానీ వినేదికాదు! ఒక్కసారి అసలు యింటికి భోజనానికి వచ్చేది కాదు! జయకి ఎవరి దగ్గిరా బెరుకు అనేదే లేదు! కొత్త వారింట్లోకూడా భోజనం చేయటం, పడుకోవటం లాటి పన్లు చేసేది!

"భోజనం ఎక్కడైనా చేయదల్చు కుంటే, యింట్లోచెప్పి వెళ్ళచ్చుగా," అని నేనంటే, అబ్బబ్బా! స్నేహితులతో కలిసి సరదాగా తినివస్తే, దాని కింత రాద్ధాంతం చేస్తారేమిటి! ఏం మనుష్యులు మీరు! మీకు స్నేహితులు అవసరంలేదు! సరదాలు అంతకంటే లేవు! కూపస్థమండూకాల్లా, యిళ్ళల్లో మగ్గుతూ, జైలులో ఖైదీల్లా, బ్రతుకుతారు. దబ్బే జీవితం అన్నట్టు, యంత్రాల్లా పనిచేస్తారు! నా వల్ల అదికాదు! నేనేం చెయ్యను!" అంటూ పైనుంచి ఎదురు నా మీదకే విరుచుకుపడేది!

అక్కయ్య జయని క్రమపద్ధతిలోకి తీసుకురావాలని, ఎంతగానో ప్రయత్నించి, సాధ్యంగాక వదిలేసింది! జయకి ఎదుటి మనిషి వ్యక్తిత్వాలతో గాని, మంచి చెడ్డలతోగాని పనిలేదు! తనతో కలిసి తిరిగితే ఎవరైనా స్నేహితులే! వాళ్ళు సాధారణంగా జయ లాగానే తిరుగుబోతులూ, నిలకడ లేని వాళ్ళు అవటంతో, నాలుగైదుసార్లు వచ్చినవాళ్ళు మళ్ళీ వచ్చేవాళ్ళు కాదు! రకరకాలుగా మారుతూ వుండేవాళ్ళు! యిల్లు బజారులా అయిపోయింది! వాళ్ళలో కొంతమంది ఆ యిల్లు తమ స్వంతం అన్నట్టు యిల్లంతా తిరిగే వాళ్ళు! యింటిలో ఏదయినా వస్తువు కావాలని అడిగితే జయ నిస్సంకోచంగా నిరభ్యంతరంగా యిచ్చేసేది! వాళ్ళు యింటిలో పెత్తనం అంతా జయదే అన్నట్టుగా, ఆ ముసలాయన ఎవరు, ఆ మొగుడు లేని ఆవిడ ఎవరు అంటూ ఆరాలు తీసేవాళ్ళు. అక్కయ్య ఒకసారి జయకి చెప్పేసింది.

"జయా! నీ స్నేహితులెవరైనా వస్తే, నీ గదిలోనే కూర్చోపెట్టుకో!

యిల్లంతాతిరగనీయొద్దు! ఆ సాయంత్రం వచ్చిన అమ్మాయి చూడు. చెప్పులతోనే పూజగదిలోకి వచ్చేసింది," అంది.

"దానికేం తెలుసు! అక్కడ అన్ని బొమ్మలుంటే, బొమ్మల కొలువు పెట్టారేమో అనుకుంది!" అంది జయ నిర్లక్ష్యంగా.

ఈ వెక్కిరింత నాకే అసహ్యంగా అనిపించింది.

"నోరు మూసుకో! అక్కయ్య చెప్పినట్టు విను," అన్నాను.

"నే నిప్పుడు ఏం తప్పుచేసానని నువ్వలా నోరు పారేసుకుంటున్నావు!" అంది.

"నువ్వేది మాట్లాడినా వాళ్ల దృష్టిలో తప్పే నే తల్లీ." భాగ్యమ్మగారు అందుకుంది.

"మీరు మాట్లాడకండి. అవతలకి వెళ్ళండి?" అన్నాను.

ఆవిడ ముఖం మాడ్చుకుంది.

"జయా! యిది యిల్లా, సత్రమా! ఎందుకలా అందరినీ యింటికి రానిస్తావు! పోనీ వాళ్లేమైనా మర్యాదగా వుండే మనుష్యులేనా!"

"ఓహో! మర్యాదఅంటే, మీదృష్టిలో కారులు, మేడలూ వుండాలి కాబోలు!"

"అతిగా వాగకు! వాళ్లని చూడగానే వాళ్ళెలాటి తిరుగుబోతులో తెలుస్తుంది!"

"మీ అక్కయ్య కోసం వచ్చే వాళ్ళంతా, పతివ్రతా శిరోమణులు కాబోలు!"

"నోర్ముయ్!" అరిచాను.

"అసలు ఆవిడ మనయింట్లో ఎందుకుండాలి! ఎన్నేళ్ళిలా వుంటుంది! ఆవిడకి, పిల్లలకి ఎంత ఖర్చవుతోంది! యివన్నీ నేను మిమ్మల్ని అడిగానా!"

నేను పట్టరాని ఆగ్రహంతో జయ చెంపమీద ఛెళ్ళుమని కొట్టాను. జయ క్షణంసేపు చెంపపట్టుకుని బిత్తరపోయి చూసింది. భాగ్యమ్మగారు చరచరా వచ్చి అక్కయ్యతో, "ఏమ్మా! యిప్పుడు నీ కసి తీరిందా! నీకెలాగూ భర్త లేడు! అది సంతోషంగా వుండే చూడలేవు! అందుకే వాళ్ళిద్దరి మధ్యా యిలా నిప్పులు పోసి తమాషా చూస్తున్నావు" అంది.

ఈ మాటలతో నాకు మరీ ఆవేశం వచ్చేసింది. ఆవిడ భుజాలుపట్టి గుమ్మం బైటకి తోసాను! అడ్డు వచ్చిన జయని ఎడాపెడా కొట్టబోయాను! అక్కయ్య గభాల్న వచ్చి నన్ను బలవంతంగా ఆపింది. "తమ్ముడూ! ఆ అమ్మాయి మీద చెయిపడితే నామీద ఒట్టే!" నేను చేతులు గింజుకున్నాను.

"నీకు తెలియదక్కయ్యా! వీళ్లని హద్దుల్లో వుంచలేని అసమర్థుడిని అయిపోయాను. జయా! యిప్పుడే చెబుతున్నా, ఈ రోజునుంచీ నీ ఫ్రెండ్స్ అనేవాళ్ళు యీ గుమ్మంలో అడుగు పెట్టారా, వాళ్ళతోపాటు నిన్ను కూడా మెడబట్టి గెంటుతాను!" అన్నాను. జయ నిర్లక్ష్యంగా చూసింది.

"మీకీ ధైర్యం ఎలా వచ్చిందీ నాకు తెలుసు! ఇదంతా యీవిడే నూరి పోస్తోంది!" అంది.

నేను మళ్ళీ కొట్టబోయాను. భాగ్యమ్మ గారు జయని లాక్కుపోయింది!

జయ మాటలు అక్కయ్య మనసుని బాగా గాయపరచినట్టున్నాయి. ఆ సాయంత్రం అక్కయ్య, "ప్రసాద్! నేను వేరే యిల్లు చూసుకుంటానురా!" అంది.

"ఆ పిచ్చిదాని మాటలు నువ్వు పట్టించుకుంటున్నావా!" అన్నాను.

"లేదురా! ఎన్నాళ్ళని వుండను! జయ అన్నది కూడా నిజమే! నేను యీ యింటికి పరాయిదాన్ని!"

నేను అక్కయ్య రెండుచేతులూ పట్టుకున్నాను.

"అక్కయ్యా! నువ్వు వెళ్ళిపోతాననే మాట కలలోకూడా అనవద్దు! నువ్వు లేకపోతే, జయ, యీ యింటిని మరీ నరకంచేస్తుంది! నన్ను లక్ష్యపెట్టదు! నువ్వు నా కోసం అయినా యీ యింట్లో వుండాలి!" అన్నాను. అక్కయ్య కళ్ళనీళ్ళు తుడుచుకుంది! "నా బాధ కూడా అదే! కానీ జయ అందరితో ఏం చెబుతుందో తెలుసా! నేను తనని పనిమనిషిలా చూస్తున్నానుట! నాకు, పిల్లలకి యీ యింట్లో సర్వసౌఖ్యాలుట! తాను, పిల్లలు నానా బాధలూ పడుతున్నారుట! ఈ అపనిందలు నేను వినలేకుండా వున్నానురా!"

"అక్కయ్యా! నిజమేమిటో మన మనసులకి తెలుసు కదా! నువ్వు జయ మాటలు ఖాతరు చేయద్దు! నేను చేసిన తప్పుకి మీరు శిక్ష అనుభవిస్తున్నారని నాకు తెలుసు! నేనేం చెయ్యను! యిది పెద్ద పొరపాటయి యిలా మెడకి గుదిబండ అవుతుందని అనుకోలేదు."

ఆ నాటినుంచీ, అక్కయ్య జయ మాట్లాడటం మానేసారు. మేము, ఎలాటి ఆర్థిక యిబ్బందులకి గురిఅయి, యీ యింటికి వచ్చామో, జయ పూర్తిగా మర్చిపోయింది! మేం వచ్చిన రోజున అక్కయ్యగాని, నాన్న గాని ఒక్క పరుషవాక్యం కూడా అనకుండా, మమ్మల్ని ఆదరించిన సంగతి కూడా జయకి గుర్తులేదు. ఇప్పుడు యీ యింటికి తనే అధికారిణి అనుకుంటోంది! ఈ యిల్లంతా తనదని, యిక్కడ తన పెత్తనం సాగటంలేదని, తల్లి చేసిన ఉద్బోధ బాగా మనసుకి పట్టించుకుంది! ఇదివరకు జయకి నచ్చచెప్పటానికి ప్రయత్నించేవాడిని, ఇప్పుడు అది కూడా మానేసాను.

(సశేషం)

"ఇవాళ స్వామివారికి పూలంగి సేవ"—

ఉలిక్కిపడి తిరిగిచూసింది హరిణి. తన ఆచారవ్యవహారాలని హాస్యంపట్టించే కృష్ణ మాటలేనా అని మరింత ఆశ్చర్యంగా చూసింది.

ఆమె ఆలోచనలు అర్థమయినట్లుగా "స్థలమహత్యం హరిణి" గంభీరంగా పలికాడు.

తెలుగుదేశంలో తిరపతి పుణ్యక్షేత్రం. ఆ కొండమీద వెలిసిన శ్రీ వెంకటేశ్వరస్వామి హరిణి కెంతయినా ఇష్టం. "జీవితంలో నాకొకటే కొరత" అందొకసారి హరిణి. చాలా కంగారుపడిపోయి. "హరీ! ఏమిటా కొరత?" అంటూ ప్రశ్నలతో వేధించేడు. నీతో తిరుపతి ప్రయాణం చేయడం" అనగానే వెంటనే ప్రయాణంపెట్టి లాక్కొచ్చాడు.

కాటేజికి అవతలగా వచ్చి నిలబడి ప్రకృతిని చూస్తూ ఆలోచనల్లోపడిన హరిణిని తట్టి "లే, స్నానమదీ కానిచ్చి దర్శనం చేసుకుందాం!" అంటూ చెయ్యందించేడు.

ఆ చెయ్యందుకుని అతన్ని ఆనుకుని నిలబడింది.

చైతన్య వాహినిలా కదిలిపోయే జనసమూహాన్ని చూస్తూ పరవశించిపోయింది హరిణి.

మెల్లగా జనాన్ని చూస్తూ నడవసాగారు కాటేజి వైపు.

"హలో! హరిణిగారూ!"





ఎవరన్నట్లుగా తలెత్తి చూసింది.

అరుద్ర నిలబడి ఉన్నాడు ఎదురుగా. "నమస్తే" అన్నాడు.

కృష్ణ చెయ్యింకా గట్టిగా పట్టుకుని "నమస్తే" అంది.

"వీరు అరుద్రగారని మాకు తెలిసినవారు. ఈయన కృష్ణగారు. ఎవరో పరిచయం అనవసరమనుకుంటాను" అంటూ పరస్పరం పరిచయాలు చేసింది.

"గ్లాడ్ టు సీయూ" అంటూ చెయ్యందించి "కంగ్రాట్స్ హరిణిగారూ! మీ అంచనా తప్పలేదు ! మీ శ్రీవారు నలకూబరులే" అన్నాడు అరుద్ర.

"థాంక్స్ ! నా అంచనాలెన్నడూ తప్పవని గ్రహించినందుకు వస్తాం !" అంటూ ముందుకి నడవసాగింది హరిణి.

"ఆగండి ! మీరెక్కడుంటున్నారు ? వివరాలు నా క్కావాలి" అంటూ వడివడిగా అడుగులేసేడు వాళ్ళ నందుకోవడానికి.

అసహ్యంగాచూసి, తిరస్కారంగా నవ్వి, "అనవసరం అనుకుంటాను మిస్టర్ అరుద్రా" అంటూ వెళ్ళిపోయింది.

అచేతనంగా ఆమెనే చూస్తూండిపోయాడు అరుద్ర. ఎంత అహంకారంగా ఆమె ప్రవర్తించినా ఆ అద్భుత సౌందర్యవతి అందాలు నానాటికి అధికమై పోతూన్నాయి. తనూహించిన హరిణి కాదీమె. వెన్నెలవానలా వెలిగిపోతూన్న తరుణి. తన స్వప్నసుందరి.

"హరి ? కాటేజిలోకి వెళ్ళగానే మృదువుగా పిలిచేడు కృష్ణ.

"ఏమిటి ?"

"ఈ రోజు అంత కోపంగా ఉన్నావేమిటి ?"

"నేనేం కోపంగా లేను ! నీ వడగబోయే ప్రశ్న ఏమిటో నాకు తెలుసుగాని నే నివాళ జవాబీయదలుచుకోలేదు.''

ఆమెని చూస్తూండిపోయాడు కృష్ణ. అతనికేనాటికీ అర్థంకానిది ఆమె ఆంతర్యం మాత్రమే !

"స్నానం చేసివస్తా !" అంటూ బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది.

మరో అరగంటలో ఇద్దరూ తయారయి ఆలయంలోకి వెళ్ళిపోయారు.

సమస్తమూ మరిచిపోయి, వినమ్రంగా నమస్కరిస్తూ నిలబడిపోయిన హరిణినే తదేకంగా చూస్తూండిపోయాడు కృష్ణ.

*　　　*　　　*

"ఇవాళ కృష్ణాష్టమి తెలుసా ?"—కూర్చుని రాసుకుంటున్న కృష్ణ మెడ చుట్టూ చెయ్యివేసి గారంగా అంది హరిణి.

లతలా తనని అల్లుకుపోయిన హారిణిని మరింత మీదుగా లాక్కుని, "సో వాట్ ?" రాసుకుంటూనే అన్నాడు.

అతను డైరీ రాసుకుంటున్నాడు. కుదురుగా ముత్యాల్లా ఉన్నాయి తొందరగా రాస్తున్నా, అక్షరాలు. వాక్యానికోసారి అయినా హారిణి అన్న పేరుంది.

క్షణమలా చూస్తూ, "కృష్ణా ! వ్యాపారానికి, సంగీతసాహిత్యాలకి నీ జీవితం సమానంగా పంచేసేక నీ హారిణికి మిగిలిందేమిటి ?"

"హరి !" గాఢంగా అరిచి డైరీ మూసేసి, నీకేం కావాలో చెప్పు? నీకోసం అన్నింటినీ వదులుకోడానికి సిద్ధంగా ఉన్నాను. నీ తర్వాతనే అన్నీ" అన్నాడు

"నీకది సాధ్యమా ?"

"నీ కనుమానమా ?"

నవ్వి, "వాదనలు తర్వాత గాని, సాయంకాలం తొందరగా రండి. వీలయితే మీ స్నేహితులెవరినయినా తీసుకురండి" అన్నది.

"మరిచిపోయాను,ఇవాళ బొంబాయి వెళ్ళాలి. కాని నీకోసం కాన్సిల్‌చేసుకుని రేపు ఫ్లయిట్‌లో వెళ్ళక తప్పదు కాబట్టి, సెలవ్ మేడమ్! వీలయినంత తొంద రగా రావడానికి ప్రయత్నిస్తాను'' అంటూ వెళ్ళిపోయాడు.

"ఒక్కమాట !" వెనకాలే వెళ్ళింది.

కారెక్కబోతూ వెనక్కుతిరిగి "ఏమిటి ?" అన్నాడు.

''ముందు కారులో కూర్చో !" అంది.

అతను కారెక్కాక డోర్‌వేసి చిలిపిగా నవ్వి, "ఏంలేదు! బై! బై!" అంది.

"యూ! సిల్లీ!" అంటూ నవ్వుకుని కారు స్టార్ట్‌చేసేడు.

* * *

ప్రశాంత సంధ్యవేళ ఆరున్నర ఏడుగంటల మధ్య ఇంటికి వచ్చేడు కృష్ణ స్నేహితులని వెంటబెట్టుకుని.

శ్రావ్యమయిన మధురగానం ఏవేవో లోకాలకి లాక్కెళ్ళిపోయింది.

"ఫ్రెండ్స్, కూర్చోండి! గృహలక్ష్మి వస్తుంది,"అని లోపలికి వెళ్ళాడు కృష్ణ నిలువెత్తు మురళీకృష్ణ విగ్రహం పూలమాలలతో అలంకరించబడి ఉంది. ధూపదీప నైవేద్యాలు వింత అందాన్నిస్తున్నాయి. ఎదురుగా హారిణి పువ్వుల పళ్ళెంలో పూలతో పూజచేస్తూ శ్లోకాలు చదువుతున్నది. కెంపురంగు బనారస్‌చీర కట్టి పొడవయిన వైజయంతీమాల మెడలో ధరించి, వేలుముడి వేసి తలనిండా

ఎర్ర గులాబీల మాల ధరించి మనోహరంగా ఉంది. చుట్టూరా పేరంటాళ్ళు కొలువుతీర్చి కూర్చున్నారు. ఎంతసేపు నిలబడినా తనివితీరక, సభ్యత గుర్తుకువచ్చి అక్కడనుంచి హాల్లోకి కదిలేను.

స్నేహితులతో కబుర్లలో పడిపోయిన కృష్ణ నాయర్ వచ్చి 'అమ్మగారు పిలుస్తున్నారు' అన్నాక 'వన్‌మినిట్' అంటూ లోపలికి వెళ్ళాడు.

"హాల్లో" అంది హరిణి.

అతను నవ్వి, "స్నేహితులందరూ వచ్చేరు. ఒకసారి హాల్లోకి వస్తావా ?" అన్నాడు.

"వస్తా పదండి!" అంటూ అతని వెంట నడిచింది. హాల్లోకి వస్తూనేఎదురుగా కూర్చున్న ఆరుద్రని చూసి నిర్ఘాంతపోయింది. ఇంటికే వచ్చేసేడే అనుకుని "నమస్తే" అంది జనాంతికంగా.

"మీ కృష్ణుడిని చూపించండి మిసెస్ కృష్ణగారూ !"— అన్నాడు ఆరుద్ర.

"తప్పకుండా రండి లోపలికి"— అంది హరిణి.

ముగ్ధమనోహరమయిన ఆమె రూపం మైమరిపించింది ఆరుద్రని.

"హరిణిగారూ ? నేను నెమ్మదిగా వస్తాను" అన్నాడు విశ్వం.

నవ్వేసి, "ప్రసాదం పంపిస్తాలెండి" నాయర్‌చేత అని "మిస్టర్ ఆరుద్ర! రండి" అంది, లోపలికి దారితీస్తూ.

ఇల్లంతా కలియతిరుగుతూ "ఎంతయినా మీకు టెస్ట్ ఉందండి ! మిసెస్ హరిణిగారూ ! పిలవకపోయినా వచ్చిన అతిథిని గౌరవించే సంస్కారమూ ఉంది."—

"నేను ఆఫ్టరాల్ హరిణినే" అంది పొగరుగా.

బాధగా చూసేడు ఆరుద్ర.

"రండి, అలా కూర్చుని కబుర్లు చెప్పుకుందాం, అంటూ డైనింగ్‌టేబుల్ దగ్గిర కుర్చీలాగి "కూర్చోండి" అంది తనో కుర్చిలో కూర్చుని. "చూడండి ! జరిగిపోయిన గతం, మీరు మళ్ళీ తలుచుకోవాలంటే నాకెటువంటి అభ్యంతరమూ లేదు. మీ రెందుకోసం మా ఇంటికి వస్తున్నారో తెలుసుకోలేని వెర్రిదాన్ని మాత్రం కాను—" కటువుగా అంది.

"అయాం సారి మిసెస్ హరిణి! నీలో ఏదో ఆకర్షణ, నాలో ఏదో బలహీనత మన పరిచయానికి కారణం. అంతకు మించి మరే గొప్పా నీలో లేదు. ఎవరికీ లొంగని ఒక పొగరుబోతువయిన నీవు మహానాయకుడు కృష్ణవంటి అత్యద్భుత వ్యక్తికే లొంగిపోయావంటే వింతలేదు"—

పగలబడి నవ్వి, "నే నాయానికి లొంగానని నీ కెలా తెలుసు?"—అంది.

"నీ హృదయంలో ఏముందో తెలుసుకోవడం కష్టం"—

"వెల్ అండ్ గుడ్"— పెంకిగా అంది. ఇంతలో కృష్ణా, విశ్వం లోపలికి వచ్చారు.

"నాయర్. భోజనాలు వడ్డించు" అంది, లేవకండానే హరిణి

చకచకా తినేస్తోంది హరిణి మాట్లాడకుండా. మిగిలిన ముగ్గురూ లోకాభి రామాయణంలో పడ్డారు. భోజనం అవగానే "సారీ! బాగా అలసిపోయాను. నిద్రొస్తోంది. గుడ్‌నైట్" అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయింది హరిణి.

లేత నీలిరంగు లైట్ డిమ్‌గా వెలుగుతోంది. అలసటగా మంచంమీద వాలిపోయింది హరిణి ఎదురుగావున్న కృష్ణఫోటో తదేకంగా చూస్తూ. నైట్ క్వీన్, విరజాజి, చమేలి పరిమళాలన్నింటినీ గాలి మోసుకొస్తోంది.

"నిద్రపోలేదా? హరిణీ" అంటూ గదిలోకి వచ్చేడు కృష్ణ.

"ఏమంటున్నాడు ఆరుద్ర?" వ్యంగ్యంగా అంది హరిణి.

"నీకెందు కతనంటే అంత కోపం? షేర్స్ తీసుకోమంటున్నాడు"— అన్నాడు తాపీగా.

"తీసుకుంటానన్నావా?"—

"మా హరిణి పర్మిషన్ కావాలన్నాను."

"అక్కడి కన్నీ మీ హరిణి పర్మిషన్‌తోనే చేస్తున్నట్టు"— అంది.

అతనేదో అనేలోగా "గుడ్‌నైట్" అంటూ అతని కభిముఖంగా తిరిగి పోయింది.

అర్ధరాత్రి దాటిపోయింది. సన్నగా ఎక్కడో వీణావాద్యం విన్పిస్తోంది వెన్నెల వెలుగుల్లో జగతి తళతళలాడుతూ మనోహరంగా ఉంది. అప్రయత్నంగా గడియారం వంక చూసేడు. పన్నెండున్నర దాటింది. రేడియో అయితే కాదు. ఆశ్చర్యంగా లేచి పక్కకి చూసాడు. హరిణి లేదు.

ఆనందభైరవి రాగంలో "కనికరము లేకపోయెనా" అన్న కీర్తన వినవస్తోంది.

నెమ్మదిగా అడుగులో అడుగువేస్తూ హాల్లోకి వచ్చేడు.

కార్పెట్ మీద పొందికగా కూర్చుని వీణవాయిస్తూ పరమ సుందరంగా పాడుతోంది.

వెన్నెలా, విరజాజులూ, వీణని ధిక్కరించిన తెల్లటిచీర కట్టి మంకెన పువ్వు

రంగు జాకెట్ వేసింది. పవిత్రమయిన దేవిమూర్తిగా అపర సరస్వతీదేవిలా కన్పించింది.

"పనికిరానివారి వలన బాధపడుట తెలిసిన నీవు కనుసైగను పిలిచిన నన్ను కాచెదవనిబల్క నీకు కనికరము లేకపోయెనా" అంటూ పాడుతూ అడుగుల సవ్వడికి తలెత్తి కృష్ణని చూసి నవ్వింది గాని పాట ఆపలేదు.

అప్రయత్నంగా ఇద్దరి కళ్ళూ కలిసాయి, నల్లని ఆమె కాటుకకళ్ళు అల్లరిగా నవ్వాయి.

మౌనంగా ఆమె పక్కన తను కూర్చున్నాడు.

ఆమె పాట ఆగిపోయింది.

"నిద్ర రాలేదా హరి ?" ఆ సమయంలో తనెంత అసందర్భపు ప్రశ్న వేసాడో తెలిసే వేసాడు కృష్ణ

వీణ పక్కకి పెట్టేసి, అతని భుజాలమీద వాలిపోతూ "సారీ ! మీ నిద్ర పాడుచేశాను !" అంది.

జవాబుగా నవ్వాడు.

"ఒక్క క్షణం అంటూ" లోపలికి వెళ్ళి సిగరెట్, సిగరెట్ లైటర్తో సహా వచ్చి తనే స్వయంగా వెలిగించింది హరిణి.

సిగరెట్ కాలుస్తూ వలయాలు వలయాలుగా పొగవదులుతూ, ఆ పొగలో హరిణిని చూస్తున్నాడు కృష్ణ

"ఏమిటా ఆలోచన ?"— అంది.

"కనుసైగతో పిలిచేవు కదూ ? అదే ఆలోచన ?"—

"భలేవారండి! నిద్రపట్టక, ఏంతోచక పాటపాడా నంతేగాని అందులో అంతగా పట్టించుకోవాల్సిన అవసరం లేదు''— కఠినంగా పలికింది.

హరిణి మూడ్స్ బాగా తెలిసిన కృష్ణ మౌనంగా ఉండిపోయాడు

"టీ కావాలి హరిణి !–" నిశ్శబ్దమయిన ఆ వాతావరణం మార్చడంకోసం అడిగాడు కృష్ణ.

''విత్ ప్లెజర్'' అంటూ లేచింది.

''నేనూ నీకు సహాయం చేస్తా నంటూ ఆమెవెంట నడిచాడు.

టీ నీళ్ళు మరిగాక పాలూ పంచదార వేయటం హరిణివంతయితే కప్పుల్లోకి టీ పోసాడు కృష్ణ.

బాల్కనీలోకి వచ్చి కుర్చీల్లో కూర్చున్నారు.




వెన్నెల మరింతగా విరగగాస్తోంది. మౌనంగా ఆలోచిస్తూ టీ తాగుతూ క్రీగంట కృష్ణని గమనిస్తోంది హరిణి.

"కృష్ణా ! వాతావరణం చాలా బాగుంది కదూ ?"— సడన్‌గా అంది.

"నీ ఎదురుగా సమస్తమూ సర్వాంగసుందరమే దేవీ !"

"ఛీ ! నీకన్నీ జోకే్స"— అంది.

అతను నిశ్శబ్దంగా ఆకాశం వంక చూస్తున్నాడు

హరిణి ఏమిటన్నట్లుగా చూసింది—

"మన తొలిపరిచయం జ్ఞాపకముందా ?"—

హరిణి నవ్వింది. పారిజాతాలు జలజలా రాలినట్లుగా ఆహ్లాదకరంగా నవ్వింది.

"నాకు అందరానంత దూరంగా ఉంటావనిపించింది, కానీ హరి, నేనెంతో అదృష్టవంతుడిని"

హరిణి అతని చెంపకి చెంప ఆనించి వినసాగింది.

* * *

"హలో హరిణీ! బహుకాల దర్శనం ! అయినా ఎంతో భాగ్యం ఉండాలి నీ కనికరానికి" అంటూ ఆహ్వానించింది వసంత.

"నమస్కారం హరిణి గారూ!" కూర్చోండి అన్నాడు వినయ్!

"నన్నంత తేలికగా అనేశారు వసంతా! మీ రెందుకని రాలేదు ?" అంది హరిణి.

"ఆగండి! మీరు అతిశయోక్తి అనుకోకుండా ఉంటే నేనొకటి చెప్తాను. మేము మీ యింటికి వద్దామని అనుకునేలోగా మీరు మా యింటికి వచ్చేశారు!" —వినయ్ అన్నాడు. నవ్వింది వసంత. హరిణీ నవ్వింది.

చిన్నయిల్లయినా పొందికగా అమర్చుకుంది వసంత· చిన్నిచిన్ని పువ్వులున్న లేత ఎరుపు కర్టెన్స్ గాలికి ఎగురుతూ అడపా దడపా హరిణిని తాకుతున్నాయి.

నిశ్శబ్దానికి భంగం కలిగిస్తూ, "నీ చీర చాలా బాగుంది, లేపాక్షి ప్రింట్ అనుకుంటా" అంది వసంత.

"నాకేం తెలియదు వసంతా. కృష్ణ తేవటం, నే ధరించడం" అంది హరిణి.

వినయ్ ఆ చీరని పరీక్షగా చూసేడు. తెల్లటి తెలుపుకి ఆకుపచ్చటి ఏనుగుల అంబారీల బార్డర్. ఆ చీరలో హరిణి చాలా బాగుంది.

"మీ శ్రీవారు ఊళ్ళో లేరా?" వసంత అడిగింది.

"ఊహు! బొంబే వెళ్ళేరు."

వినయ్ లోపలికి వెళ్ళిపోయాడు. అతనలా వెళ్ళగానే, "ఏమిటి అలా దిగులుగా ఉన్నావ్ హరీ! నే వినకూడదా?" అంది వసంత.

"అందుకనే వచ్చా వసూ! మా జీవితంలోకి మళ్ళీ ఆరుద్ర వచ్చేడు" అంటూ చెప్పుకొచ్చింది.

"నీవన్నీ పిచ్చి భయాలు! ఆరుద్ర అంటే నీ కజిన్ కదూ? నీమీద కేవలం అభిమానం తప్ప మరో భావంలేని అమాయకుడు. పిచ్చిపిచ్చిగా ఆలోచించి మనసు పాడుచేసుకోవద్దు" అంది.

విస్మయంగా చూస్తూండిపోయింది హరిణి. సంధ్య చీకట్లలో మెల్లిగా ఇల్లు చేరుకుంది హరిణి

నీరసంగా హాల్లో సోఫాలో కూలబడగానే ఎదురుగా టీపాయ్ మీద ఎయిర్ మెయిల్ కవరు కన్పించి విప్పింది.

"శ్రీమతీ!"

ఫోన్ చెయ్యాలనుకున్నాను. కాని ఆ ఫోన్‌లో నీ తీయని స్వరం వింటూ అలానే ఉండిపోవాలన్పిస్తుంది. కాని టెలిఫోన్‌వా ళ్ళంగీకరించరు కదూ? రేడియోలో సంగీతం వినవస్తోంది కాని ఎందుకో వినబుద్ధి కావడంలేదు.

మొన్న మన ఆంధ్రావాళ్ళింట్లో డిన్నర్ ఇచ్చేరు. అనంతరం వాళ్ళమ్మాయి వీణ వాయించింది. వయస్సు ఇరవై లోపలేగాని రీతిగౌళ రాగాన్ని గంభీరంగా విన్పించింది. వారి బలవంతంమీద నేను "నగుమోము" పాడాల్సి వచ్చింది.

పాడేనేగాని అన్నింటా నా హరిణి నగుమోము కనిపించి నీ ఆనందామృతంలో మునిగితేలి మరీ పాడాను.

కాని హరిణీ! పాట ముగించక ముందే "కనికరము లేకపోయెనా" అన్న నీ పాట వినిపించినట్లయి సగంలోనే ఆపాల్సి వచ్చింది.

నువ్వేం చేస్తున్నావ్ హరిణీ? ప్రకృతి మనోహరంగా ఉంది, నీలాగే సంగీతంతో పాటు సౌందర్యాన్ని స్వంతంచేసుకున్న తరుణి! ఈ క్షణంలో నిన్ను అమాంతంగా వాటేసుకోవాలనే ఆరాటంగా ఉంది. హోటల్ రూమ్ ముందు పేరు తెలియని క్రీపర్స్‌కి ఎర్రటిపూలు విరగబూసాయి. ఆకుపచ్చటి ఆకుల మధ్యగా ఆ పూలు చూడముచ్చటగా వున్నాయి. ఆ ప్రతి పువ్వూ నీవే 'కృష్ణా' అని నీలాగే పిలుస్తున్నట్లుగా నేనంత భ్రాంతిలో ఉన్నాను. మొన్న అందమయిన రామచిలుకలు ప్రెజంట్ చేస్తానని నా ఫ్రెండ్ ఎంతగానో బలవంతం చేసేడు కాని నేనందుకు అంగీకరించలేదు. ఎందుకో చెప్పనా?

నీ కటువంటివి నచ్చవు కాబట్టి నిరాకరించవలసి వచ్చింది. దాంతో నా స్నేహబృందం ఒకటే ఎగతాళి! కృష్ణ 'చాలా మారిపోయాడు. హెన్‌పెక్‌డ్' అంటున్నారు. వెనక నేనెంతో రిజర్వ్‌గా ఎవరితోనూ మాట్లాడ కుండా వీలయినంత మౌనంగా ఉండేవాడినట కాని ఈ మధ్య మిసెస్ కృష్ణా గారి సాంగత్యం వలన 'టాకెటివ్' నయిపోయానట. అన్నింటికి నేనిచ్చిన జవాబు చిరునవ్వే సుమా!

ఇంకేం రాయను? నేను కొన్ని కారణాలవల్ల ఇక్కడే మరి కొంతకాలం ఉండాల్సివస్తే మాత్రం వచ్చి నిన్ను నాతో తీసుకొచ్చేసుకుంటాను నీవు లేకుండా నేనుండలేను. నే దూరానున్నానని సంగీత సాధన మానకు. మధుర మయిన మన కలయిక ముచ్చటయిన మన జంటా, మనిద్దరికీ సంగీత సాహిత్యాలతో పరిచయముంది కాబట్టి ఒక శ్రవణానందకరం మరొకటి పఠనీయానందం కాబట్టి మన జీవితాన్ని వీటితో దేవి సరస్వతికి అంకితమిద్దాం!

హరి! అసలే నీకు ఆలోచనలు ఎక్కువ. అనవసరంగా ఆలోచించకు. ఆ సమయంలో వేరే పనిలో నిమగ్నమైపో. చదువుకో! లేదా పాట పాడుకో!

చల్లగాలి వీస్తోంది. వర్షంగా ఉంది.

నా మనసంతా నీమీదే. మరో మాటకిగాని, ఊహకుగాని తావేలేదు.

హరిణీ గుడ్‌నైట్

నీ కృష్ణ

23820

"హలో" అంటూ లోపలికి వచ్చేడు ఆరుద్ర.

ప్రత్యూష పవనాలు సోకుతూండగానే పూలసజ్జలో పువ్వులు పోస్తూ హరిణి కన్పించింది.

ఆరుద్రను చూడగానే ఉలిక్కి పడింది. అందమయిన పువ్వులు, మందారాలూ, పారిజాతాలూ, కరవేరలూ, నిద్రగన్నేరూ, మాలతీ, మాధవి, ఛమేలీ రకరకాల పూలతో, రంగుల సమ్మేళనంతో రాగరంజితంగా ఉన్నాయి. ఆమె చేతిలో ఎర్రటి మందార మొకటి ఉంది.

"గుడ్‌మార్నింగ్" అన్నాడు మళ్ళీ పలకరింపుగా. ఏమీ సమాధాన మీయకుండా రాధామనోహరాల తీగ మీద దృష్టినిలిపింది.

అసహనంగా ఆమెని చూస్తూ "లోపలికి రావచ్చునాండీ శ్రీమతి హరిణీ"— అన్నాడు.

"గుడ్‌మార్నింగ్‌తో పాటు హార్టీ వెల్‌కమ్ మిస్టర్ ఆరుద్రా."

"హమ్మయ్య! రానీయరేమో, వెలివేస్తారేమో లేదా గెంటించేస్తారో, ఎన్ని సందేహాలో" అంటూ ముందుకి నడిచేడు.

వెలపొడవులేని సాదా లేత నీలిచీర కట్టి వేలుముడివేసి అందులో మందారం పెట్టుకుంది హరిణి.

పొడవైన భారీవిగ్రహం-లో నిగ్రహం ఆమెకుంటే ఆమె అందం అనిర్వచ నీయమైపో యుండేది.

"రండి లోపలికి, అంటూ ఇంట్లోకి దారితీసింది. లోపలికి వెళ్ళి సోఫాలో కూలబడి "సెలవీయండి!" అంది తనూ కూర్చుంటూ. "రేపే హరిణీ ఎంటర్ ప్రైజస్" ఇనాగురల్ ఫంక్షన్. సమయానికి తను రావడానికి కుదరదని హరిణితో అన్నీ సంప్రదించి కానీయమని ట్రంకాల్‌లో చెప్పేడు కృష్ణ అందుకనే మీతో స్వయంగా మాట్లాడాలని, ఆ తర్వాత మిగిలిన ఏర్పాట్లు చేయాలని అనుకున్నాను మిసెస్ హరిణి అందుకనే ఈ శుభోదయాన శుభాంగి దర్శనం శుభప్రదమయిన పువ్వులతో మొదలయింది శుభసూచనంగా, అంటూ ఆవిడ ముఖంలోకి చూసేడు. తలొంచుకుని చేతిగోళ్ళవంక తదేకంగా చూస్తూ కూర్చుంది హరిణి

తెల్లటి సన్నటి పొడవయిన అందమైన వేళ్ళకి అలంకరించిన గోరింట వింత అందాన్ని అందిస్తే చిటికెనవేలుకి పొదిగిన కెంపురాయి వుంగరం మురిపిస్తోంది. కళ్ళలో భావాలేమిటో చదవాలనుకుంటే తలొంచుకుని కూర్చొంది. ఆరుద్రలో అసహనం మరింత అధికమయింది.

"'హరిణి ఎంటర్‌ప్రైజెస్', కదూ? ఏమయినా కాగితాలుగాని, వేరేమయినా సంతకాలు అవసర ముంటేఇవ్వండి, సంతకం చేస్తాను," అన్నది హరిణి.ఆవిడ మాటలో డిటర్మినేషన్ కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది.

"మీరూ ఒకసారి చీఫ్‌గెస్ట్ గారిని ఆహ్వానించడానికి వస్తే బాగుంటుంది." భయం భయంగా అడిగేడు ఆరుద్ర.

"అవసరం లేదనుకుంటా ! ఆ ఏర్పాట్లు మీరు చూడండి. ఆ సమయానికి నేనుంటాను."

"థాంక్స్ ! థాంక్స్ !" అన్నాడు ఆనందంగా ఆరుద్ర. ఈలోగా నాయర్ తీసుకొచ్చిన టీ తాగేసి "వస్తా మేడమ్," అంటూ వెళ్ళిపోయాడు.

గేటు దాటి ఆరుద్ర వెళ్ళగానే టెలిఫోన్ దగ్గిరకి వచ్చి బొంబే తాజ్‌కి లైట్నింగ్ కాల్ బుక్ చేసింది హరిణి. చేతిలో పూలసజ్జ, అందులో రంగు రంగుల పువ్వులు, అవి విరజిమ్మే పరిమళాలు. మనసంతా చిందరవందరగా ఎటూతోచని ఆలోచనలూ—వీటి మధ్య పరిభ్రమిస్తోంది.

టెలిఫోన్ మోగడం, కృష్ణ పలకడం జరిగేయి

"హలో హరీ !"

"గుడ్‌మార్నింగ్ కృష్ణా ! రాత్రి బాగా నిద్ర పట్టిందా ?" చిలిపిగా ప్రశ్నించింది.

"హరీ ! హరి ! నా కెంత కంగారుగా ఉందో తెలుసా ? నీ ఫోన్ మరో అయిదునిమిషాలు ఆయాక వచ్చిఉంటే నే నివాళ నీకు దొరికి ఉండేవాడిని కాను. నీకెలా ఉంది? అసలు విషయమేమిటి ? ప్లీజ్! తొందరగా చెప్పాలి ?" కంగారుగా ప్రశ్నలు వేసేడు.

"నథింగ్ టు వర్రీ. నువ్వివాళ రాత్రి ఫ్లయిట్‌లో వచ్చెయ్యాలి. వెరీ అర్జంట్. నాకెందుకో భయంగా ఉంది. నీ వ్యాపారంలో లక్షలు నష్టం వచ్చినా రాని, నువ్వు వచ్చి తీరాలి. ఇంతకి మించి మాట్లాడేస్థితిలో లేను" అంటూ డిస్కనక్ట్ చేసింది హరిణి.

* * *

"ఎందుకలా భయపడ్డావ్ ?" లాలనగా హరిణి తలనిమురుతూ, అడిగేడు కృష్ణ.

"ఏమో "

"అలా చిక్కిపోయావేం ?, నీ మనసులో బాధ ఏమిటి హరి ?"

నవ్వింది. "ఏంలేదుగాని మన మలా వసంతా వాళ్ళింటికి వెళ్ళివద్దాం" అంది హారిణి.

"ఎనిమిదిన్నర దాటిపోయింద." అయినా వెళదాం పద.

సడన్‌గా వీరిద్దరినీ చూసి ఆశ్చర్యపడింది వసంత.

"రండి" అంది సాదరంగా.

"ఎవరూ ?" అంటూ లోపలి నుంచి వినయ్ కూడా బయటికి వచ్చేరు.

"అదేమిటి ? మీరు బొంబేలో ఉన్నారని ఆరుద్ర అన్నాడు ?" ఆశ్చర్యంగా అన్నాడు వినయ్.

"ఆరుద్ర కరెక్ట్ ! కాని ఇవాళ రావాల్సివచ్చింది" అన్నాడు క్లుప్తంగా కృష్ణ.

అందరూ లోపలికి వచ్చి కూర్చున్నారు.

"ఏమిటి విశేషాలు ?" వినయ్ అడిగేడు.

"ఏముంటాయి. రొటీనే. అదే బిజినెస్. అవే ఆలోచనలూ, మధ్య మధ్య మార్పు కావాలంటుంది మా హారిణి. అందుకని ఆవిడని బిజీగా ఉంచాలని "మా హారిణి ఎంటర్‌ప్రైజెస్" స్టార్ట్ చేయబోతూ మీ ఇద్దరిని స్వయంగా ఇన్వైట్ చేయాలని వచ్చేం" అన్నాడు కృష్ణ.

అప్పుడే లోపలికి అడుగుపెడుతూన్న ఆరుద్ర క్షణంసేపలా నిలబడి పోయాడు ఆశ్చర్యంగా, హారిణి కృష్ణలవంక చూస్తూ. తేరుకుని లోపలికి వస్తూ వాటె వండర్, ఎప్పుడొచ్చేరేమిటి ?" అన్నాడు కృష్ణవంక చూస్తూ.

జవాబుగా నవ్వాడు కృష్ణ.

వారందరి మధ్యా సంభాషణ చాలా సామాన్యంగా జరిగింది కావాలని వచ్చిన హారిణి కూడా ఎందుకో ఆ వాతావరణంలో కలవలేకపోయింది. ఆమెకు వాతావరణం, ఊపిరిసలపనీయకుండా ఉంది.

"మిసెస్ హారిణిగా రెందుకో అన్‌కంఫర్ట్‌గా ఫీలవుతున్నారు" అన్నాడు ఆరుద్ర సడన్‌గా.

ఆమాట విన్న హారిణిముఖం మరింత అప్రసన్నంగా మారిపోయి మళ్ళీ వెంటనే సర్దుకుని "ఏంలేదు" అంది.

"ఏం లేదా హారిణీ ? క్షణక్షణమూ నీ ముఖంలో మారే రంగులే నీ మనసుకి నిదర్శనం" అనుకున్నాడు మనసులో ఆరుద్ర.

"ఇక పోదాం ! చాలాసేపయింది వచ్చి" అంటూనే లేచి నిలబడింది హారిణి.




గత్యంతరం లేనట్టుగా తనూ లేచేడు కృష్ణ.

"రేపు కలుసుకుందాం!" అంటూ అందరిదగ్గిరా సెలవు తీసుకున్నాడు కృష్ణ.

"ఎక్కండి మేమ్‌సాబ్!" అన్నాడు కృష్ణ కారుడోర్ తెరుస్తూ. సికింద్రాబాద్ వైపుకి మెల్లిగా కారు దూసుకుపోతోంది.

కృష్ణ భుజంమీద వాలి కళ్ళు మూసుకుంది హరిణి.

"ఏయ్! హరీ! మనిల్లు వచ్చేసింది, నిద్రపోకు!"

"సరే—"

ఇంటిముందు కారాపి "దింపాలా" చిలిపిగా ప్రశ్నించేడు.

"అవసరంలేదు" అంటూ దిగి వెళ్ళిపోయింది లోపలికి. బావురుమనేంత పెద్ద ఇంట్లో వంటరిగా నాయర్ కాపలాకూర్చున్న తీరుకి జాలివేసింది కృష్ణకి! కాని తనూ అంతే. హరిణిని పెళ్ళిచేసుకోగానే, తనవారందరితో సంబంధబాంధవ్యాలు తెగిపోయాయి. తన డబ్బు వాళ్ళకి అవసరం. తనూ, హరిణి, ఎవరికీ అవసరంలేదు. డ్రెస్‌అయినా మార్చుకోకుండా చరచరా మెట్లెక్కి డాబామీదకి వెళ్ళేడు. పున్నమి చంద్రుని వెన్నెల విరగకాస్తోంది.

ఆ వెన్నెల వెలుగులలో, తోటలో ప్రతి పువ్వూ విరిసి, విరగబడి మరీ మరీ పరిమళాలు వెదజల్లుతున్నాయి.

ఉన్నట్లుండి అమ్మా, నాన్నా, చెల్లెళ్ళూ, తమ్ముళ్ళూ అందరూ గుర్తుకు వచ్చేరు. ఏంచేస్తూంటారో ఈపాటికి అనే ఆలోచన కలిగింది.

కృష్ణ ఆలోచనల కంతరాయం కలిగిస్తూ, "సార్" అంటూ నాయర్ పైకి వచ్చేడు.

"ఏమిటి ?"

"హరిణమ్మగారు భోజనం చేయరుట. కనీసం పాలయినా తాగండి అంటే తంతాను అంటున్నారు. మీరోసారి వస్తారా ?"

నవ్వొచ్చింది కృష్ణకి. "నేనూ తినలేను నాయర్ ? నీవు భోజనం చేసేయి. చూడు, నీతో మనసు విప్పి, మాట్లాడగలుగుతున్నాను. మనింట్లో ఈ వెర్రి పరిపాటే కదా ? ఫ్లాస్క్‌లో పాలుపోసి గదిలో పెట్టు. పెద్దవాడివి కాబట్టి మన్నించు మమ్మల్ని," అన్నాడు బాధగా.

"సార్ ! అంతంత పెద్ద మాటలు వాడకండి, నా కర్థంకాదు. అమ్మాయి గారూ అలాగే అంటూంటారు. ఇదేదో జన్మజన్మల బంధం బాబూ !" అంటూ కిందకి వెళ్ళిపోయాడు.

చేతికందిన రాధామనోహరాల గుత్తి త్రెంచి చేత్తో పట్టుకుని కిందకి దిగేడు. హారిణి గదిలోకి వచ్చేడు. లేత నీలిరంగు లైట్ డిమ్‌గా వెలుగుతోంది. సతమత మయిన తన బ్రతుకులో తన జీవన భాగస్వామి మంచానికి వారగా ఒక వైపుకి తిరిగి నిద్రపోతుంది. వెళ్ళి మంచంఅంచున హరిణి పాదాల దగ్గిర కూర్చున్నాడు. సన్నటి వెండిమువ్వల పట్టాలు తెల్లని ఆమె పాదాలకి అందానిస్తున్నాయి. సదా వెన్నెలలా నవ్వే ఆమె పెదవులు బిగించింది. సత్యభామలా కన్పించింది.

పూలగుత్తి ఆమె ముఖంమీదకి విసిరేడు.

చటుక్కున కళ్ళు తెరిచింది హరిణి.

"అర్థంలేని అలకకి కారణం ?" — అన్నాడు.

"అర్థాలుంటే అవి అలుకలు అవవు. అందమయిన రామచిలుకలే కావచ్చు. వసంతరాగాలు కానూవచ్చు".

"లలితలవంగలతా" అన్నాడు కవ్విస్తూ.

"వీణ కావాలా ? శ్రుతికి తంబూరా చాలంటారా ?"

ఆమె చేతిగాజులు సవరిస్తూ, "ఏంవద్దు ? లే, నాకు ఆకలిగా ఉంది. నీవే నాకీవాళ స్వయంగా అన్నం వడ్డించి దగ్గరుండి తినిపించాలి.

అలాగే అంటూ బొమ్మలా నడిచి వెళ్ళింది. అహర్నిశలూ హరిణి ఎక్కడ

ఉన్నా, నానాటికీ ఆమెమీద ప్రేమా, కలలు, ఆశలు మరింత ఎక్కువయి పోతున్నాయి. స్వయానా తన అర్ధాంగి ఆవేశానికి, అహంకారానికి ఆమెకి ఆమే సాటి. సహనం, శాంతం ఇవి ఆవిడ నిఘంటులో లేవు. కాని ఆమె తన ప్రేమని తనకి అర్పణ చేసింది. జీవితం తనకి అంకితం చేసింది. కాని అర్థంకాని అలివ! తన హృదయరాణి!

అలాగే మంచంమీద వాలి ఆలోచనల్లో పడ్డాడు. గలగలా గాజుల చేతులు తట్టి లేపేదాకా ఊహాలోకాల్లో విహరించేడు.

"ఏమిటి ?" అన్నాడు మత్తుగా. నిద్ర ముంచుకొస్తున్న అతని కళ్ళకి హరిణి కొత్తగా కనిపించింది. తెల్లటిచీర, విరజాజులు, కవ్వించే కాటుక కళ్ళు చూచి 'హరి' అంటూ అమాంతంగా ఆమెని తన హృదయానికి హత్తుకున్నాడు. "లే కృష్ణా! ఆకలిగా వుందని ఇదేమిటి ?" అని అతన్నుంచి విడిపించుకుని లేవదీసింది.

"నాకు తినే శక్తి లేదు హరీ" అంటూ మళ్ళీ మంచంమీద వాలిపోయాడు. క్షణంసేపలా అతన్ని తదేకంగా చూసి గదిలోంచి వెళ్ళిపోయింది వెండి గిన్నెలో పెరుగన్నం, స్పూన్‌తో తిరిగివచ్చింది. మంచంమీద అతన్ని ఆనుకుని కూర్చుంది. అలా కొద్దిసేపు అతని ముఖంలోకి చూస్తూండిపోయింది. కళ్ళు విప్పి కృష్ణ కూడా చూసేడు. రెప్పపాటులో నాలుగు కళ్ళూ కలిసాయి.
"కృష్ణా! నీ వాళ్ళందరికి నిన్నెలా దూరంచేసేను. నిన్ను ఈ విధంగా అన్నానికి, నీళ్ళకి దూరంచేసేక ఇక నా మనుగడకి అర్థంలేదనుకుంటాను".
నిద్ర మైకం ఒక్కసారిగా వదిలి పోయింది. "హరిణి"! అరిచేడు గట్టిగా.
గిన్నె నేలమీద పెట్టేసి కృష్ణని గట్టిగా పట్టుకుని ఏడవసాగింది. వెక్కి వెక్కి మరీ ఏడుస్తోంది.

హరిణిని మరింత దగ్గరగా లాక్కుని ఆమె కళ్ళని పెదవులతో చుంబించి "హరీ! నాకు అమ్మని, నాన్ననీ, చెల్లెళ్ళని, అందరినీ నీలోనే చూపిస్తూ పిచ్చి మాటలు మాట్లాడతావేం ? నవ్వాలి. నా హరిణి నవ్వులతోనే సమస్తమూ గెలవాలి, రేపే మన హరిణీ ఎంటర్‌ప్రైజస్ ఓపెన్ చేస్తున్నాం! అలాంటి సమయంలోనా నీ కన్నీరు ? స్టాపిట్ హరిణీ! నీ వేడిస్తే నా గుండెలలో దాచుకుంటాను. నీకది ధైర్యం! నాకా దుఃఖం వస్తోంది. నే నేడిస్తే నా కెవరున్నారు ? నా ముందే నీవేడిస్తే నేనేం కావాలి ?"

"నేనున్నాను" అంది వెక్కుతూనే.

ఇద్దరూ అలాగే ఉండిపోయారు.

ఇరువురి హృదయాల్లో జ్ఞాపకాల హోరుగాలులూ, గాలివానలూ! నాలుగు కనులలో నిండిపోయిన కన్నీరు! గంటలు గడిచిపోయాయి.

తొలికోడి కూసింది. తెల్లవారింది. కృష్ణ మెలకువవచ్చి హరిణిని చూసేడు. తనని అల్లుకుపోయి అమాయకంగా నిద్రపోయింది. సౌందర్యం, సౌకుమార్యం స్వంతంచేసుకున్న ఆమెలో పొగరూ, వగరూ అధికమే. తన పంతం నెగ్గించుకోవాలనే తపనా ఎక్కువే! వీటిని మించిన అమృతహృదయంతో తనని గెల్చుకుంది. ఆవిడ హరిణి!

హరిణి తల లాలనగా నిమురుతూ "హరీ" అన్నాడు. రెప్పవేయకుండా అతనివంక చూసింది.

"ఇవాళ కనీసం 24 గంటల పాటు మనిద్దరి మధ్యా ఎలాంటి ఘర్షణా రాకూడదు. రాకాసిలాంటి కారుమేఘాలు రాజ్యాలేలడానికి వీల్లేదు పూర్ణ చంద్రుడు స్వచ్ఛందంగా సు ం ద ర ం గా వెన్నెల వెల్లులు చిందించాలి. వసంతోదయంలో తొలి కోయిలలా, మల్లెల డోలికలల్లో మనం తేలిపోవాలి.

మనోజ్ఞకంగా నవ్వి 'అలాగే' అంది.

"జాగ్రత్త! నువ్వేమయినా పెంకితనం చేసేవా నేనసలే మంచివాడిని కాదమ్మాయ్!"

"వదలండి" అంటూ అతన్ని వదిలి ఆ గదిలోంచి వెళ్ళిపోయింది.

* * *

లక్ష్మి, సరస్వతి, దుర్గాదేవి మూర్తుల ముందు నిలువెత్తు దీపాలు వెలిగించి శాస్త్రోక్తంగా పూజలు చేసేరు.

ఫుల్‌సూట్‌లో మెరిసిపోతూ అందరికీ వెల్‌కమ్ చెప్తున్నాడు అరుద్ర.

మామూలు డ్రెస్‌లో దూరంగా నిలబడి ఎవరినో మాట్లాడిస్తున్నాడు కృష్ణ.

ఏడువారాల నగలూ ధరించి అత్యంత వెలగల చీరగట్టి, ఆడంబరంగా నిలబడి 'కంగ్రాట్స్' చెప్పిన వారందరికి 'థాంక్స్' చెప్తోంది హరిణి. గర్వంగా "హరీ! కృష్ణ" పిలిచేడు.

అటుగా వెళ్ళింది.

"ఈయన డాక్టర్ మోహన్‌రావ్!" అని ఈమె "మిసెస్ హరిణీ కృష్ణ" అంటూ పరిచయాలు చేసేడు. బైటివే మిసెస్ మనోరమ ఈవిడ. 'నమస్తే' చేతులు జోడించింది వారిద్దరికి.

"వెల్! మీలాగా ఆడవాళ్ళంతా ఇలా ముందుకి వస్తే, అందునా ఆరుద్ర గారిలాంటి ఏక్టివ్ పర్సన్‌తో పార్ట్నర్‌గా ఉండడానికి సాహసించడం నాకెంతో ఆనందంగా వుంది. ఒక రకంగా ఇది మీ అద్భుత వ్యక్తిత్వానికి నిదర్శనం మిసెస్ కృష్ణా!"

హరిణి తలఎత్తి 'ఆక్షేపణా' డాక్టర్!" అంది.

"ఛా! అవహేళన. ఆక్షేపణ అంటే ఏమిటో తెలియదు. హృదయపూర్వక అభినందనలు."

"థాంక్స్" అంది.

"పక్కా వ్యాపారస్తుల లక్షణం!"అన్నాడు. మోహన్ నవ్వకుండా ఉండలేక కిలకిలా నవ్వింది.

ఆనవ్వుతో డాక్టర్ మోహన్ అంతరంలో హరిణిమీద అభిమానం, గౌరవం, తెలియని అనురాగం అధికంకాసాగాయి.

అలాగే ఆమె ముఖంలోకి చూస్తూండిపోయాడు.

"బైదిబై మీరు సంగీత సరస్వతిగారుట కదా ?" మోహన్ అన్నాడు.

"వాట్ వాట్" అన్నాడు ఆరుద్ర.

"ఏమండోయ్! ఆరుద్రగారూ!" అంది కోపంగా.

"ఆరుద్ర నెందుకు మందలించటం? చేతనయితే జవాబీయండి ? యస్ ఆర్ నో! వెరీ సింపుల్!" కొంటెగా అన్నాడు. అతని కళ్ళలోకి ఈసారి చూడలేకపోయింది. తలదించుకునే "డాక్టర్‌గారూ! నేను పాడగలను, మావారూ పాడగలరు, రాయనూగలరు మా పాండిత్యమెంతో మీరే నిర్ణయించండి" అంది ఉద్వేగంగా.

"మీరు లేనిదే కృష్ణగారి సాహిత్యానికి అర్థంలేదు" మోహన్ ఆవేశంగా అన్నాడు.

మనోరమ ముఖంలో రంగులు మారుతున్నాయి. భర్తని తీవ్రంగా గమనిస్తోంది.

ఎక్కడో దూరంగా ఉన్నా కృష్ణమనస్సు హరిణిమీద ఉంది.

మోహన్ ఏదో జవాబీయాలనుకునేలోగా వసంతా, వినయ్ వచ్చేరక్కడికి.

"లేట్ కమ్మర్స్" అంటూ కృష్ణా అక్కడికి వచ్చేడు.

"సారీ హరిణీ!" అంది వసంత.

"సారీ! అన్నాడు వినయ్!" నవ్వింది హారిణి.

వసంతని చూడగానే మనసు ఎంతగా పరవశించిందో కృష్ణ కళ్ళు సాక్ష్యం!

ఉడికిపోయింది హారిణి మనస్సు. వెంటనే ఉదయం కృష్ణకి తను చేసిన వాగ్దానం గుర్తువచ్చింది. మామూలుగా ఉండడానికి శతవిధాలా ప్రయత్నించింది. హారిణినే గమనిస్తున్న కృష్ణకి నవ్వొచ్చింది.

హోటల్ అన్నపూర్ణాలో వీళ్ళందరికీ లంచ్ ఏర్పాటుచేసేడు ఆరుద్ర.

వరుసక్రమంలో ఆరుద్రకి, కృష్ణకి మధ్య హారిణి కూర్చోవలసి వచ్చింది.

కోపంగా చూసింది కృష్ణవంక. మన్నించమన్నట్లుగా చూసేడు. లంచ్ ముగియగానే, "హారిణీ ఎంటర్ప్రైజస్" తరపున మీకందరికీ మా ఇద్దరి కృతజ్ఞతలు అన్నాడు ఆరుద్ర.

"మేడమ్! మీ సంగీతం వినడానికి త్వరలో మీ ఇంటికి మనోరమా నేనూ రాబోతున్నాం" అన్నాడు మోహన్.

"వెల్కమ్" కృష్ణ జవాబిచ్చాడు.

హారిణివంక అదోలా చూస్తూ 'సెలవ్' అంది మనోరమ.

ఆమె చేయి అందుకుని "వస్తూండండి" అంది హారిణి.

"థాంక్స్" అంది మనోరమ.

ఎంతో అలసటగా కన్పించింది మనోరమ మోహన్ కళ్ళకి. తనొక డాక్టర్గా ఆమెని విశ్రాంతి తీసుకోమని చెప్పాలనుకున్నాడు.

"నాకు పనుందిగాని నీవింటికి వెళ్ళిపో హారిణీ" అన్నాడు కృష్ణ. తనూ అందరికీ చెప్పి కారెక్కింది.

ఆలోచనతో తలనొప్పి వచ్చేసింది. ఇంటికి రాగానే ఫోన్ మోగింది. విసురుగా రిసీవ్చేసుకుంది హారిణి.

"మిసెస్ హారిణీ" అంటూ అవతలి కంఠం పలికింది.

"స్పీకింగ్" అంది హారిణి.

"మేడమ్! డాక్టర్ మోహన్ని" అన్నాడు.

"చెప్పండి" అంది.

"హారిణి! చనువుతో సాహసించి నేనిలా అంటున్నందుకు మన్నించాలి. మానసికంగా మీరెంతో అలసిపోయారు. ఆలోచనలు మానేసి హాయిగా విశ్రాంతి తీసుకోండి. మిమల్ని చూస్తూంటే నా మతిపోతోంది. స్వాధీనం తప్పిపోతోంది. పోనీలే మీరు తిట్టకుండా ఫోన్ పెట్టేస్తాను" అంటూ పెట్టేసేడు.

షాక్ తగిలినట్లయింది. తను రిసీవర్ పెట్టేసి పక్కనే ఉన్న సోఫాలో వాలిపోయింది. గత రాత్రి నిద్రలేని కారణం, విపరీతమయిన మానసిక సంఘర్షణతో అలసిపోయిన హరిణి అలానే నిద్రపోయింది.

సంధ్యా చీకట్లు అలుముకున్నాయి. నాయర్ ఇల్లంతా దీపాలువేసి హాల్లో వేయడానికి సంకోచించేడు అమ్మగారికి నిద్రాభంగం కాకూడదని.

కృష్ణ ఇంట్లోకి అడుగుపెడుతూనే "హరిణీ"అన్నాడు. "నిద్రపోతున్నారు" —నాయర్ జవాబు.

హాల్లోకి వస్తూనే నిర్ఘాంతపోయాడు. గువ్వలాగా ముడుచుకుని సోఫాలో నిద్రపోతోంది. అమాంతంగా ఎత్తుకుని తన గదిలో మంచంమీద పడుకోబెట్టి ఫాన్ వేసేడు.

ఆవిడ మెడలో పచ్చలనెక్లెస్ మెల్లిగా తీసి పక్కన పెట్టేడు. ఆడంబరంగా కనిపించే జూకాలూ, అతిగా వేసుకున్న బంగారు గాజులు వరసగా తీసి పక్కన పెట్టేడు. వాడిపోయిన పువ్వులు తీసి కింద పడేసేడు. 'హరిణీ మైస్వీట్' అనుకున్నాడు మనసులో. తమ జీవన నౌకకి చుక్కాని హరిణి. ముంచినా తేల్చినా ఆమె దయ.

"కృష్ణా" అంది గారంగా.

"అమ్మ దొంగా! నీ నిద్ర అంతా నటనేనా? ఆశ్చర్యంగా అడిగేడు.

"సగం నిజం, సగం అబద్ధం. ఇప్పుడే మెలకువ వచ్చింది."

"సారీ హరిణీ నిన్నెంతో శ్రమపెట్టేను."

"ఈ ఒక్కరోజు కోసమే కదా?"

"అంటే?" రెట్టించేడు.

"అంటే" అని చిలిపిగా చూసి అతని భుజాలమీద తల ఆనించి "చూసేరూ? శ్రీవారూ! నన్నొక పావుని చేసి చదరంగం ఆడదలిస్తే నేనేం చేయలేనుగాని నాపై ఎటువంటి భారమూ వేయకండంటూ సవినయంగా మనవి చేసుకుంటున్నాను. అంతకుమించి మరేంలేదు"

"హరీ! కాలంతో పాటు తోచనప్పుడూ, అవకాశాలున్నప్పుడూ, కావాలన్నప్పుడు, రానివి కలిసివచ్చినప్పుడు వచ్చే మార్పుని స్వీకరించడంలో ప్రతిఘటన లెందుకో నాకు తెలియదు".

"కృష్ణగారూ! మరీ కవిత్వం చదవకండి. తోచకపోతే ఇల్లు అలుకుతాను,

వంట చేస్తాను, పిల్లలని కని పెంచుతానుగాని ఉద్యోగాలు, ఊళ్ళేలటాలు చేయను" ఆవేశంగా అంది.

"ఊహూ! నా హరిణి ఆలోచనలు అలా ఉండటం నేను అంగీకరించను. ఉదయం చూసేవుగా? ఎన్ని జతల కళ్ళు నిన్ను అసూయగా చూసేయో? ఇంకా, ఇంకా వాళ్ళు ఉడుక్కోవాలి. ఆర్ద్రతతో ఇది ఒక రకంగా వైకుంఠపాళి. మరో రకంగా గేమ్! ఛాలెంజ్!

"నీ భర్తని ఓడిస్తావో, లేక అలనాటి సత్యభామనే మరోసారందరికీ గుర్తు చేస్తావో నీ ఇష్టం. నా గౌరవమర్యాదలూ, హోదాలూ సమస్తమూ నీ చేతుల్లో పెడుతున్నాను." అంటూ ఉద్రేకంగా ఆమె చేతుల్ని గట్టిగా పట్టుకున్నాడు.

అచేతనంగా అతన్ని చూస్తూండిపోయింది.

కృష్ణ పంతం తనెరగనిది కాదు. తనకోసం ఆరోజు సమస్తమూ కాదన్నాడు. ముక్కోటి దేవతల సాక్ష్యంతో తాను అతని మనసు ఏనాడూ నొప్పించనని, అతనేదడిగినా కాదనని మాట ఇచ్చింది.

"ఏయ్! ఏమిటాలోచిస్తున్నావ్" తట్టి పిలిచేడు.

అతని కళ్ళలోకి చూచి "ఏంలేదు" అంది.

హరిణి వళ్ళో తలుంచుకుని పడుకున్నాడు కృష్ణ. అతని తల నిమురుతూ ఉండి పోయింది. ఇరువురి మనసుల్లో ఒకే రకమైన ఆలోచనలు!

* * *

తొలినాటి పరిచయం!

వసంతా వాళ్ళింట్లో పెళ్ళినాటి ఫంక్షన్‌లో! ఎన్నిసార్లో వసంత నోటమ్మట వినడమేగాని, కృష్ణని చూడలేదు. ఎర్రగా, పొడుగ్గా, సన్నగా, కుర్రతనం వదలని ఒకతను చాలా హడావుడిగా తిరిగేస్తున్నాడు.

నడక తీరులో ప్రత్యేకత కొట్టవస్తూ కనిపిస్తుంది.

సరిగ్గా కృష్ణ మనసులో!

వినయ్ వాళ్ళింట్లో వెడ్డింగ్ యానివర్సిలో!

పేరులోలాగే మనిషి ప్రత్యేకత సంతరించుకుని కూర్చున్న ఒకామె హరిణి! పొట్టీగాక, పొడుగూగాక సమంగా ఉన్న ఎత్తులో మెరిసే కళ్ళతో కన్పించింది. కాని కొట్టొచ్చినట్లు కన్పించే అహంకారం. పెంకితనం వీటన్నిటినీ మించిన ఆత్మవిశ్వాసం ఆవిడలో కనిపించేయి. 'ఎవరమ్మాయో!' అనుకున్నాడు.

"హరిణీ! ఒక పాట పాడవూ ?" వసంత అడిగింది.

"సాంప్రదాయ గానమా ?" అన్నది హరిణి నవ్వుతూ.

"ఏదో ఒకటి" అంది వసంత.

"ఓరచూపు చూసేది న్యాయమా? ఓ రాఘోత్తమా! నీవంటివానికి" అంటూ పాడింది వాలుగా కృష్ణని చూస్తూ.

గతుక్కుమన్నాడు కృష్ణ

అసాధ్యురాలు అనుకుని ఈసారి సూటిగానే ఆమెవంక చూసేడు.

అదే సమయంలో హరిణి అతన్ని చూసింది.

"నే పాడేదా వసంతా?" అన్నాడు.

"నువ్వా ? అందుకనే వెదర్ లో సడన్ ఛేంజ్! మహాభాగ్యం పాడు!" అంది వసంత.

"చూసుకో! వసంతరాగంలో నీకిష్టమయిన పాట!" అంటూ 'లలిత లవంగ లతా' వసంతరాగంలో కష్టపడి పాడేడు. అద్భుతంగా పాడేడు, హరిణి కోసం !

"అయితే వసంతా ! నీ ఫ్రెండ్‌ని మరో పాట పాడమను" అన్నాడు

"కాదు ! మీరే పాడాలి. మీ పాట ముందు నా దెంత." డైరెక్ట్‌గానే అంది హరిణి.

'నగుమోము గనలేని నా జాలి తెలిసి' అంటూ ప్రారంభించి, 'వగచూపకు తాళను నన్నేలుకోరా' అంటూ సూటిగా హరిణిని చూస్తూ పాడేడు.

ఆ తర్వాత మాటల్లో పడ్డారు. నియాన్ దీపాల కాంతిలో, కృష్ణ కళ్ళు తదేకంగా హరిణినే పరిశీలిస్తున్నాయి. సమస్త జగతి మనోహరంగా ఉంది.

ఎవరీ అమ్మాయ్ ? తనెందరినో చూసేడుగాని ఇంతగా మనసు నాకట్టుకున్న యువతులెవరూ తారసపడలేదు. ఇది కలా ! నిజమా !?

ఎవరీ యువకుడు ? సరిగ్గా హరిణి మనసులో ! ఎందరితోనో పరిచయం, మరెందరితోనో స్నేహం! ముఖ్యంగా దూరపు బంధువయిన ఆర్ద్రతో అతని లాటి అపూర్వ వ్యక్తి కలిగించని అలజడి, ఇతని కళ్ళే కలుగచేస్తున్నాయి.

'లలిత లవంగలతా, కోమల మలయ సమీరే' అంటూ జయదేవుని అష్టపది పాడిన ఇతగాడే పద్మావతీ చరణా, చరణ చక్రవర్తి కాబోతున్నాడో ? ఆవిడమీద క్షణం అసూయ, ద్వేషం, కోపం, ఒక్కసారిగా వచ్చేయి. మరుక్షణం నవ్వొచ్చింది కూడా. తన మనసు వేసే వెర్రితలలకి ! సన్నగా పొడుగ్గా, బలంగా ఉన్న అతని వేళ్ళు చూస్తూంటేనే అతనొక కళాకారుడని, లలితకళల్లో తప్పక ప్రవేశ ముంటుందని, తెలుస్తుంది.

'గగనానికీ, ఇలకూ, బహుదూరంబనినాడో, ఖగరాజు యానతి విని వేగ చనినాడో,' అంటూ పాడి వగచూపకు తాళను నన్నేలుకోరా" అంటూ చమత్కారంగా మరో స్థాయిలో పాడిన తీరే వేరు.

ఆ పాటే పదే పదే తన ఆలోచనల్లో మెదులుతోంది.

ఆ తర్వాత-

అందరు అమ్మాయిలు అబ్బాయిల ప్రేమ కథే అయినా ఆ వెనుక, ఆ కథ వెనక, ఒక గతం!

ఓ సంధ్యవేళ, యూనివర్సిటీ ఏరియాలో బస్‌స్టాప్‌లో ఒంటరిగా తను బస్ కోసం వెయిట్ చేస్తూంటే స్కూటరు ఒకటి వచ్చి హరిణి ముందు ఆగింది. అదే జీవన బృందావనిలో మలుపు తిరిగిన మధుర ఘట్టం!

దూరంనుంచే ఆమెని గమనించి స్కూటరాపి దిగి, "హలో హరిణిగారూ!"

"హరిణినే" అంది నవ్వుతూ.

"సికింద్రాబాదే కదా? మీ కభ్యంతరం లేకపోతే నాతో రావచ్చనుకుంటాను." కొంటెతనం కొట్టుస్తున్నట్లుగా ముఖంపెట్టి ఆహ్వానించేడు.

"ఔరా! ఎంతటి ధైర్యం? అనుకుంటున్నారు కాబోలు హరిణీ! నేనేం రౌడీని కాను" అన్నాడు తనే తిరిగి.

తల ఎత్తి అతని ముఖంలోకి చూసింది హరిణి. అదే చిరునవ్వు. హరిణి కనులలో భావాలు పుస్తకంలో చదివినట్లు చదివి మరీమాట్లాడేడు కృష్ణ. "అయితే మీరు నాతో వస్తారు."

"నాకు భయం" అంది హరిణి

"భయమా? భయమా? పగలబడి నవ్వి, స్కూటరంటే భయమా? నాతో రావడం భయమా? నేనంటే భయమా? ఎవరయినా చూస్తారని భయమా హరిణీ?" సూటిగా చూస్తూ అడిగేడు. అతని చూపులు మెల్లిగా తప్పించుకుని కళ్ళు వాల్చేస్తూ "అన్ని భయాలు హరిణికి లేవు కృష్ణాగారూ! స్కూటరెక్కడమే భయం."

"నన్ను పట్టుకోవచ్చుగా." అర్థవంతంగా అన్నాడు.

"సరే!" పదండి, అంది. అప్పటికే చుట్టూరా ఓ నలుగురు చూస్తున్నారు వింతగా. మరో నలుగురు మూగే ప్రమాదం సంభవించవచ్చనే భయంతో అంగీకరించింది. అన్ని సంకోచాలూ వెనక్కు నెట్టేసి నిర్భయంగా, అతని వెనక స్కూటరు ఎక్కింది. అతని భుజాలమీద చేతులేసి నిర్భయంగా

కూర్చుంది. ఆ క్షణంలో అతను పరాయి వ్యక్తిగా అన్పించలేదు. కేవలం తన స్వంతం, తనకేదో హక్కు అధికారమున్నట్లుగా అన్పించింది. అంతర్వాణి హెచ్చరిస్తోందా అని తోచింది.

"మిస్ హరిణీ! మీ పేరూ మీలాగే ప్రత్యేకత కదా? అసలు హరిణి అంటే అర్థం?" కృష్ణ అడిగేడు.

"లక్ష్మి సరస్వతులు పాతకాలంనాటి పేర్లని, పేరులో కొత్తా కావాలి, లక్ష్మి అర్థం ఉండాలని హరిణి అని పెద్దన్న ఉపమానం!" అంది హరిణి.

"ఎక్కడ మేడమ్ మీ ఇల్లు?"

"అమ్మో! మా ఇల్లా, ఇక్కడా పేయండి" అంది కంగారుగా. రోడ్ పక్కగా స్కూటరాపేడు. దిగి థాంక్స్ చెప్పింది.

"మళ్ళీ దర్శనం ,"

నవ్వి "ఆ సమయం రావాలిగా" అంది. "అలా తప్పించుకుంటే ఈ క్షణమే నీ వెంటే నీ ఇంటికి రావాల్సి ఉంటుంది మిస్ హరిణీ! సూటిగా జవాబు కావాలి."

మసక వెలుతురులో అతని ముఖం స్పష్టంగా కన్పించకపోయినా స్వరంలో గాంభీర్యం తప్పక వస్తాదనే ధ్వనించింది. అతని ముఖంలోకి చూసి "యెప్పటి మాటో ఎందుకు? రండి ఈ వేళనే ఇలాగే రండి" పెంకిగా అంది.

"కాదు హరిణీ! మరోసారి వస్తాను" అంటూ స్కూటర్ స్టార్ట్ చేసి వేగంగా వెళ్ళిపోయాడు.

క్షణకాలం అతను వెళ్ళినవైపే చూసి, మెల్లిగా ఇంట్లోకి వెళ్ళింది.

"వీడేమిటి హరిణీ, నిన్ను స్కూటర్ మీద చూసానని గొడవచేస్తున్నాడు?" ఇంట్లోకి అడుగుపెట్టగానే పెద్దన్నయ్య చిన్నన్నయ్యని చూపిస్తూ, హరిణిని నిలేసి మరీ అడిగేడు.

"నేను హరిణిలాంటి అమ్మాయి అన్నానుగాని మనమ్మాయి అనలేదు," అన్నాడు హరిణి చిన్నన్నయ్య ఆమెని పరీక్షగా చూసి. బ్రతుకుజీవుడా అనుకుని "నే స్కూటరెక్కడం ఏమిటి? మీరు వాదించుకోవడం ఏమిటి?" అంది "ఆ కుర్రాడు చాలా బాగున్నాడన్నయ్యా. ఆ జంట బాగుంది. మన హరిణికి అంత అందగాడిని తేవాలి." చిన్నన్న అన్నాడు. "తప్పకుండా" అన్నాడు పెద్దన్నయ్య.

* * *

అక్కడ—

"ఎవరోయ్ ! నీ స్కూటరుమీద సాయంకాలం యూనివర్సిటీ ఏరియాలో."

కృష్ణ ఇంట్లోకి అడుగు పెడుతూండగానే తండ్రి ప్రశ్న.

"ఆ అమ్మాయి, నా ఫ్రెండ్!" అన్నాడు సూటిగా తండ్రిని చూస్తూ.

"ఫ్రెండ్" అసహనంగా పలికేరు.

"యస్ ! డాడీ ! నా ఫ్రెండ్" అన్నాడు తొణక్కుండా.

"ఎలాటి ఫ్రెండ్ ?" ఘర్జించేరు.

నవ్వాడు. "నా నిఘంటువులో మంచి ఫ్రెండ్." పెంకిగా అన్నాడు.

"స్కూటరెక్కి సిగ్గులేకుండా పరాయివాడి వెనక మీదపడుతూ, కూర్చున్నది కూడా మంచి ఫ్రెండా ?" వెటకారంగా అన్నారు.

కృష్ణలో సహనం నశించింది. "ఆగండి నాన్నా ! స్కూటరెక్కిన వాళ్ళందరూ సిగ్గులేని వాళ్ళయితే, నా చెల్లెళ్ళూ, అమ్మా, నాతో చాలాసార్లు, చాలా చోట్లకి వచ్చేరు. పరాయి అమ్మాయిని పట్టుకుని విచక్షణ కోల్పోయి అది, ఇది, అనేస్థాయికి దిగబోకండి." కోపంగా అరిచేడు.

"ఏమిటోయ్ ? అదేమన్నా ఈ ఇంటికి కాబోయే కోడలా ?" రెచ్చిపోతూ అరిచేరు.

"ఏమో ! భవిష్యత్‌లో ఈ ఇంటికి యజమానురాలు కావచ్చు." నిర్లిప్తంగా జవాబిచ్చేడు.

"ఎంతటి ధైర్యం ? నే బ్రతికుండగా యజమానురాలా ?"

"ఏం నాన్నా ? మీరుండగానే పెళ్ళిచేసుకోకూడదా ? నా భార్య ఈ ఇంటి యజమానురాలు కాకూడదా ?"

"ఏమిటోయ్ ? వేళాకోళంగా ఉందా వ్యవహారం ? ఏం చూసుకుని ఆ అహంకారం ? ఏం మందు పెట్టిందా మహానుభావురాలు ?"

"ఏం చూసుకునా ? వినండి ! మహా బాగా, జాగ్రత్తగా వినండి. నేను ఇంజనీరుని. మా తాతగారు నా పేర రాసిన ఆస్తిమీద సర్వ హక్కులూ కలిగిన వాడిని. మీకుమిక్కిలి అందగాడిని. వీటిని చూసుకునే నా అహంకారం. కాబట్టి అనవసరంగా ఆ అమ్మాయిని గురించి తెలియకుండా మాట్లాడకండి. ఆ మాయకురాలు, ఏ మందూ మాకూ తో పని లేకుండానే నన్ను లొంగదీసుకుంది. చాలా ?" మహా పొగరుగా జవాబిచ్చేడు.

"కృష్ణా ! అయితే నా నిర్ణయం విను. యింజనీరవి. శ్రీమంతుడివి కాబట్టి

ఆటోమేటిక్‌గా స్వతంత్రుడివి కూడా! దయచేసి నా ఇంట్లోంచి వెళ్ళిపో. మళ్ళీ అడుగు పెట్టకుండా నీ వస్తువులు తీసుకుని మరీ వెళ్ళిపో. లేదా జయని వెంటనే పెళ్ళిచేసుకో!"

"క్షమించండి. చదువూ సంస్కారం కలిగి, కన్నతండ్రితో ఇలా మాట్లాడ్డం నాకే అసహ్యంగా ఉంది. జయని పెళ్ళిచేసుకోవడం జరగదు. ఇంట్లోంచి సంతోషంగా వెళ్ళిపోతున్నాను. మళ్ళీ మీరు, నన్నూ, నేనెవరిని వివాహం చేసుకున్నాసరే ఆమెనీ గౌరవించిననాడూ, రమ్మని పిలిచిననాడూ నేనీ ఇంటికి వచ్చేది" అనేసి, వెంటనే సామానులతో సహా మరేడుపల్లిలో ఉన్న స్వంత ఇంటికి వెళ్ళిపోయాడు.

"హారిణీ! పెళ్ళివాళ్ళొస్తున్నారు. ఎక్కడికీ వెళ్ళొద్దు." పెద్దన్నయ్య వచ్చి కంగారుగా అన్నాడు.

విస్మయంగా చూసి, "ఎవరికి?" అ ది హా ణి

పెద్దన్నయ్య జోక్ లాగా నవ్వి, "నాకా ఛాన్స్ లేదు, నీకే" అన్నాడు

మౌనం వహించింది. పెద్దవదిన పనిలో ఉంది. అన్నయ్యలిద్దరూ వీధిలోకి వెళ్ళిపోయారు. గేటు తీసుకుని ఆర్ద్ర వస్తున్నాడు. నీరసంగానే ఆహ్వానించింది.

"హారిణీ! నేనొకటి అడగనా?" కూర్చోకుండానే గాభరాగా అన్నాడు.

"ముందలా కూర్చోండి ఒకటేమిటి, వంద అడగండి" అంది

"నువ్వా! ఆర్ద్రా, ఇవాళ మా హారిణికి పెళ్ళివారొస్తున్నారు. సమయానికి వచ్చేవ్" అంటూ వదిన వచ్చి పలుకరించి మళ్ళీ లోపలికి వెళ్ళిపోయింది. ఆర్ద్ర వదినకి దూరపు బంధువు.

"నేను నిన్ను ప్రేమించేను హారిణీ! నిన్నెంతగానో ఆరాధిస్తున్నాను. నన్ను పెళ్ళిచేసుకోమని అర్థిస్తున్నాను" అన్నాడు ఆవేశంగా ఆర్ద్ర.

క్షణమలా ఆర్ద్రని చూసింది. ఓహో! వ్యవహారం చాలా దూరం వచ్చిందన్నమాట. ఆదిలోనే త్రెంచాలి అనుకుంది.

"నేను మిమ్మల్ని ప్రేమించడంలేదు కదా?"

"నవ్వులాట కాదు హారిణీ! వివాహమయాక ప్రేమించగలవనే గట్టి నమ్మకం నాకుంది." ఆత్రంగా అన్నాడు.

"మీతో పెళ్ళి అంటేనే, ఆత్మ హత్య చేసుకోవాలన్పిస్తోంది." చురుగ్గా అంది.

త్రుళ్ళిపడి చూసేడు.

"నేనేదయినా భరించగలను, నీలాంటి భర్త తప్ప."

"జగదేకసుందరివా? స్టాపిట్ ! హరిణీ ఏ నవమన్మధుడో నీ కోసం నిరీక్షిస్తున్నాడనే అనుకుంటున్నావా ?"

"నవమన్మధుడు కాదు మిస్టర్ ! నలకూబరుడు, నా కోసం ఎదురు చూస్తున్నాడేమో ఎవరికి తెలుసు ?"

"హరిణీ ! నీ అహంకారం హద్దులు దాటుతుంది. అయినా చూస్తాను." అంటూ లేచి నిలబడి తీక్షణంగా ఆమెని చూసి, "థాంక్స్" అంటూ బయటికి వెళ్ళిపోయాడు. మనసంతా చిరాగ్గా అయిపోయింది హరిణికి. రాబోయే పెళ్ళి వారికి ఎలా ఎదురు తిరగలా అన్న ఆలోచనలో పడింది.

* * *

వినయ్ వాళ్ళింటి ముందు స్కూటరాగింది. గేటు తీసుకుని బయటికి పోబోతున్న హరిణి కృష్ణని చూసి ఆగింది.

"గుడీవినింగ్ హరిణీ ! వెళ్ళిపోతున్నారా !"

"గుడీవినింగ్ ! నే వచ్చి చాలా సేపయింది."

"నా కోసం కాసేపు కూర్చోవచ్చు !"

"బాగుండదు. నాకా మీతో మాట్లాడాలనుంది ఎలా ? రేపు సాయంత్రం ఆరింటికి టాంక్‌బండ్ దగ్గిరకి రండి" అంది మెల్లిగా. తొందరగా వెళ్ళి పోయింది. వినయ్, వసంతలతో అన్యమనస్కంగానే మాట్లాడి తనూ తొందరగా వెళ్ళి పోయాడు. మనసంతా హరిణి నిండిపోయింది.

* * *

రోటరీ పార్క్ దగ్గిర సాయంత్రం ఆరింటికి హరిణికోసం ఎదురు చూస్తున్నాడు కృష్ణ.

"హలో" అంటూ ఎదురయింది హరిణి.

సంధ్య చీకట్లు అలుముకున్నాయి. పక్షులు కిలకిలా రవాలు చేసుకుంటూ గూళ్ళకి చేరుకుంటున్నాయి. గమత్ అయిన వెలుగు నీడల సమ్మేళనంతో జగతి మనోహరంగా ఉంది.

"రండి అలా కూర్చుందాం" అంటూ ముందుకి నడిచేడు.

అతన్ని అనుసరించింది.

సిమెంట్ బల్లమీద కూర్చున్నా రిద్దరూ.

"విశేషాలేమిటి మిస్ ?

"ఏముంటాయి ?" ఎదురుప్రశ్న వేసింది.




"మీ ముఖం చూస్తూంటే బోలెడున్నాయనిపిస్తోంది," అన్నాడు కృష్ణ.

"నాకూ సరిగ్గా అలానే అన్పిస్తోంది."

"నిజమా? అనిపిస్తోందా?" ఆశ్చర్యంగా అడిగేడు.

"అవును."

"అయితే వినండి" అంటూ ఆవేళ గొడవంతా వినిపించేడు కృష్ణ. మౌనంగా వింది.

"ఏం హరిణీ?" అన్నాడు చివరికి కృష్ణ.

హరిణి చిరునవ్వు నవ్వింది.

"జీవితంలో అనుకోని ఎన్ని తమాషాగా జరిగిపోతూంటాయి కృష్ణగారూ! మీ రొకమాట మనస్ఫూర్తిగా చెప్పగలరా?"

రోషంగా "వాట్ డూయూ మీన్?" అన్నాడు. మళ్ళీ నవ్వింది.

"నా కబద్ధాలాడ్డం అలవాటులేదు మిస్ హరిణీ!"

"నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా? పెళ్ళిచేసుకుంటారా?"

ఊహించని ఆ మాటలకి అదిరిపడి అయినా సర్దుకుని, "నేనెంతో అదృష్ట

వంతుడిని హరిణీ!! బ్రహ్మాండంగా నిన్ను వివాహం చేసుకుంటాను. దేవు డంటనే నమ్మకంలేని నేనుముక్కోటి దేవతల సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను." ఆవేశంగా అన్నాడు.

"అయితే, ఇవాళే మా అన్నయ్యతో మాట్లాడాలి."

"రండి హరిణీ! నడవండి" అన్నాడు లేచి నిలబడి.

"దయచేసి మీరూ అంటూ మన్నించకండి. హరిణి అనండి."

"అయితే ఒక షరతు. నువ్వూ మీరనకూడదు."

"అది నా ఇష్టం."

హరిణి నిర్భయంగా కృష్ణతో స్కూటర్ మీద ఎక్కి ఇంటికి వెళ్ళింది.

"అన్నయ్యా! వీరు..." అంటూ పరిచయం చేసింది.

"క్షమించాలి,మీ సమయం వృధాచేస్తున్నందుకు. కాని మీతో మాట్లాడాలి." వినయంగా పలికేడు కృష్ణ.

"చెప్పండేమిటో" అన్నాడు కోపాన్ని నిగ్రహించుకుంటూ. హరిణి ధోరణి అసలు నచ్చలేదు. అందులో పరాయివాడి వెనుక స్కూటరెక్కి రావడమే గాక 'తగుదునమ్మా' అంటూ తమతో సమానంగా కూర్చుంది.

"హరిణిని నేను పెళ్ళిచేసుకుంటాను."

"ఏమిటీ ?" హరిణి అన్నయ్య కళ్ళముందు లోకాలు తిరిగిపోతున్నాయి.

"నిజమా హరిణీ! అంటూ గట్టిగా అరిచేడు. అసలు విషయం వినిపించు కోకుండా కయ్యానికి దిగేడు. ప్రతి చిన్నవిషయానికి ఎంతో నిదానంగా జవాబు చెప్పేడు కృష్ణ.

"చాలు చాల్లే వెళ్ళవోయ్!" అన్నాడు చివరికి.

కృష్ణలో నిదానంతగ్గి కోపం ఎక్కువయిపోయింది. "మీతో ఎంతనిదానంగా మాట్లాడినా మీకర్థంకాదు. హరిణీ నాతో వస్తావా?"

ఈ మాట విని హరిణి అన్నయ్య అదిరిపడ్డాడు.

"పదండి నేను రెడీ" అంది హరిణి

"హరిణీ! ఆలోచించుకో! నన్ను కాదని అలాంటి పోకిరీవాళ్ళ వెంట వెళ్ళేక మళ్ళీ నా ఇంట్లోకి అడుగుపెట్టడం కలలోమాట! అదీ జన్మకి అసాధ్యం." బెదిరించేడు అన్నయ్య.

"సరే అన్నయ్యా! ఈ జన్మలో నీ ఇంటికి రావడం జరగదు." నిదానంగా జవాబు చెప్పింది.

"పద హరిణీ!" కృష్ణ మార్దవంగా అన్నాడు.

"వెళ్ళు! కాని ఈ ఇంటి చీపురుపుల్ల కూడా ఆశించకు" అంటూ సింహఘర్జన చేసేడు.

కృష్ణ పగలబడి నవ్వి "థాంక్స్! మీ ఇంటి లక్ష్మినే నా కిచ్చేరు. మరింకేం కావాలి మాకు" అన్నాడు.

కన్నీటితో కృష్ణ వెనక వచ్చేసింది హరిణి.

* * *

ఆ తర్వాత—

వినయ్, వసంతా, మదికొందరి సన్నిహితుల సమక్షంలో జరిగిపోయింది వివాహం.

అర్థాంతరంగా అనుకోకుండా కృష్ణ తండ్రి వ్యాపారంలో నష్టపోవడం, అంత జరిగినా హరిణిని చేరదీయక, కృష్ణతో డబ్బు వ్యవహారాలు నడపడం అన్నీ జరిగిపోయాయి. హరిణి నిమిత్తమాత్రంగా మిగిలిపోయింది.

హరిణి రాకతో కృష్ణ జీవితం మూడు పువ్వులూ ఆరు కాయలూ అయింది.

అలాంటి సమయంలో ఆరుద్ర ఆగమనం కృష్ణతో అతని సన్నిహితం ఏదో భయం.

ఆ రాత్రి హరిణి దాదాపు జాగారం చేసింది.

హరిణి వళ్ళో తలుంచుకుని కృష్ణ ఆలోచిస్తున్నాడు.

ఇద్దరూ ఆ రాత్రి నిద్రపోలేదు.

"గుడ్‌మార్నింగ్" అన్నాడు చిలిపిగా.

"ఏం? ఏమిటి ప్రత్యేకత?" అంది కొంటెగా.

"ఏమోనమ్మా! నీవొక అల్లరిదానివి. నీకే తెలియాలి."

అతని ముఖంలోకి చూసి 'తెలియదు' అన్నట్లు తలతిప్పింది. పెద్ద పందిరిమంచం, ఫోం పరుపులూ, లేత నీలి దిళ్ళు గుండెలదాకా లేత నీలి దుప్పటి ప్పుకుని పడుకుని ఉంది హరిణి. బెంగాల్ కాటన్‌చీరా, నుదుట సింధూరతిలకం, కళ్ళనిండారా కాటుక, మెడలో పొడవయిన ముత్యాలహారం ఒక పక్కకి వరిగి పోయిన జంట మంగళ సూత్రాలూ సాంప్రదాయాల ప్రతీకలా ఉంది.

అతనలా పరీక్షగా చూస్తూండే నవ్వింది హరిణి.

ఆ నవ్వులో పున్నమి వెన్నెలల తళతళలు కన్పించేయి

కృష్ణ కళ్ళకి కొత్త హరిణి కన్పించింది.

సమ్మోహితుడిని చేసే సత్యభామ కన్పించింది.

"నేనెంతో అదృష్టవంతుడిని కదూ హరిణీ?"

జవాబీయలేదు హరిణి.

"నీకోసమే పుట్టి నిన్ను వెతుక్కుంటూ వచ్చేనోయ్! నీ సన్నిధానంలో జీవితం..." అంటున్న నోరు మూసింది తన రెండుచేతులతో. "ఉదయమే ఏం మాటలండీ అర్థంలేకుండా. మనిద్దరం అదృష్టవంతులమే" అంది చిరుకోపంగా బాలభాను దుదయించేడు. తెలవారిపోయింది.

*　　　*　　　*

"హలో" అంటూ ఎదురుగా వచ్చింది హరిణి,డాక్టర్ మోహన్, మనోరమా రావడం గమనించి.

"ఇంట్లోనే ఉన్నారా ?" అంటూ పరీక్షగా ఆమెనే గమనించసాగాడు. తెల్లటి పాలనురుగులాంటి జపాన్ జార్జెట్ చీరా, నల్లటి జాకెట్ వేసుకుంది. పొడవాటి జడనిండా కనకాంబరాలు ధరించింది. లతలా నాజూగ్గా ఉంది.

"బావుంది మీ జోక్ నా ఇంట్లో నేనుండక" అంది నవ్వుతూ హరిణి.

"నమస్కారం, మనోరమా! రండి లోపలికి" అంది హరిణి.

"నమస్కారం!" పొడిగా అంది మనోరమ

"మీ కభ్యంతరం లేకపోతే మీ తోటలో కూర్చుందాం" అన్నాడు.

"మీ మనోరమగారేం మాట్లాడంలేదు." హరిణి అంది.

"ఆవిడకి మాటలు రావు."

మనోరమ కోపంగా మోహన్‌ని చూసింది.

"రండి తోట చూద్దాం" అంటూ తీసికెళ్ళింది హరిణి.

వారిద్దరూ ఆమె ననుసరించేరు.

"మీకు మంచి టేస్టే ఉంది. ఈ తోట చూస్తూంటే మతిపోతోంది" అన్నాడు మోహన్.

ముచ్చటగా నవ్వి, "నిజం ఈ తోటా - ఈ పూలూ నా కెంతో ఇష్టం" అంది హరిణి.

గులాబీలు, కనకాంబరాలూ, చామంతులూ, మల్లెలూ, నైట్‌క్వీన్ పీటన్నింటికి మధ్య ఆకుపచ్చటి పొడవాటి ఆకులూ, ఎర్రటి గుత్తులతో ఉన్న పూలచెట్టు చూపించి "ఇదేం చెట్టు" అన్నాడు.

"మన్మథబాణాలు "అంది.

ఆశ్చర్యంగా చూసేడు.

"ఆదేమిటి" అన్నాడు మరో క్రీపర్ చూపించి.

"రాధామనోహరం" అంది.

"మరి ఆ తీగా" అన్నాడు.

"మాలతీలత" అంది. "ఇదేం చెట్టూ" అన్నాడు.

"కరవీరలు" అంది నవ్వుతూ.

"ఇవన్నీ మీరు పెట్టిన పేర్లా?" తమాషాగా అన్నాడు.

పగలబడి నవ్వి "కాదండీ, అవి వాటి నామధేయాలే" అంది. రంగురంగుల గులాబీలు, మరువం, దవనం, వీటితోపాటు గడ్డిపువ్వులూ నందనవనంలా ఉందాతోట.

"రండి లోపలికి పోదాం"! అంటూ ఇంట్లోకి తీసికెళ్ళింది. హరిణితో తర్వాత సాహిత్యంమీద దిగింది చర్చ ఆమె చదివిన సాహిత్యం గురించి విన్నాక మోహన్‌కి తల తిరిగినట్లయింది

మనోరమ మౌనంగా వింటుంది. హరిణిమీద రాగమూ లేదు, ద్వేషమూ లేదు. వాస్తవానికి ఎలాంటి అభిప్రాయమూ లేదు. చిరునవ్వులతో అందరినీ పలుకరించే ఆమె తీరు మనోరమకి నచ్చుతుంది.

"హలో డాక్టర్" అంటూ కృష్ణ లోపలికి వచ్చేడు.

"నమస్కారం! మిసెస్ మనోరమా సారీ, అయాం లేట్" అన్నాడు.

"మేం వచ్చి గంట దాటింది" అన్నాడు మోహన్.

"మీరు చాలా లక్కీ" అన్నాడు డాక్టర్ మోహన్.

"ఎందుకో ? " అమాయకంగా అడిగేడు కృష్ణ.

"ఇల్లు చూసి ఇల్లాలిని చూడమంటారు. ఇల్లూ-ఇల్లాలు ఇంటా-బయటా మీ కీర్తి ఆసూయ కలిగిస్తోంది."

"మరీ పొగడకండి డాక్టరుగారూ! నేనొక సామాన్య మానవుడిని. నాలో ఏ కాస్త అయినా మీరు అనే ప్రతిభ వుంటే అది కృష్ణగారి ప్రభావం. వజ్రానికి అయినా సాన పట్టాలి. చిన్న సవరణ. నేను వజ్రాన్నికూడా కాదు. మామూలు గాజురాయిని" అంది ఆవేశంగా హరిణి

"సారీ! మా హరిణికి తొందరపాటు ఎక్కువ" అని, "వీరికి కాఫీలవీ ఏమయినా ఇచ్చేవా? రావడంతోనే వాదనలకి దిగేవా?" హరిణివంక చూసి అడిగేడు కృష్ణ.

"అరే!" అంటూ లోపలికి పరుగుపెట్టింది.

"ఇవాళ హరిణిగారి పాట వినాలి." మోహన్ తన కోరిక వెలిబుచ్చేడు.

"తప్పకుండా! కాని ఆమె సంగతేమిటోగాని నేను పాడి వినిపిస్తాను." కృష్ణ మాటిచ్చేడు.

హరిణి ముందూ, నాయర్ వెనుకా కాఫీ, స్నాక్స్‌తో వచ్చేరు. స్వయంగా హరిణి అందించింది.

కాఫీ తాగుతూ మామూలు కబుర్లు చెప్పకున్నారు.

"చిన్న ఎనౌన్స్‌మెంట్ రాత్రికి డిన్నర్ మీకిక్కడే" అంది హరిణి ప్రసన్నంగా.

"ఒక షరతుమీద, అన్నాడు మోహన్.

"ఏమిటి ?"

"మీరు పాట పాడతానంటే మేం భోజనం చేస్తాం."

నవ్వి "అంతేనా, తప్పకుండా!" అంది.

కాఫీలయ్యాక "నాయర్ ! వీణ తీసుకురా!" అంది హరిణి.

నాయర్ వీణ వెంటనే తెచ్చేడు.

మోహన్‌వంక ఒకసారిచూసి "ఎంతవారలయినా కాంత దాసులే" అంటూ ఆరంభించింది హరిణి.

తర్వాత హరిణీ, కృష్ణా కలిసి కొన్ని పాటలు పాడేరు.

"మీరు అష్టపదులు బాగా పాడతారు అంది" హరిణి.

"ప్లీజ్!" అన్నాడు మోహన్.

కాని హరిణి ఆశించిన 'లలిత లవంగలతా' కాకుండా మరో అష్టపది పాడేడు. ముభావంగా ఉండిపోయిన మనోరమ ఏ భావమూ వ్యక్తంచేయలేకండా ఉండలేకపోయింది. చాలా బాగా పాడారనే కాంప్లిమెంట్ చేసింది హరిణివంక చూస్తూ.

"మీ అభిమానం" అంది హరిణి. ఆ తరువాత డిన్నర్ ముగియగానే సెలవు తీసుకుని వెళ్ళిపోయారా దంపతులు.

వెళ్ళబోతూ వెనక్కు చూసేడు మోహన్. హరిణీ చూసింది. నాలుగు కళ్ళూ క్షణంలో సగం కలిసి విడిపోయాయి.

"థాంక్స్ మిసెస్ హరిణీ!" కృష్ణ అన్నాడు లోపలికి రాగానే.

"ఎందుకూ ?" అంది వింతగా హరిణి.

"మనిషివి మారేవ్. నలుగురిలో కలిసి తిరగడం, మర్యాద మన్ననలు చేయడం నేర్చుకున్నావ్."

"థాంక్స్ " వ్యంగ్యంగా అంది హరిణి

* * *

"వెళ్ళక తప్పదా ?" జాలిగా చూసింది హరిణి కృష్ణవంక.

"వెళ్ళి తీరాలి."

"నే వెళ్ళకపోతే" అంది అహంతో.

"బలవంతంగా పంపించవలసి వస్తుంది." అంతకన్నా గట్టిగా అన్నాడు కృష్ణ.

"ఏమిటి నీ అధికారం" అంది కోపంగా హరిణి.

"నేనూ అదే అడగాలనుకుంటున్నాను. ఏమిటి నీ అహంకారం ?"

"నా అహంకార మేమిటో తెలియదా నీకు ? తెలియచెప్పమంటావా ?

"హరిణీ! రెచ్చగొట్టకు. వెళ్ళితీరాలి. అక్కడికి చాలామంది పెద్ద పెద్దవాళ్ళు వస్తున్నారు. వేళాకోళాల కిది సమయంకాదు. ఇది నా ఆర్డర్" అంటూ ఆ గదిలోంచి వెళ్ళిపోయేడు.

"హరిణీ ఎంటర్ప్రైజస్!" కసిగా మనసులో తిట్టుకుంటూ డ్రస్ వేసుకోసాగింది.

సరిగ్గా సమయానికి ఆరుద్ర వచ్చేడు క్షణంసేపలా కన్నార్పకుండా హరిణి వంక చూసేడు. గమనించనట్లుగా చేసింది హరిణి.

"మీరు రెడీ కదా మిసెస్ హరిణీ!" అన్నాడు.

"యస్" అంది.

"పదండి అయితే."

"నడవండి."

"వెళ్ళొస్తానని కృష్ణతో చెప్పి వయ్యారంగా హేండ్‌బేగ్ చేతికి తగిలించుకుని ఆరుద్రవెంట నడిచింది. కారులో ఆరుద్ర పక్కనే కూర్చొంది. నెమ్మదిగా కారు నడుపుతున్నాడు ఆరుద్ర.

కలలో ఒకనాటి చెలి వాస్తవికంగా నేటికి చేతికందేంత దగ్గరగా ఉంది. వ్యాపారంలోనే పార్ట్‌నర్. అలాంటి ఇలాంటి అమ్మాయికాదు. కేవలం అంద చందాలేకాదు. తన వాక్చాతుర్యంలో కూడా. వ్యాపారంలో తనతో సమ ఉజ్జీ. ఒకరకంగా గర్వం, మరొక రకంగా అసూయా, మరో రకంగా అంత ఆనమబాటులో ఉన్న హరిణిని నలిపి నాశనం చేయాలనే పగ! కాని తాను నేటికీ చేతగాని అసమర్థుడై పోతున్నాడెందుకో!

"వెల్‌కమ్ టు మిసెస్ హరిణీ, మిస్టర్ ఆరుద్రా" అని స్వాగతమిస్తూ, "వీరిదే హారిణీ ఎంటర్‌ప్రైజస్" అంటూ వేరెవరికో పరిచయం చేసేడొక యువకుడు.

"గ్లాడ్ టు మీట్ యు" అంటూ నమస్కారం చేసేడు మరో పెద్దమనిషి.

"హరిణి! నీ కెంత అయిష్టంగా ఉన్నా ఎంత నీ మనసు ఎదిరించినా సభ్య సమాజంలో ఆధునిక యువతిగా నటించాలి గాని నలుగురిలో తేలిపోకూడదు. అది మనకే నష్టం." గంభీరంగా ఎవరికీ విన్పించనంత మెల్లిగా పలికేడు ఆరుద్ర.

అదోరకంగా అతన్ని ఒక చూపు చూసి సడన్‌గా వచ్చి దాదాపు అనుకుని నిలబడింది. ఆ క్షణంలో ఆ జంట చూసినవాళ్ళకి నయనానందకరంగా కన్పించింది.

కాన్ఫరెన్స్ కొనసాగింది. "హరిణీ ఎంటర్‌ప్రైజస్" తరపున అంటూ తన ఉపన్యాసం కొనసాగించింది హరిణి. సలహాలు, సహకారాలూ, లేకుండానే తన కందనంతగా ఎదిగిపోయిందీ అమ్మాయి! అని ఆరుద్ర ఆశ్చర్యపోయాడు. మంత్రముగ్ధులయి మరీ విన్నారు శ్రోతలు. అందరూ మగవాళ్ళే. మహా అయితే పర్సనల్ అసిస్టెంట్స్‌గా వచ్చిన ఏ యిద్దరు స్త్రీలో మినహాయించి.

చివరికి సాగనంపడానికి కారుదాకా వచ్చిన వ్యక్తుల్లో "ఒకతను మిస్టర్ ఆరుద్రా! మీ మిసెస్‌ని అభినందించలేకుండా ఉండలేకపోతున్నాను. పరోక్షంగా మీ సహకారమే ఆమెకి పరిపూర్ణత నిచ్చిందని నా అభిప్రాయం" అన్నాడు. ఆరుద్ర సమాధానమిచ్చేలోగా "థాంక్స్ యూ ఆర్ పర్‌ఫెక్ట్‌లీ కరెక్ట్" అని నమస్కారంచేసి పదండి, అంది ఆరుద్రని చూస్తూ.

కారు సగం దూరం వెళ్ళేక "అదేమిటి హరిణీ అలా అనేసేవ్ ?" అన్నాడు. తళుక్కుమంది పలువరస. "అందులో తప్పేముంది! పరోక్షంగా నా భర్త సహకారాన్ని అతనభినందించేడు. అన్నది వారినేకదా ?"

వళ్ళు మండిపోయింది ఆరుద్రకి. "అతనికి నీ భర్త కృష్ణ అనీ, నీవతని అర్ధాంగివనీ తెలియదు మేడమ్."

"పోనీ! నీకు తెలుసుకదా ?" చురుగా అంది. షాక్ తగిలినట్లయింది ఆరుద్రకి. కాని ఆమె పొగరుకి తగిన జవాబీయాలని "వాళ్ళు మనిద్దరినీ భార్యాభర్త లనుకుంటున్నారు" అన్నాడు.

"బెంగలేదు."

చెంపపెట్టులా తగిలిందామాట ఆరుద్రకి.

"ఛీ నువ్వాటదానివేనా ?"

"నువ్వొక మగవాడివేనా ? అది ఆలోచించుకో ముందు. దానికి తగిన జవాబు గనుక నీ దగ్గిర ఉంటే, తప్పక నా విషయం నీ కర్థమవుతుంది. ఒకనాటి పంతానికి ఈ వాడు రివెంజ్ తీసుకుందామని నీ చదరంగపుఎత్తులు ఎత్తేవ్. గ్రహించుకోలేని అమాయకురాలిని, అవివేకురాలినీ కాను సుమా అని నీకు తెలియపర్చడం కోసం నీతో సై అన్నాను. లాభనష్టాలు వ్యాపారంలోనే కాదు, జీవితంలో కూడా బేరీజు వేద్దామని సరదా కలిగింది. అవి ఏ నిష్పత్తిలో ఉన్నాయో కాలాని కొదిలేద్దాం" అంది.

"ఆరుద్రా, కారొకసారి ఇక్కడ ఆపండి నేనిక్కడ దిగాలి. తర్వాత వస్తాను" అంది.

అయిష్టంగా కారాపాడు.

దిగి డోర్ వేసి "థాంక్స్, సీ యూ," అంటూ వెళ్ళిపోయింది.

* * *

షాప్‌లోంచి డాక్టర్ మోహన్‌కి టెలిఫోన్ చేసింది హరిణి.

"హలో ఎవరు మాట్లాడేది ? నేను డాక్టర్ మోహన్."

"నమస్తే డాక్టర్ ! నేను హరిణిని. పదిహేను నిమిషాల్లో నేను మీ హాస్పిటల్‌కి వస్తున్నాను" అంటూ ఫోన్ పెట్టేసింది.

అయిదారుగురు పేషెంట్లని తొందరగా పంపించేసి, కన్సల్టింగ్ రూమ్‌లో హరిణి కోసం ఎదురుచూస్తున్నాడు డాక్టర్ మోహన్.

టాక్సీలో హరిణి రావడం కిటికీలోంచి చూసి కన్సల్టింగ్ రూమ్‌లోంచి బయటికి వచ్చి "వెల్‌కమ్ మేడమ్" అన్నాడు. మోహన్.

జవాబుగా నవ్వి, అతని వెనుక నడిచింది.

"పేషెంట్సుని వెయిట్ చేయమను" అని నర్స్‌తో చెప్పి, డోర్ దగ్గిరగా వేసి తన కుర్చీలో కూర్చున్నాడు మోహన్.

ఎదురుగా హరిణి పొందికగా కూర్చుంది. ఆడంబరంగా అలంకరించుకున్నా ముఖంలో అలసట బాగా కన్పిస్తోంది.

పరిశీలనగా నిశ్శంకోచంగా మోహన్ కళ్ళు ఆమె పరీక్షిస్తున్నాయి.

వర్షం సన్నగా ఆరంభమయి జోరెక్కువ అయిపోయింది

"ప్లీజింగ్ వెదర్" కదూ ? అన్నాడు నిశ్శబ్దంగా కూర్చున్న హరిణితో.

"నా గుండెల్లో మంటలు చెలరేగుతున్నాయి డాక్టర్" అంది.

"అరే !" అంటూ కుర్చీలోంచి లేచి, ఆమె నుదుటిమీద చేయివేసి వేడిగా ఉంది. 'ఇరిటేట్' అవకండి, నే మందులు రాసిస్తా" అన్నాడు.

"నా మనసు ప్రశాంతంగా ఉండడానికి, నా ఆలోచనలు తగ్గడానికి మందు ఏదయినా కావాలి డాక్టర్ !" జాలిగా అంది.

తలొంచుకుని ప్రిస్కిృప్షన్ రాస్తూ ఒకసారామె ముఖంలోకి చూస్తూ మళ్ళీ రాయడంలో మునిగిపోయాడు .

"మేడమ్ ! విత్ యువర్ పర్మిషన్ ఆ నాలుగు కేసులూ చూసి నేనూ మీతో వస్తాను" అన్నాడు.

"అలాగే" అంది.

ఆమె లేచి అవతలికి వెళ్ళబోతూంటే. "నో నో ! మీ రవతలికి వెళ్ళవలసిన అవసరంలేదు. కూర్చోండలా !" అంటూ కేసులు చూడ్డంలో మునిగిపొయాడు.

హరిణి మనసులో— ఆకాశపు నీలం, అందునా హరివిల్లూ - వర్షం కురిసి వెలిసింది. మేఘాల్లో అందాల హరివిల్లు సప్తవర్ణాల్లో కనిపిస్తోంది. అంటే తన జీవితంలో ఈ చీదర వదిలి మళ్ళీ ప్రశాంతత వస్తుందా ! ఆలోచిస్తూన్నకొద్దీ గజిబిజిగా ఉంది. జీవితాన్ని ఈ రకంగా భరించడం కష్టంగా ఉంది.

"మిసెస్ హరిణీ!" వెనుకనుంచి భుజం తట్టి, "లేవండి పోదాం!"అన్నాడు మోహన్.

లేచి నిలబడింది. "ఇప్పుడెలా ఉంది ?" అన్నాడు.

"అలాగే ఉంది."

"జీవితం అన్నాక ఎన్నో భరించాలి. ఇలాంటి ప్రతి చిన్నవిషయమూ సీరియస్‌గా తీసుకని రియాక్ట్ అవడం మొదలుపెడితే అయినట్టే" అన్నాడు.

ఆమె తల ఎత్తి అతని ముఖంలోకి చూసింది.

ఆమె కర్థమవని భావం అతని ముఖంలో గోచరిస్తోంది.

నీరసంగా బయటికి నడిచింది. నర్స్, బాయ్, వీళ్ల సహకారంతో డిస్పెన్సరీ తలుపులు శ్రద్ధగా వేయించి 'గుడ్‌నైట్' వాళ్ళకి చెప్పి కారుదగ్గిరకి వచ్చేడు.

ఫ్రంట్ డోర్ తెరిచి 'కూర్చోండి' అని తను అటునుంచి స్టీరింగ్‌వీల్ దగ్గిరికి వచ్చేడు.

"మీ మందులివిగో, ఎలా వేసుకోవాలో ప్రిస్క్రిప్షన్ పేపర్‌మీద రాసాను. శ్రద్ధగా వేసుకోండి. మందుల విషయంలో అశ్రద్ధ చేసే పేషెంట్‌తో మరోసారి నేనెన్నడూ డీల్ చేయలేదు" అంటూ మందుల పేకెట్ అందించేడు.




"థాంక్స్" అంటూ అందుకుని హేండ్ బ్యాగ్‌లో వేసుకుంది.

"డాక్టర్! మీ బిల్" అనబోయిన ఆమె పెదవుల కదలికని అర్థంచేసుకుని

"మిసెస్! కృష్ణగారూ, కృష్ణ నా ప్రాణ స్నేహితుడు మీ రతని భార్య, మన మధ్య డబ్బు ప్రసక్తి అనవసరం. అదేదో నేనూ కృష్ణా చూసుకుంటాం. నే డబ్బుకోసం అందునా మీరిచ్చే డబ్బుకోసం వైద్యం చేస్తున్నానని మీ రనుకుంటే మరో డాక్టర్‌ని చూసుకోవచ్చుగా? ఈసారి అతని కంఠంలో తీవ్రత ఎక్కువగా ధ్వనించింది.

"సారీ!" అంది తలొంచుకుని.

"అయాం సారీ! అతి చనువుతో మందలించాను. మీ రనవసరంగా మనసు పాడుచేసుకోనని ప్రామిస్ చేయాలి."

"ప్రామిస్ చేస్తాను ప్రయత్నిస్తానని" అంది.

వర్షించిన మేఘాలు మటుమాయమైపోయి నక్షత్ర సమూహం, అందాల జాబిలీ వచ్చేయి. స్వచ్ఛందమయిన వెన్నెలలో హారిణి ముఖం జాలి కలిగించేట్టుగా దిగాలుగా ఉంది. హరిణి ఇంటిముందు కారాపాడు.

"నేను లోపలికి రావడం మీ అనుమతితోనే" అన్నాడు దిగకుండానే.

"వద్దులెండి, రాత్రి పది కావస్తోంది. ఇంట్లో మనోరమగారు మీకోసం వెయిట్ చేస్తూంటారు." అర్థవంతంగా జవాబిచ్చి కారుదిగి డోర్‌వేసి గుడ్‌నైట్ చెప్పేసి లోపలికి వెళ్ళిపోయింది.

'గుడ్‌నైట్' అనేసి వెళ్ళిపోయాడు మోహన్.

కారిడర్ దగ్గిర నిలబడి ఆమెకోసం నిరీక్షిస్తున్న కృష్ణ, "ఎక్కడికి వెళ్ళిపోయావ్ హరీ ? కనీసం ఫోనయినా చెయ్యాల్సింది ఆప్సుద ఆరింటికే వెళ్ళిపోయాడు నీ వెక్కడికి వెళ్ళావో తెలియదు అంటాడు. ఇక వసంత దగ్గిరకి రావాలనుకుంటున్నాను" అన్నాడు కంగారుగా.

"రాకల్సింది" ఏ భావమూ వ్యక్తపర్చకుండా అతన్ని దాటుకుని లోపలికి వెళ్ళిపోయింది.

అచేతనంగా ఆమెని చూస్తూండిపోయాడు కృష్ణ.

*　　　*　　　*

పశ్చిమాద్రిన సూర్యుడు మెల్లి మెల్లిగా వెళ్ళిపోతూన్నాడు. సంధ్యాకాంతులు ఏ చిత్రకారుడి కుంచెకి అందని విధంలో మెరుస్తూ, మారిపోతున్నాయి.

నైట్‌క్వీన్ సువాసనలు గుబాళిస్తున్నాయి. మన్మధబాణాల చెట్టుదగ్గిరగా కుర్చీల్లో కృష్ణా, హరిణీ కూర్చున్నారు. హరిణి చేతిలో నవల. ఆలోచనలు మరెక్కడో !

చూపులు అస్తమిస్తున్న సూర్యుని వంక.

కృష్ణ చేతిలో డైరి. ఆ చిరుచీకట్లలో తదేకంగా రాసుకుంటున్నాడు. చాలా సేపలా గడిచిపోయింది. పూర్తిగా చీకట్లు అలుముకున్నాయి. డైరీ మూసేసి, పెన్ జేబులో పెట్టుకుని "హరీ" అన్నాడు కృష్ణ.

"ఏమిటాలోచిస్తున్నావ్ ?"

గమ్మత్తుగా అతన్ని చూసింది. వెంటనే సమాధాన మీయలేక కాసేపటికి "మీగురించే" అంది.

"నాగురించా ?"

"అవును! మనం విచిత్రంగా కలుసుకోవడం. ఆ తర్వాత ఆ పరిచయం జీవితంలో శాశ్వతమయిన బంధమైపోవడం, చివరికి అనుకోని విధంగా మలుపు తిరిగి, మనం ఒకరికొకరం చేరువకావడానికి బదులు దూరమైపోవడం నానాటికీ అంతా అయోమయంగా ఉంది"

కాస్త తడబడుతూ, సర్దుకుని మళ్ళీ ఎటువంటి జవాబు చెప్పలేనివాడిలా హరిణి వంక చూస్తూండిపోయాడు.

అతనినుంచి జవాబు నాశించిన హరిణి స్థాణువైపోయింది. హరిణి కళ్ళల్లో నీరు తిరిగింది అతన్నించి హరిణీ అనే రాగరాజితమయిన పిలుపూ-ఓదార్పూ

నాశించింది. కాని అవే కరువైపోయాయి. నిజంగా కృష్ణ మారిపోయాడా అన్న ప్రశ్న పిచ్చిదాన్ని చేస్తోంది.

హరిణికి ఆకస్మికంగా తొలినాటి కృష్ణ జ్ఞాపకంవచ్చేడు. అనుక్షణం ఆ జ్ఞాపకాలు పిచ్చెక్కించేస్తున్నాయి.

అసలు ఎందుకిలా జరిగింది? తను జీవితంలో కోరుకున్నదేమిటి? చివరికి తనకి లభించిన దేమిటి? ఏనాటికి తన ఆరాటం తీరి, తిరిగి తన జీవితంలో శాంతి కలుగుతుంది? కన్యగా, నవవధువుగా, గృహిణిగా, కృష్ణ బిడ్డల తల్లిగా తను కలగన్న జీవితం 'కల' గానే మిగిలిపోతుందా?

తనే రాజీపడి గతంలో ప్రమేయంలేకుండా అమాంతం అతన్ని వాటేసుకుని 'కృష్ణా ఇదివరకులాగా ఉందాం' అనాలనే కోరికని అతి బలవంతాన నిగ్రహించుకుని ఒకసారి అతన్ని చూసింది. కృష్ణ తనకేం పట్టనట్లు ఆలోచనల్లో ఉన్నాడు. ఎదురుగా ఇద్దరూ చాలా కాలానికి కూర్చున్నారు. తీరికా, ఏకాంతం ఉన్నాయి. మనుషులు ఎంత చేరువుగా ఉన్నారో మనసులంత దూరంగా ఉన్నాయి.

ఇద్దరూ అలాగే అర్థంలేని ఆలోచనల్లో పడ్డారు.

వాస్తవానికి ఇద్దరూ ఒకలాగే ఆలోచిస్తున్నారు.

కారాగిన శబ్దానికి వాకిట్లోకి చూసింది. ఆరుద్ర వస్తున్నాడు.

హరిణి గబుక్కున లేచి లోపలికి వెళ్ళబోయింది.

"హరీ" అంటూ ఏదో చెప్పబోతున్న కృష్ణవంకయినా చూడకుండా గబగబా నడిచి వెళ్ళిపోయింది.

అలా ఆమె వెళ్ళిపోతూంటే, ఆమెనే చూస్తూండిపోయాడు కృష్ణ.

ఆ తోటా, ఆ పరిసరాలూ, అంతా పిచ్చి పిచ్చిగా కన్పించసాగాయి.

హరిణి దగ్గరకు వెళ్లి కూర్చోవాలనిపించింది.

"హలో" ఆరుద్ర విష్‌చేస్తూ వచ్చి కూర్చున్నాడు.

"హలో" బలవంతంగా నవ్వాడు.

వ్యాపారంతో మొదలయిన సంభాషణ రకరకాలయిన విషయాల్లో మళ్లింది. పైకి సభ్యతకోసం మాట్లాడుతున్నా, ఆరుద్ర మనసు హరిణిమీద ఉంది. తను లోపలికి వస్తూండగా ఆమె తన గదిలోకి వెళ్ళిపోతూ కన్పించింది.

"హరిణిగారు లేరా?" ఆగలేక అడిగాడు.

"ఉంది, రండి లోపలికి" అంటూ లోపలికి తీసుకు వెళ్ళాడు.

సోఫాలో వెనకు వాలి పడుకున్ని ఉంది, హరిణి.

"హలో! వంట్లో బాగాలేదా డల్‌గా ఉన్నారు?" అన్నాడు ఆరుద్ర.

"ఏంలేదే! అయాం ఆల్‌రైట్" అంది.

నిశ్శబ్దమయిన ఆ వాతావరణంలో ఆ ముగ్గురిలోనూ ఏవేవో ఆలోచనలు. ఆరుద్రకి తొలినాటి హరిణి గుర్తు వచ్చింది. ఆనాటికీ ఈనాటికీ ఎంత మార్పు!

గర్వంతో పాటు అలవికాని ఆనందంతో కూడిన నవ్వుని పెదిమల మాటున నొక్కిపట్టేడు.

హరిణి ముఖంమీద గబగబా మారే రంగులు చూసిన ఆరుద్ర చలించి పోయాడు. ఆమెనింకా బాధించదలచుకోలేదు. లేచి నిలబడి "ఇక వెళ్లాలి! చాలా సేపయింది వచ్చి. థాంక్స్ ఫర్‌ది నైస్ ఈవినింగ్" అన్నాడు.

అసహనంగా అతన్ని చూసింది హరిణి

చికాకుతో బరువెక్కిపోయిన మనసుతో మరింత మతిపోయింది, హరిణికి, ఏకాంతం భరించ శక్యం కాకండా ఉంది. మార్గం ఏమిటి? అనే ఆలోచనలో పడింది.

* * *

అగ్నిపర్వతాలను తనలోనే దాచుకుని స్వచ్ఛందంగా నవ్వే పారిజాతంలాగే గువ్వలా ముడుచుకుని పడుకుని ఉంది హరిణి.

తెల్లటి జపాన్ జార్జెట్ చీరా, చీరమీద కెంపురంగు గులాబీలూ, వాలు జడలో కనకాంబరాలూ, దేవకన్యలా ఉంది. 'హరిణి మీద సర్వాధికారాలు నావే' అనుకున్న కృష్ణ మనసు విజయగర్వంతో నాట్యంచేసింది.

ఉన్నట్టుండి హరిణి "అమ్మా!" అంటూ బాధగా అరిచింది.

"హరీ! హరీ!" భుజంతట్టి పిలిచేడు.

నరకయాతన అనుభవిస్తోంది. కళ్ళు తెరవలేకపోతోంది.

సడన్‌గా ఆలోచన వచ్చి డాక్టర్ మోహన్‌కి ఫోన్‌చేసి విషయం చెప్పి జవాబుకోసమయినా ఎదురుచూడకుండా ఫోన్ పెట్టేసాడు.

అయిదు నిమిషాలకి మోహన్ కారు కృష్ణ ఇంటిముందాగింది. ఆమెని చూస్తూనే షాక్ తగిలినట్లయింది మోహన్‌కి. వెంట వెంటనే అయిదారు ఇంజ క్షన్లు చేసి, ఫోన్‌దగ్గిరకి వెళ్ళి మరో డాక్టర్‌ని అర్జంటుగా రమ్మని ఎడ్రసిచ్చి హరిణి దగ్గిరకి వచ్చాడు.

"అసలేమయింది డాక్టర్ హరిణికి?" ఆదుర్దాగా అడిగాడు కృష్ణ.

"మీకు తెలియదా ? ఇటీస్ ఎకేస్ ఆఫ్ సూసైడ్. ఏవో స్లీపింగ్‌పిల్స్ మింగింది." కోపంగా పలికాడు.

మరో ఇరవై నిమిషాలకి డాక్టర్ విజయ వచ్చింది. ఆమె సహకారంతో హరిణిని ఈ లోకంలోకి తీసుకుని రావడానికి రెండు గంటలు పట్టింది మోహన్‌కి.

బయటికి వచ్చాక, "చాలా లక్కీ మోహన్ ! మళ్ళీ అవసరం ఉంటే ఫోన్ చేయండి, వస్తా" నంటూ వెళ్ళిపోయింది విజయ.

"కృష్ణగారూ! ఇక నో డేంజర్! కొన్ని మందులు రాస్తాను. అవి తొందరగా తెప్పించండి" అంటూ రాయసాగాడు మోహన్.

"ప్లీజ్ ! మీ రిక్కడే ఉండండి. ఆవిడకి తెలివివచ్చేవరకూ! నాకేదో భయంగా ఉంది" అర్థించాడు కృష్ణ.

"తప్పకుండా ఉంటాను. మీరంత సెంటిమెంటల్‌గా అవొద్దు. ముందు మందులు నాయర్‌ని తెమ్మనండి" అన్నాడు.

"అలాగే" నంటూ నాయర్‌ని పంపించాడు.

"మెడికో లీగల్ కేసులూ, గొడవలూ లేకుండా బయటపడ్డాం. మీరు వెంటనే ఫోన్ చేయడం చాలా మంచిదయింది" అన్నాడు మోహన్.

అరగంట దాటింది. "ఒకసారి హరిణిని చూడండి" అని కృష్ణ అన్నాక మోహన్ ఆమె దగ్గిరగా వెళ్ళేడు.

"హరిణీ !" అని తట్టి పిలిచేడు మోహన్.

బలవంతంగా కళ్లు తెరిచి మళ్ళీ మూసుకుంది.

క్షణంసేపలా చూసి, బాగా అలసిపోయి పడుకుంది. అలాగే విశ్రాంతిగా ఉండనీయడమే మంచిదనిపించింది.

గదిలోంచి బయటికి వచ్చేసి "చూడండీ, నేనూ, డాక్టర్ విజయా కూడా కలిసి ఈమెకి శాయశక్తులా వైద్యంచేసి మామూలు హరిణిగా మీకప్పగిస్తాము. మీరిలా బెంబేలుపడి ఆవిడకి కనిపిస్తే ఆమె మరింత కంగారుపడవచ్చును. ధైర్యంగా ఉండాలి. ఏదయినా మళ్ళీ అవసరమనిపిస్తే ఫోన్ చేయండి, తప్పక వస్తాను" అంటూ వీధిలోకి నడిచాడు.

వెంట తనూ వస్తూ, ఏదో అనబోతూంటే "కృష్ణగారూ ! ఆవిడని కొద్ది రోజులనుంచి గమనిస్తూనే ఉన్నాను. ఏదో మానసిక సంఘర్షణ ఆవిడలో చెలరేగుతుంది. అసలే ఆవిడది సున్నిత హృదయం. ఏ తాకిడికో తట్టుకోలేక

ఇలా చేసిఉంటారు. మెలకువరాగానే ఈ విషయం అసలు ఎత్తకండి. ఏమీ తెలియనట్లు ఉండండి" అనేసి కారెక్కి వెళ్ళిపోయాడు మోహన్.

హరిణి గదిలో ప్రశాంతంగా నిద్రపోతుంది. ఆమె మంచం దగ్గరగా వాలుకుర్చీ లాక్కుని కూర్చున్నాడు కృష్ణ

* * *

"కౌసల్యా సుప్రజారామా పూర్వా సంధ్యా ప్రవర్తతే" పూజామందిరం లోంచి శ్రావ్యంగా డాక్టర్ మోహన్ కంఠం విన్పిస్తోంది.

అప్పుడే నిద్రలేచి సరాసరి పూజాగదిలోకి వచ్చిన మనోరమ చాలా ఆశ్చర్యంగా చూసింది.

రాత్రి ఏదో ఫోన్‌కాల్ వచ్చిందని వెళ్ళిన మనిషి రావడమే దాదాపు ఉదయం కావస్తోంది. తను గమనిస్తూనే ఉంది. వచ్చి నిద్ర కూడా పోలేదు. అతన్ని గమనిస్తూ తనూ నిద్రపోలేదని అతనికి తెలియదు.

అతను పూజ ముగించి, డ్రస్ చేసుకుంటూంటే ఉండబట్టలేక "ఇంతకీ ఎవరండీ ఆ పేషెంట్? అంత సీరియస్ కేసా?" అంది.

"అవును సుమా! సడన్‌గా హరిణిగారికేదో సీరియస్ అయింది. చాలా కష్టంమీద ఇద్దరు డాక్టర్లం ఆమెని బ్రతికించగలిగేం."

"ఊళ్లో డాక్టర్లే కరువైనారా? ఆవిడగారికి మీరే కావాల్సివచ్చేరా? మీ ఇంట్రెస్ట్ ఏమిటిందులో? ఇంతకీ ఎలా ఉంది మీ పేషెంట్?" కోపంగా అడిగింది.

మోహన్ తెల్లబోయాడు.

"ఏమిటా చూపులు? ఆవిడగారి మీద మీ కెందు కంత అభిమానం? ఏమి టంత అనుబంధం?"

"మైడియర్ మనూ! సావధానంగా విను. ఒకొక్కరంటే ఒకొక్కరికి ఒకరకమయిన ఆకర్షణ సహజంగా కలుగుతుంది. కారణాలు అనూహ్యం రోగు లెవరయినా నాకనవసరం. డాక్టర్‌గా నా వృత్తి నేనిర్వహించాలి. ఇందాక అడిగేవ్ ఎలా ఉందామె అంటూ. నీ దయవలన బయటపడింది. నే వెళ్తున్నా. వెళ్ళితీరాలి. నీ పిచ్చిలోగా అనవసరమయిన ఆలోచనలతో నీ మనసు పాడు, చేసుకోకు. స్థిమితంగా ఉండు" అంటూ వెళ్ళిపోయాడు.

* * *

హరిణినే తదేకంగా చూస్తున్న కృష్ణ, మోహన్ రాక గమనించలేదు.

"గుడ్ మార్నింగ్" అంటూ విష్‌చేసిన మోహన్‌ని చూడగానే వాడిపోయిన కృష్ణ ముఖం వికసించింది.

"రండి ! హరిణి నొకసారి చూడండి" అన్నాడెలాగో కృష్ణ. మోహన్ హరిణి దగ్గిరగా వెళ్ళి బలవంతంగా నిద్రలేపేడు.

ఆమె ముఖం మీదికి వంగి "హరిణిగారూ ! ఇటు చూడండి" అన్నాడు.

"కృష్ణ" అంది నెమ్మదిగా.

ఒక్క ఉదుటున వచ్చి "హరీ" అన్నాడు కృష్ణ.

"మేడమ్" మెలకువ తెచ్చుకోండి అన్నాడు మోహన్.

"కృష్ణా నాకేమయింది ?" చిన్నపాపాయిలా బావురుమంది.

"ఏం లేదు! చిన్న షాక్ తగిలింది మీకు" మోహన్ జవాబిచ్చేడు. చిగురాకు పెనుతుఫానులో కొట్టుకుంటున్నట్లు అయిపోతున్న హరిణిని భుజాల చుట్టూ చేతులేసి గట్టిగా పట్టుకున్నాడు కృష్ణ.

"హరిణీ మీరు అనవసరంగా చాలా నెర్వస్‌గా అవుతున్నారు. సర్దుకోవాలి," అని "నాయర్ వేడి కాఫీ ఒక కప్పు తొందరగా తీసుకురా" అన్నాడు మోహన్.

టేబ్‌లెట్ మింగించి దగ్గిరుండి కాఫీ తాగించేడు మోహన్ మళ్ళీ మూడు ఇంజక్షన్లు ఇచ్చి, "హాయిగా రెస్ట్ తీసుకోండి" అన్నాడు. మందుల ప్రభావం వలన మగతగా పడుకుంది హరిణి.

"రండి కృష్ణా, హాల్లో కూర్చుందాం. ఆమెనలా ఒంటరిగా ఉండనీయండి" అంటూ హాల్లోకి వచ్చేడు మోహన్.

"గుడ్ మార్నింగ్" అంటూ డాక్టర్ విజయ వచ్చింది.

"మార్నింగ్ విజయా ! కూర్చోండి" అన్నాడు మోహన్.

"ఆవిడ కెలా ఉంది ?"

"నౌ షి ఈజ్ ఆల్‌రైట్."

"థాంక్‌గాడ్" అంది మోహన్ వంక అభినందన పూర్వకంగా చూసి. "నాకు, ముందు చాలా భయం వేసింది విజయా ! రిస్క్ తీసుకున్నాను. నిజానికి ఆమెని నర్సింగ్‌హోమ్‌కి తీసుకెళ్ళాలనే ఆలోచనే అసలు రాలేదు. హరిణిగారినలా చూసేసరికి మతిపోయి ముందామె నెలాగయినా బ్రతికించాలనే, ఆరాటంతో నర్సింగ్‌హోమ్ మాట మరిచిపోయి మీకు ఫోన్‌చేసి కావల్సిన మందులవీ తెమ్మన్నాను. మీరూ సరిగ్గా సమయానికి వచ్చి కోపరేట్ చేసేరు. మనిద్దరం కలిసి కాయశక్తులా తంటాలుపడి ఆమెని బ్రతికించేము. అదే కావాల్సింది."

"నిజమైన డాక్టర్ మీరు" మెరిసే కళ్ళతో చూసింది విజయ.

విజయ లోపలికి వెళ్ళి హరిణిని చూసి వచ్చింది.

నాయర్ అందించిన కాఫీలు మౌనంగా తాగేరు ముగ్గురూ. విజయ వెళ్ళొస్తానని లేచి నిలబడింది. కృష్ణ కూడా నిలబడి "మీ కెలా కృతజ్ఞత చెప్పాలో అర్థం కావడంలేదు డాక్టర్ విజయా ! నా హరిణిని నాకు దక్కించేరు. ఇలా పరిచయం అయిన మన పరిచయం స్నేహంగా మారాలి. మా హరిణికి మీరు మంచి స్నేహితురాలిగా మిగలాలి" అంటూ చేతులు జోడించి నమస్కారం చేసేడు.

"తప్పకండా ! మీ కెటువంటి సమయంలోనైనా, ఎలాటి అవసరమున్నా ఫోన్ చేయండి," అని "వస్తా మోహన్" అంటూ వెళ్ళిపోయింది.

మరో గంట కూర్చుని మోహన్ కూడా వెళ్ళిపోయాడు. కృష్ణ హరిణి మంచం పక్కనే కూర్చున్నాడు. అతని మనసు బరువెక్కిపోయింది. భగవంతుడు కరుణామయుడు. హరిణి కేమయినా అయ్యుంటే ? ఆ భావనే గుండెలు పిండేసింది. మామూలుగా తన హరిణి తనతో వాదిస్తూ, అల్లరిగా మాట్లాడుతూ, సినిమాలూ, షికార్లూ తిరుగుతూ, తన గృహలక్ష్మిలా ఇంట్లో నిండుగాకలకలలాడుతూ తిరుగాడుతూంటే ఈ జన్మకి చాలు. భగవాన్ నా కదే వరమివ్వు ! నే నాడూ నిన్నేదీ అడగలేదు. నీ గురించి తలచలేదు అని ఏ నాడూ ధ్యానించని భగవానుని మనసారా కోరుకున్నాడు మౌనంగా.

* * *

సాయంత్రానికి ఆరుద్ర వచ్చేడు. చూచాయగా హరిణి విషయం తెలియగానే ఆగలేక పరుగుల్లో వచ్చేడు.

హరిణి మంచంమీద పడుకుని ఉంది. గిరగిరా తిరిగే సీలింగ్ ఫాన్‌తో పాటు ఆమె మనసూ తిరుగుతూంది. గంటలో వస్తానని కృష్ణ బయటికి వెళ్లేడు. ఈలోగా ఇతగాని ఆగమనం. ఇదివరకూ మనసులో ఏమున్నా పైకి ప్రశాంతంగా, కన్పించేది. ఆమె కళ్ళల్లో కాంతి నేడు మాయమైపోయింది.

గదిలోకి వస్తూ, ఆమెని చూస్తూ నిర్ఘాంతపోయాడు ఆరుద్ర.

"ఏం ? అలా చూస్తున్నారు ? గుర్తుపట్టలేదా ?" హరిణి పొగరుగా అంది.

"ఎందుకలా చేసేరు ? మిసెస్ హరిణీ ! జీవితంలో మీకేం లోపమని అటువంటి పనిచేసేరు ? అందునా పిచ్చిపని" ఆగలేక అడిగేడు ఆరుద్ర.

అప్పుడే నిద్రలోంచి లేచినట్లుగా, ఉలిక్కిపడి అతన్ని చూసింది ఒకసారి. ఆ చూపుల్లో తీవ్రత తెలుపకనే తెలుపుతోంది. వెను వెంటనే చిరునవ్వు నవ్వింది, విరిసిన గులాబి మొగ్గలాంటి పెదవులపై పున్నమి వెన్నెలలు వెలిగేలాగా.







"మిస్టర్ ఆరుద్రా! ఇంతకాలం ఎంతో నిగ్రహంతో ఉన్నాను. కాని గృహిణిగా, సామాన్యమయిన స్త్రీలాగా బ్రతకాల్సిన నన్ను నువ్వూ, నా భర్తా, ఎవరి అవసరాలకి ఎరగా వారు వాడుకున్నారు. అయినింటి ఆడపడుచుని సాంప్రదాయాలూ సరిహద్దులూ దాటలేక, ఇవన్నీ సహించలేక శాశ్వతంగా ముఖ్యంగా నీ కోసం ఈ లోకంనుంచి నిష్క్రమిద్దామని అనుకున్నాను."

"ఆగు హరిణీ, నేనేదో నిన్ను వంచించేనని, నా మీద నేరమారోపించే ముందు ఒక విషయం గుర్తుంచుకో. ఆ నాడు నువ్వలా నన్ను అవమానం చేసేక నీ మీద ప్రతీకారం తీసుకోవాలనుకున్నది వాస్తవం. కాని నీతో పరిచయం పెరిగిన కొలదీ, నీలో విచిత్రమయిన ఆకర్షణకి లొంగిపోయి మంచి-మర్యాదలకి లోబడి పోయాను. కాని నేనేనాడూ అసభ్యంగా, అమర్యాదగా నీతో ప్రవర్తించలేదు. ఆలోచించుకో హరిణీ!" ఆవేశంగా అన్నాడు.

"ఛీ! నువ్వు మర్యాదకి లోబడేవాడివే అయితే నీ వంటే నా కెంత అసహ్యమో తెలిసే, నా వెంటబడుతున్నావ్ కదూ?"

"హరిణీ! ఈ మాటే మరే ఆడదయినా అంటే ఏమయ్యుండేదో. నీకు అహం తప్ప మరో సుగుణంలేదు. నేనంటే కాకరకాయంత అయిష్టంగా ఉన్నా భరించు. నీ వంటే అభిమానం తప్ప మరేంలేదు దట్సాల్. హరిణీ ఈ క్షణంలో తలుచుకుంటే నిన్నేమయినా చేయగలను. నీ ఎంటర్ ప్రైజస్ లోంచి నష్టాలు చూపించి, నీ సర్వస్వమూ కోర్టుద్వారా రాబట్టుకోగలను. నిన్నూ, నీ భర్త గారినీ, ఏమయినా చేయగలను. కాని నా సంస్కారమే వేరు! అలాంటి ఊహాలు నా కెందుకో రావడంలేదు. కాని, ఈ క్షణ మనిపిస్తోంది, అందుబాటులో

ఉన్న సదవకాశం పోగొట్టుకోవడం, నా తెలివితక్కువతనానికి నిదర్శనమని. కాని కష్టం కాదు. ఆదర్శాలని అవలకి నెట్టి సంస్కారం అనే పదం మరిచిపోయి ఈ క్షణంలో నిన్నేమయినా చేయగలను తలుచుకుంటే."

"జాగ్రత్తగా మాట్లాడు." ఆవేశంగా అరిచింది.

"నువ్వు ముందు జాగ్రత్త! నిన్నేమయినా చేయగలను తెలుసా?"

"ప్లీజ్! ఆరుద్రా ఏమయినా చేసి చంపేసేయి" అంటూ లేవబోయి కింద పడిపోయింది.

భయాందోళనలతో, ఆమెని లేవనెత్తి మంచంమీద పడుకోబెట్టి "నాయర్" అంటూ కేకేసేడు.

నాయర్ వచ్చేడు.

"అమ్మగారిని చూస్తూండు, డాక్టర్ని తీసుకొస్తాను" అంటూ, సమాధానం కోసమయినా ఎదురు చూడకుండా వీధిలో పడ్డాడు. పదిహేనునిమిషాల్లో డాక్టర్ మోహన్ని వెంటేసుకుని వచ్చేడు. ఆత్రంగా ఆమెని పరీక్షించి మత్తుకోసం ఇంజక్షనిచ్చేడు మోహన్. అయిదునిమిషాల్లో ఆమె కళ్ళు వాలిపోయాయి. నిద్ర పోయింది.

"చాలా బాధపడినట్లుంది. మీరేమయినా విషయం కదిపేరా?" నెమ్మదిగా అడిగేడు

చురుక్కున తగిలే చూపొకటి విసిరి "అలాంటి సంభాషణ ఏం జరగలేదు" అన్నాడు ఆరుద్ర.

మోహన్ హారిణి వంక చూసేడు. ఇంజక్షన్ ప్రభావం వలన నిశ్చింతగా నిద్రపోతోంది.

ఆ ముఖంలో ఎలాంటి భావంలేదు.

కృష్ణ వచ్చేడింతలో.

"ఏమయింది?" కంగారుగా అడిగేడు.

"నథింగ్ టు వర్రి" అంటూ భుజం తట్టి వస్తానంటూ మోహన్ వెళ్ళిపోయాక..

"ఏమయింది ఆరుద్రా?" భయంగా అడిగేడు కృష్ణ.

నెమ్మదిగా చెప్పేడు ఆరుద్ర

మౌనంగా విన్నాడు కృష్ణ.

"నే వస్తాను కృష్ణా, అవసరముంటే కబురుపెట్టు" అంటూ ఆరుద్రా వెళ్ళిపోయాడు.

గది తలుపులు దగ్గిరగా వేసి హరిణి మంచం దగ్గిర కూర్చున్నాడు కృష్ణ. ఆమె ముంగురులు సవరిస్తూ తరుణ యువతి, అంచ చందాలతో పాటు విద్యా సంస్కారాలను స్వంతం చేసుకున్న యువతి, తన కోసం అందరిని, అన్నింటిని కాదనుకుని వచ్చేసింది. తన జీవన జ్యోతి. ఆమెని తను మానసిక క్షోభకి గురిచేయడం తప్ప. మరేరకంగానూ, ఏనాడూ సుఖపెట్టలేదు. చివరికి ఆమె నిలా మంచంమీద చూడవలసి వస్తోంది.

* * •

హరిణి నెమ్మదిగా కోలుకొంటుంది. నీరసమింకా ఆమెని వదల్లేదు."చక్కనమ్మ చిక్కినా అందమే" అన్నట్లు ఆ నీరసంలో కూడా అందంగా కనిపిస్తోంది చూసేవారికి.

నాయర్ వచ్చి ఒక ఉత్తరం అందించేడు. ఆశ్చర్యంగా కవరంటూ ఇటూ తిప్పిచూసింది. లేతాకుపచ్చ కవరు. "మిసెస్ హరిణీ కృష్ణ" అని ఎడ్రస్ ఉంది.

"నాయర్ ఎవరిచ్చారీ ఉత్తరం?" అంది

"తెలియదమ్మా! సైకిల్‌మీద ఎవరో అబ్బాయి వచ్చి, మీ కివ్వమంటూ ఇచ్చేడంతే" అన్నాడు నాయర్. సరే నువ్వెళ్ళు అంది.

నాయర్ వెళ్ళిపోయాక పదినిమిషాలకి ఉత్తరం విప్పింది.

"మై డియర్ మిసెస్ హరిణీ!

నీ కెన్నడూ ఉత్తరాలు రాయడం నా కలవాటులేదు. అయినా అల్లరిగా నీ జీవితంలో నేను అడుగుపెట్టి అలజడి రేపి, నిన్నెంతో మానసిక వ్యధకి గురిచేసినందుకు శిక్షగా సంజాయిషీ!

నాకీరకమయిన జీవితం, తగినది కాకపోవచ్చు కాని, నా మనసుకి, నా జీవితానికి నిరంతర సంఘర్షణ ఫలితమే నీతో స్నేహం!

నీ కింకా పూర్తిగా అర్థం కావాలంటే, కాస్త వెనక్కి వెళదాం! నిన్ను తొలిసారి చూసిన క్షణమే నా మనసు చలించింది. నాలో నీవు అలజడి రేపేవు. నీ విశాల సుందర నయనాల్లో నేను జీవితం పంచరంగుల 'కల'గా ఊహించుకున్నాను. కాని కాదు పొమ్మని త్రోసిపారేసేవ్. నాలో ఆనాడే ప్రతీకార జ్వాల రేగింది.

తిరుపతిలో నిన్నూ, కృష్ణనీ చూసేక ఆ జ్వాల మళ్ళీ రాజుకుంది. నీతో ఛాలెంజ్ చేయాలనిపించింది ప్రతిరోజు నిన్ను చూడాలన్పించింది. అందుకనే "హరిణీ ఎంటర్ ప్రైజస్" అంటూ కృష్ణగారిని ప్రోత్సహించేను

నీతో నిజజీవితంలో పార్ట్నర్‌గా సాధించలేంది, వ్యాపారంలో సాధించాలని పంతం పట్టేను ఒకరకంగా గెలిచేను. తలుచుకుంటే మిమ్మల్ని ఇద్దరినీ ఏదయినా చేయగల సమర్థుడినయినాను.

"కాని హరిణీ! నీవు నిండుజీవితాన్ని పణంగా పెట్టి, లోకాన్ని వదిలి పోదలుచుకున్న విషయం విన్నాక, నిన్నా స్థితిలో చూసేక నాలో సంచలనం కల్గి నాదీ ఒక బ్రతుకేనా అన్పించింది. చూడ ముచ్చటయిన మీ జంట మధ్యలో వచ్చి అలజడి రేపేను. చివరికి చిత్తుగా ఓడిపోయాను.

ఇన్నాళ్ళూ నిన్నెంత బాధించేనో, నాకే ఆశ్చర్యంగా ఉంది. నీతోనే మొదలయి, నీతోనే అంతమయిపోయాయి ప్రేమలూ, ప్రణయాలు. నీతోనే అవి అంతమయిపోవాలి. వీలయినంత దూరంగా నీకు కన్పిస్తానని మాటిస్తున్నాను.

ఈ వేళనుంచి, నీ కనులలో, భయాందోళనలూ, వెర్రి ఆలోచనలు కన్పించకూడదు. నీ కళ్ళల్లో కౌముది కాంతులు కన్పించాలి!

జీవితం, జీవించడానికే నమ్మా! అంతం చేసుకోవలసిన అధికారం నీకు లేదు. అవసరం అంతకన్నా లేదు.

నీ ఆరోగ్యం జాగ్రత్త! వీలయినంతవరకు, నీకు దూరంగా ఉండాలనే ప్రయత్నిస్తాను.

మళ్ళీ నేను నిన్ను చూడగానే వెనకటి పొగరుమోతు హరిణి, అహంభావపు హరిణి, సత్యభామలా నాకు కన్పించాలి పొగరూ, వగరూ మేళవించిన శ్రీమతి హరిణి కన్పించాలి!నీవు నా ప్రేమకి దేవేరివి. నేను ఆజన్మంతం నీ ఆరాధకుడిని.

నా తప్పులనేవి ఉంటే చిన్నదానివయినా మన్నించు. నిన్ను మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్నాను. ఏనాడయినా నీ ఆదరాభిమానాలు సంపాదించుకోగలిగితే ధన్యుడిని.

నీ స్నేహితుడిగా నన్ను స్వీకరించు. పన్నీటి జల్లులు చిలకరించే నవ్వులు నవ్వాలి. అంతకి మించి నిన్నేం కోరను.

సెలవ్.

మనఃపూర్వక శుభాకాంక్షలతో

-ఆరుద్ర

* * *

'హలో రండి రండి' అంటూ ఆహ్వానించింది వసంతా, వినయ్‌లని హరిణి. మోహన్, మనోరమా వచ్చేరు.

"ఇవాళంతా ఎందుకో చాలా ప్రశాంతంగా గడిచింది. వినయ్, వసంతా, మోహన్, మనోరమా, అందరూ వచ్చేరు. జస్ట్ ఇప్పుడే వెళ్ళేరు," అంది నవ్వుతూ హరిణి.

"అవును దారిలో కనిపించేరు!" అన్నాడు కృష్ణ.

"అదేమిటి అలా డల్‌గా కనిపిస్తున్నారు?" అంది.

"మరి మీ సర్ప్రైయిజింగ్ న్యూస్‌కి కంగ్రాట్స్ చెప్పే ఓపిక లేక." సిగ్గుతో తల వాల్చింది హరిణి.

"అయితే నాదో రిక్వెస్ట్. ఈ శుభసమయంలో నీవో పాట పాడాలి" అన్నాడు కృష్ణ.

శ్రీరాగంలో "ఎందరో మహానుభావులు" అంటూ మృదు మధురంగా పాడింది

తొలినాట హరిణి "ఓరచూపు చూసేది న్యాయమా?" అన్నట్టుగా కనిపించింది. మాతృమూర్తి కాబోతున్న గర్వం, ఆమె కనులలో కొట్టొస్తోంది.

వెంకటగిరి జరీ చీరలో ముగ్ధమనోహరంగా ఉంది. డాక్టర్ విజయా, మోహన్ తనతో ఫోన్‌లో చెప్పిన శుభ వార్త హరిణి ముఖతా వినాలనే తపనలో తొందరగా వచ్చేడు. ఇల్లంతా సందడిగా ఉంది. చాలాకాలానికి ఇల్లు హరిణి నవ్వులతో నిండుతోంది. అదే కావాలి గాని, ఈ వ్యాపారాలూ, నష్టాలూ, ఆమె కెందుకు? తనెంత పొరపాటు చేసేడో అర్థమయింది.

హరిణీ, కృష్ణా మౌనంగానే భోజనాలు ముగించేరు. నాయర్ కూడా సంబరంగా ఉన్నాడు.

"జీవితం ఎంత అందమయినదో, ఈసాయంకాలం అర్థమయింది మోహన్."

బాల్కనీలో నిలబడి వెన్నెలని చూస్తోంది హరిణి. పున్నమి వెన్నెలల తళతళలలో, తోటలో చెట్లన్నీ కొత్త అందాలు సంతరించుకున్నాయా అనిపిస్తోంది. నైట్‌క్వీన్, చమేలీల వింత పరిమళం, విరజిమ్మే సౌరభం మత్తెక్కిస్తోంది హరిణిని.

"హరీ!" లాలనగా పిలిచేడు కృష్ణ.

"ఎంతసేపని అలా నిలబడతావ్, రా లోపలికి" అన్నాడు. బాల్కనీ లోంచి అతని దగ్గిరగా వచ్చింది హరిణి.

"వీణ వాయించాలనుంది గాని హరిణి నా హృదయ వీణ ప్రేమగానాన్ని ఆలపిస్తోంది వింటావా ?" రహస్యంగా అడిగేడు

శతకోటి విరజాజులు విరిసినంత మధురంగా నవ్వింది. "పద ! చాలా రాత్రయిపోయింది అలిసిపోయావ్" అంటూ ఆమె భుజాల చుట్టూ చేతులు వేసి లోపలికి తీసుకుని వెళ్లేడు. మంచం మీద కూర్చున్న హరిణిని దగ్గిరగా లాక్కొని, "నీ కోరిక తీరింది. వెనకటి అమ్మాయిగారివి కాదు అమ్మవ్ కాబో తున్నావ్." ఆమాటలకి సిగ్గుతో కృష్ణవంక చూసి కళ్ళు వాల్చేసింది అరక్షణం ఇరువురి కళ్ళూ ఎన్నెన్నో మాట్లాడుకున్నాయి.

"అల్లరిదానా! నీవు చేసిన పిచ్చిపనికే సగమయి నీరసపడ్డావ్. పైగా ఇది ఫస్ట్ ప్రెగ్నెన్సీ కాబట్టి చాలా జాగ్రత్తగా ఉండి, విజయ మాటలు విని మందులవీ శ్రద్ధగా వేసుకోవాలి."

"ఇంకా ?" అంది అల్లరిగా నవ్వుతూ.

"నీ అల్లరి ఇంకెంతకాలం ? మంచిపని అయింది."

కృష్ణ మాటలకి కిలకిలా నవ్వింది హరిణి

"అయాం సారీ, హరిణీ ఇకనుంచి, నీవే శాసించు, పరిపాలించు, నీ మాటలు నేనెన్నడూ కాదనను." గంభీరంగా అన్నాడు తల ఎత్తి చూసింది. "డబ్బూ, దస్కమూ, వాటిమీద వ్యామోహాలూ, వానిటీ అంతా వదిలి పోయింది. మనకీ డబ్బు చాలు. హరిణీ ఎంటర్‌ప్రైజెస్ అరుద్రకే వదిలిపెట్ట నిర్ణయించుకున్నాను."

"మరో ఎంటర్‌ప్రైజస్‌కి భాగస్వామిగా కొత్త మోజు. దాని మీదుండడం సహజం." చిలిపిగా అంది.

"ఏయ్ !" అన్నాడు చిరుకోపం నటిస్తూ. నవ్వింది.

• • •

"ఏమో, హరిణీ! వ్యాపారాలూ, డబ్బూ, వీటి ధోరణిలో నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోలేను."

హరిణి అతని జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి ప్రేమగా నిమరసాగింది.

"హరీ ! నీకు బంగారు పాపాయి కావాలా ? బంగారు బాబు కావాలా ?"

"ఏం ? దొరగారు నిజంగా ఇవ్వగల సమర్థులా ?" కొంటెగా అడిగింది.

"సరదాకి అన్నాను హరిణీ ! నీలాంటి అమ్మాయే పుడితే, సహజంగా, నిర్భయంగా, నీలా, వగరూ, పొగరూ మేళవించి బ్రతికేయగలదు. అబ్బాయే

పుట్టే దనుకో నాలాగా ఆడపిల్లల మనసు చిందరవందర చేసేయగలడు. నిన్నే డిపిస్తాడు. అందుకనే అందాల అపరంజి హరిణి నాక్కావాలి." ఆవేశంగా అన్నాడు.

"ఛా ! ఏం మాటలవి ?" అంటూ అతని పెదవులు మూసేసి, "ఎవరయితేనేం ఒకటే కోరిక" అంది హరిణి.

"ఏమిటది ?"

"చాలా తొందరగా ఉంది కృష్ణా, నీ ప్రతిరూపాన్ని వేగంగా చూసుకోవాలని" అంది హరిణి

కృష్ణ కళ్ళు మెరుపుతో వెలిగేయి అమాంతం హరిణిని మరీ దగ్గరగా లాక్కుని, గుండెలకి హత్తుకున్నాడు.

తపనతో, కాంక్షతో, అతనిని మరింత చేరువుగా అల్లుకుపోయింది.

ఆ క్షణం జీవితం చాలనిపించింది ఇద్దరికీ.

దే • దే

ఉదయం కాఫీ తాగుతుండగా మోహన్ ఫోన్ చేసేడు, మరునాడు తనూ, మనోరమా తిరుపతి వెళ్తున్నట్లుగా.

ఆ మాట విని "ఆ ఫోన్ నాకివ్వండి" అన్నది హరిణి.

"వెంటనే నేనూ, మావారూ వస్తున్నాం!" అంటూ ఫోన్ పెట్టేసింది.

సరేనంటూ మోహన్ ఫోన్ పెట్టేసేడు.

* * *

కొండమీద వాతావరణంలో ఎంతో ప్రశాంతత గోచరించింది హరిణికి. ఎత్తయిన రాయిమీద కూర్చుంది. విరబూసిన మందారంలా గర్వంగా ఉందామె ముఖం. మాతృత్వాన్ని తలుచుకుని మురిసిపోతోంది.

దూరాన మోహన్, మనోరమా ఏవో మాటల్లో పడ్డారు. చేతులు కట్టుకుని నిలబడి ప్రకృతి సౌందర్యాన్ని వీక్షిస్తున్నాడు కృష్ణ. అంతమందిలో ఉన్నా ఆ ప్రకృతి విలాసాన్ని ఊహల్లో తేలిపోతూ, విహరిస్తోంది హరిణి.

సంగీత సరస్వతీ, లక్ష్మి తనని కటాక్షించేరు. కాని మనశ్శాంతి కరువయిపోయింది.

అదే నీవిచ్చే అమూల్య కానుకగా నా కివ్వమంటూ మౌనంగా కళ్యాణ చక్రవర్తిని వేడుకొంటోంది హరిణి.

దూరాన కొండలను చూస్తూ ఆ చూపులు హరిణిమీదకి మలిచేడు కృష్ణ.

హరిణి! తన జీవన సఖి, తనే కుసుమ కోమలమయిన ఆమె మనసు గాయపరిచేడు. ధనలోపమూ లేదు, వస్తు వాహనాల కొరతా లేదు. ఆమెని సుఖపెట్టగల శక్తి నా కివ్వు భగవాన్! అంటూ ప్రార్థించేడు.

చీకట్లు కమ్ముకుంటున్నాయి. కాటేజీకి పోదాం! అంటూ మోహన్ దంపతులు లేచేరు. హరిణీ, కృష్ణా లేచేరు. నెమ్మదిగా నడుస్తూ కాంటీన్‌కి చేరుకుని భోజనాలు ముగించేరు. కాసేపలా కబుర్లు చెప్పుకుని ఎవరి గదుల్లోకి వారు వెళ్ళిపోయారు.

"హరిణీ" అన్నాడు కృష్ణ.

హరిణి చేతిగాజులు సవరిస్తూ అత్యంత సమీపంగా కూర్చున్నాడు.

"హరిణీ! మన వివాహమైన కొత్తలో నన్ను తిరుపతి రమ్మని కోరావ్. మళ్ళీ నీ కోసం రెండవసారి వచ్చేను. ఈ ఏడుకొండలస్వామి సాక్ష్యంగా ఇంకెన్నడూ నిన్ను మానసికమయిన వ్యథకి గురిచేయను, బాధించను. సత్యభామలాగా నీ వలగాలి, రుక్మిణీదేవిలా ఆదర్శంగా నీ వుండాలి. నా నుంచి నీవేమయినా డిమాండ్ చేయాలి. నీ అభిప్రాయాలు, ఆదర్శాలు వీటికి నే నడ్డం రాను."

హరిణి కళ్ళు మెరిసేయి. చాలాకాలం తరువాత ఆమె ముఖంలో అందాల చందమామలాంటి నవ్వొకటి మెరిసింది.

*   *   *

అందమయిన సంధ్యవేళ!

అస్తమించబోతున్న సూర్యబింబపు ఎరుపు జగత్తంతా ఆవరించింది.

విజయా నర్సింగ్‌హోమ్ ఆవరణలో ఆత్రంగా అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు కృష్ణ.

దూరంగా నిటారగా నిలబడ్డాడు ఆరుద్ర.

డాక్టర్ మోహన్ అటూ, ఇటూ తిరుగుతున్నాడు.

మరో గంటలో అలసిపోయినా చిరునవ్వుతో బయటికి వచ్చింది డాక్టర్ విజయ.

"కంగ్రాట్స్ మిస్టర్ కృష్ణగారూ, జూనియర్ హరిణి పుట్టింది" అంది.

"థాంక్స్" అన్నాడు ఆనందాతిరేకంగా కృష్ణ.

వెనువెంటనే "నేను వెళ్ళవచ్చా!" ఆత్రుతగా అడిగేడు.

"గంటసేపు ఓపిక పట్టాలి" అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయింది.

మరో పదిహేను నిమిషాల్లో నర్స్ వచ్చి "మీరేనా కృష్ణగారు! పైకి వచ్చి అమ్మగారిని చూడవచ్చని డాక్టర్‌గారు చెప్పేరు" అంది.

ఆమె అలా అనడమే తరువాయి పరుగులాంటి నడకతో ఆమె వెంట పైకి వెళ్ళేడు

క్షణం ఆగిపోయి మళ్ళీ అడుగులు వేయసాగాడు. కొత్త హరిణిని, తన ప్రతిరూపాన్ని చూడబోతున్న కంగారలా అనిపిస్తోంది.

గులాబిరంగు పాప ముద్దులు మూటకడుతూ చిన్న బేబీఫ్రాక్‌లో పెద్ద కళ్ళతో లోకం పరిశీలిస్తోంది. ఆ గులాబీ బేబీని తాకితే తన నలుపు అంటుకుంటుందేమో నన్నంత భయం గలిగింది. నిస్సంకోచంగా మృదువుగా ఎత్తుకున్నాడు కృష్ణ. విచిత్రంగా వీళ్ళని గమనిస్తున్నాడు ఆరుద్ర. తన ప్రొఫెషన్‌లో ఇటువంటివి ఎన్నో చూసినా హరిణి పాప కొత్తగా కనిపిస్తోంది మోహన్‌కి. నర్స్ నవ్వుతూ గమనిస్తోంది.

* * *

భారీ ఎత్తున భారసాల ఏర్పాట్లు చేసేడు కృష్ణ. హరిణికి సహాయంగా ఆయాని ఏర్పాటుచేసినప్పుడు కృష్ణకి చాలా బాధ కలిగింది. ఇద్దరికీ అందరూ ఉన్నారు. ఆరుద్ర ఎంతగా బ్రతిమాలినా హరిణి అన్నయ్యలూ, వదినలూ రాలేదు. మోహన్ బలవంతంమీద తన తల్లిదండ్రులని బ్రతిమాలాడు కృష్ణ. తిరస్కారాలతో, చివాట్లతో బయటికి వచ్చేరు మోహన్, కృష్ణ. 'అయాం సారీ' అన్నాడు బాధగా మోహన్. విచారంగా నవ్వాడు కృష్ణ

స్నేహితుల సహాయంతో ఘనంగా భారసాల జరిపించేరు. బంగారు పాపని వళ్ళో ఉంచుకొని మురుస్తోంది హరిణి. భోజనాలు అవగానే అందరూ వెళ్ళిపోయారు. "అలాగే కూర్చో" అంటూ రకరకాల భంగిమలలో ఎన్నెన్నో ఫొటోలు తీసేడు కృష్ణ.

పశ్చిమదిక్కునుంచి వర్షం ఆరంభమయింది. దాదాపు కుంభవృష్టి కురుస్తోంది. పాపాయికి బ్లాంకెట్ కప్పి తనూ కప్పుకుని పడుకుంది. సీలింగ్ వైపు చూస్తూ ఏదో ఆలోచిస్తోంది. నల్లటి జపాన్ జార్జెట్ చీర, కట్టుకుని ఉంది.

గడప దగ్గిర నిలబడి వీళ్ళనే చూస్తూండిపోయాడు కృష్ణ.

ఈ వర్షం తగ్గిపోతోంది. మళ్ళీ వాతావరణం ప్రశాంతంగా ఉంటుంది. తనదీ హరిణిదీ జన్మ జన్మాంతరాల బంధం. ఆ బంధమే అనుబంధమైపోయి

మరింత బలపర్చడానికి ఈ పాప పుట్టింది. ఇంటికీ, కంటికీ వెలుగయి పోయిందా పాపాయి. హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది. గదిలోకి వెళ్ళి వీణను తీసుకొచ్చాడు.

అంతా గమనిస్తోంది హరిణి.

"హరీ!" మధురంగా పిలిచేడు.

"ఏమిటన్నట్లుగా" చూసింది.

"నే పాడబోయే పాట ఊహించు" అన్నాడు.

"ఊహించలేను! బహుశా మీ అమ్మాయికి లాలిపాట కాబోలు" అంది నిర్లిప్తంగా.

'నగుమోము' అంటూ ఆరంభించేడు. ఏనాడూ వినని అపూర్వ స్వరం వినిపించింది హరిణికి. అతని ముఖంలో అంతటి అపూర్వ కాంతి తానెన్నడూ చూడలేదు. హృదయాంతరాళాలను కదిలించివేసింది ఆ పాటలో అతను అసాధ్యుడు.

పాట ఆగిపోయింది. వర్షం వెలిసిపోయింది. వీణ పక్కకి నెట్టి హరిణి మంచం దగ్గిరగా దాదాపు ఆనుకుని కూర్చున్నాడు.

"ఆనాటి రాత్రి జ్ఞాపకముందా ?"

"ఎందుకులేదు. ఆనాటి ఓరచూపులు నన్నింకా వెన్నాడుతూనే ఉన్నాయి." కొంటెగా జవాబిచ్చింది.

"పరిహాసమా?"

అతని భుజాలమీద తలవాల్చుకుని "మీ ఇష్టం. మీరెలా అనుకున్నా నష్టం లేదు" అన్నది.

అతని రెండుచేతులూ ఆవిడ భుజాల చుట్టూ బలీయంగా పెనవేసుకున్నాయి. ఇంక ఏ శక్తి ముందుతరాల్లో కూడా విడదీయదని ఇద్దరికీ ఒకేసారి అన్పించింది.





# అరవింద

'కవిక'

"అమ్మా!" బాధతో మూలిగాడు పసివాడు.

నిండా కట్లతో ఉన్న ఆ పసివాని వైపు జాలిగా చూసి మత్తుమందు సిరంజిలోకి ఎక్కించి జబ్బమీద రవంత చోటు చూసి ఇంజక్షన్ చేసింది, డ్యూటీలో ఉన్న నర్సు. క్షణంలో మత్తులోకి జారిపోయాడు ఆ పసివాడు.

అవి విజిటింగ్ అవర్సు కావడంతో వార్డులన్నీ జనంతో సందడిగా ఉన్నాయి.

"సిస్టర్ ! బాబుకి ఎలా ఉంది ?" లోపలకు వస్తూ అడిగింది సరళ.

"రక్తం బాగాపోయింది. అప్పుడే ఏ మాటా చెప్పడం కష్టం. కేసు చీఫ్ టేకప్ చేశారు. ఫరవాలేదనే అనిపిస్తోంది."

"అంతా ఆ భగవంతుని దయ," అంది సరళ చంకలోని బిడ్డను చక్కజేసుకొంటూ.

"నిజంగా మిమ్మల్ని మెచ్చుకోవాలి.

చాలామంది తల్లులు నానా గోలాచేసి, మాకేమీ తోచకుండా చేస్తారు. అందరూ మీలా ఇలా ధైర్యంగా నిలబడితే ఎంత బాగుండును !"

నర్సు మాటలకు నొచ్చుకొంది సరళ. "బిడ్డ కాలిగోరు కందితే తల్లి ప్రాణం గిలగిలలాడిపోతుందే అలాంటిది బిడ్డఇలా చావుబ్రతుకుల మధ్య కాపాడుతుంటే తల్లి కింక యుక్తాయుక్తాలు ఏం తెలుస్తాయి ? మీకు అనుభవంలేక అలా అనగలిగారు."

ఆ మాటలు చురుక్కుమనిపించడంతో నర్సు ముఖంలో రంగులుమారాయి.

"అయితే మీ కిప్పుడింత నిబ్బరం ఎలా వచ్చింది ?" అని ప్రశ్నించింది నర్సు.

"పాపం ! ఈ నిర్భాగ్యుడు తల్లి ప్రేమకు నోచి పుట్టలేదు. సమయానికి తండ్రికూడా కాంపుకి వెళ్లాడు. ఇంతలో ఈఅవాంతరంవచ్చిపడింది. పక్క పక్క ఇళ్ళు కావడంతో వీడు మా వాళ్లతో ఆడుకొంటూ ఉండేవాడు. ఆ చనువు చేత చూస్తూ వదిలెయ్యలేక తీసుకు వచ్చి ఇక్కడ చేర్పించాము.

ట్రైసికిల్ నడుపుతూ మేడమెట్లమీద నుండి దొర్లిపోయాడు. వెంటనే బాధ్యత తెలియని కుర్రనౌకరు కంగారుపడి పారిపోయాడు. మా పిల్లలు వచ్చి చెప్పగానే పరుగెత్తా. మెట్లకింద నెత్తురు మడుగులో దొగాడుతున్నాడు. పాపం ! ముసలినౌకరు చచ్చిపోవడంతో వచ్చాయి తిప్పలు. అసలు తల్లే ఉంటే వీడికి ఈ గోడే ఉండేది కాదు. వీడు మరీ పసివాడుగా ఉన్నప్పుడే, తల్లి లేచిపోయిందని కొందరు, చచ్చిపోయిందని కొందరూ చెపుతూంటారు. ఏది ఏమైతే నేమి ఆ మహానుభావుడు మళ్ళీ పెళ్ళి మాట తలపెట్టకుండా ఈ బిడ్డతోడిదే లోకంగా బ్రతుకుతున్నాడు. అతనికి టెలిగ్రాం పంపాము. అందగానే రెక్కలు కట్టుకొని వచ్చి వాల్తాడు. పాపం ! ఏం రాసి ఉందో" సానుభూతితో నిట్టూర్చింది సరళ.

ఆర్డర్లీ కేసురిపోర్టు తెచ్చి గదిలో తగిలించి వెళ్ళాడు వాటి చూసుకొని కంగారుపడింది సరళ.

"సిస్టర్ ! నేను వెళ్ళాలి. వాళ్ల నాన్న వచ్చేదాకా ఈ బాబుకి తల్లైనా తండ్రి అయినా మీరే ఖర్చుకు వెనకాడ వలసిన పనిలేదు. బిడ్డ బాగుంటే చాలు. జాగ్రత్తగా కనిపెట్టి ఉండండి. సాయంకాలం మావారు వచ్చి చీఫ్‌తో మాట్లాడు తారు. ఇక నేను ఉంటా" అంటూ అప్పగింతలు పెట్టి వెళ్ళిపోయింది.

నర్సు మంచందగ్గరకు వెళ్ళి, అచేతనంగా పడిఉన్న ఆ పసివాడివైపు తదేకంగా చూస్తూ నిలబడింది. అప్రయత్నంగా ఆమె కళ్లు చెమ్మగిల్లాయి. "తల్లిగా అనుభవం లేదు

తాబోలు" అన్న సరళ మాటలే తలపుకు వచ్చి బాధగా నిట్టూర్చింది ఆమె.

"ఈ పసివాడి తల్లి ఎవరో ? ఎంత తప్పనిసరి పరిస్థితులలో ఆమె ప్రాణాధికమైన బిడ్డను విడిచి వెళ్ళిపోయిందో-అది ఎవరికీ పట్టదు కదా!"

మూగగా రోదించింది ఆమె హృదయం చెదరిన మనసును అదుపులోకి తెచ్చుకొని రోగి స్థితిని గురించిన వివరాలు తెలుసుకోవాలన్న కోరికతో కేసురిపోర్టు చేతిలోకి తీసుకొంది. వెంటనే షాక్ తిన్నదానిలా మంచం పక్కన కూలబడి పోయింది.

* * *

సృష్టికంతకు ఆధారభూతమైనది తల్లి ప్రేమ. బిడ్డల్ని కని, పెంచి, ప్రయోజకులుగా చెయ్యడంకోసం తల్లి-ప్రాణి పడే తాపత్రయం ఎంతటిదో మనం పశుపక్ష్యాదుల్లో కూడా చూస్తూనే ఉంటాము. ఎటొచ్చీ పశువులకు విలక్షణంగా మానవులు ప్రాజ్ఞులై తిరిగి తల్లిదండ్రుల్ని ఆదుకోవాలి. తండ్రి పోయినప్పటినుంచి రాత్రనక పగలనక కష్టించి పిల్లల్ని పెంచినది తమ తల్లి. తొలి జీతం అందుకోగానే ఆమె నింక వంటపనికి వెళ్లనివ్వకూడదు. శక్తికి మించిన శ్రమ కావడంచేతనే ఆమెకు జబ్బుచేసింది. ఇంక విశ్రాంతి నివ్వాలి-అనుకొంది తల్లి మంచాన్నే కనిపెట్టుకొని ఉన్న అరవింద.

పక్క వాటాలోని గడియారం వరుసగా తొమ్మిది గంటలు కొట్టింది.

"అమ్మలూ!" పిలిచినట్లయి తల ఎత్తిన అరవింద, తల్లి కళ్ళు తెరచి ఉండడంచూసి సంబరపడింది.

"అమ్మలూ! ఎంతే గంటి కొట్టింది" అని అడిగింది కమలమ్మ. బహునీరసంగా వుంది మాట

మూడురోజులనుండి నోట మాట లేకుండా పడిఉన్న తల్లి కళ్లుతెరిచి ఆ పాటిగానైనా మాటాడగలిగినందుకు సంతోషించారు పిల్లలు ముగ్గురూ.

"అమ్మా!" అంటూ దగ్గరగా వచ్చాడు ప్రసాద్.

"తొమ్మిదయిందమ్మా" అంది దగ్గరే ఉన్న కళ్యాణి.

"అప్పుడే తొమ్మిదయిందా! బిందూ, అలాగే ఉన్నావేమే, ఆఫీసుకు వెళ్ళవా?" అంటూ లేవబోయింది కమలమ్మ. కాని లేవలేక వెనక్కువాలిపోయింది. "అబ్బా! ఈ కాస్త జ్వరానికేఇంత డీలాపడిపోయానేమిటి ?" అనుకొంటూ ఉస్సురంది.

"కొంచెమా! జ్వరం పేలిపోతేను! ఈ మూడు రోజులనుంచీ నువ్వు కళ్లైనా తెరవలేదు-అక్క ఆఫీసు మానేసింది. నాకు ఎంత భయమేసిందో" తల్లి మెడ చుట్టూ చేతులువేసి ఒదుగులుపోయింది కల్యాణి.

"బిందూ! సెలవు చీటీ వ్రాశావా?" తల్లి అడిగింది.

కేలండర్ వైపు చూసిన అరవింద ఒక్కసారిగా కంగారుపడిపోయింది. తన బెంగలో తానుండి సెలవుచీటీ వ్రాయ లేదు సరిగదా చంద్రమోహన్ టైపు చెయ్యమని ఇచ్చిన థీసిస్ కాగితాలు కూడా తాను తిరిగి ఇవ్వలేదు. రేపే అతని ప్రయాణం! ఎలాగ! ఆ కాగి తాలు కూడా తన డెస్కులోనే ఉన్నాయి. తాళాలూ తన దగ్గరే ఉన్నాయి. మూడువంతులు టైపు చెయ్యడం అయ్యింది. ఇంకా ఒకవంతు ఉంది. ఇప్పుడైనా ఆ కాగితాలు అతనికి అంద జెయ్యడం మంచిది-అనుకొన్న అరవింద తల్లికి ఆ విషయం చెప్పింది.

కమలమ్మ నొచ్చుకొంది. "ఉద్యోగం నిలుపుకొనే లక్షణాలు ఇవికావే. ఆ కాగితాలు పూర్తిచేసి ఇచ్చేసిరా. నా కీవేళ బాగానేఉంది. బాబ్జీ, కల్యాణి ఉంటారుగా, నువ్వు వెళ్ళిరా" అంటూ తొందరచేసింది.

* * *

ఇంటిదగ్గర సర్దుబాట్లన్నీ చూసుకొని ఆఫీసుకు చేరుకొనేసరికి ఒంటిగంట అయ్యింది. అరవింద గుమ్మంలోకి రాగానే ఎదురు వచ్చిన చంద్రమోహన్ "మూడురోజులనుండీ రాలేదేం? థీసిస్ టైప్ చేశారా?" అంటూ ఆత్రంగా ప్రశ్నించాడు.

వేళకు సరైన నిద్రాహారాలు లేక పాలిపున్న ఆమె చెక్కిళ్ళలోకి వెచ్చని ఆవిర్లు వచ్చాయి. తలవంచుకొని "హఠాత్తుగా మా అమ్మగారికి చాలా జబ్బుచేసింది.అందుకని రాలేకపోయాను. మీ థీసిస్ మూడువంతులు పైగా అయి పోయింది. తక్కినది ఇప్పుడు టైప్‌చేసి ఇస్తా" అంది.

భారంగా వాలిపోతున్న ఆమె సోగ కళ్ళనూ, కెంపెక్కిన చెక్కిళ్లనూ, తడ బాటుతో కంపించే అధరాలనూ ఒక్క క్షణం రెప్పవాల్చకుండా చూసి చూపులు మరల్చుకొన్నాడు చంద్ర మోహన్

"సరే, త్వరగా మొదలుపెట్టండి. నా ప్రయాణం రేపే. ఈ వేళ ఆఫీసు వర్కు ఏమీ చూడవద్దు. ఈ ఒక్కపనీ పూర్తిచేసి కాగితాలు అప్పగించి వెళ్ళండి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

మూడురోజుల క్రితం 'అర్జంటు' అంటూ ఇచ్చిన కాగితాలు అవి ఇంకా అట్టేలేవు. పని నీట్‌గా చేసి అప్పగించి మరీ వెళ్ళాలి-అనుకుంది అరవింద.

లంచి టైంకి వచ్చి చూసిన చంద్ర మోహన్ ఆమె ఏకాగ్రతకు విస్తు పోయాడు. అతడు వచ్చినదైనా గమ నించకుండా ఏకబిగిని పేజీలకు పేజీలు టైపుచేస్తోంది అరవింద. కాగితాలు మార్చవలసి వచ్చినప్పుడు తప్ప ఆమె మిషనుకి క్షణమైనా విరామం ఇవ్వటం

లేదు. అలసట ముఖంమీద కొట్టవచ్చి నట్లుగా కనిపిస్తోంది. చెమట బిందువులు ముత్యాల జాలరుల్లా ఆమె ముఖాన్ని ఆవరించి మెరుస్తున్నాయి. సన్నని అంగుళులు మెరపుతీగల్లా వేగంగా కీ బోర్డుమీద కదులుతూ కళ్లు మిరిమిట్లు గొల్పుతున్నాయి. ఆ భంగిమలో ఆమెను చూడగానే ఇదివరకెన్నడూ ఎరుగని విధంగా అతని గుండె స్పందించింది. బలవంతంగా చూపులు మరల్చుకొని అతడు బయటకు వెళ్లిపోయాడు.

ఆఖరు పేజీకూడా టైప్ చెయ్యడం అయ్యింది. పేజీలన్నీ బొత్తిగా పేర్చి మిషన్ మూసి లేచి బడలికగా ఒళ్లు విరుచుకొంటూ గడియారం వైపు చూసిన అరవింద తృళ్లిపడింది. గడియారం 8 గంటలు చూపిస్తోంది. ఇంటి దగ్గరి పరిస్థితులు ఆమెను కలవర పరచాయి. త్వరగా ఇంటికి చేరాలని తహతహలాడింది.

భోజనానికి పోయాడు గావును, ఎంత పిలిచినా ప్యూన్ పలుకలేదు. అరవింద మేడమీది దీపం దేదీప్యమానంగా వెలిగి పోతూ ఉండడం చూచి 'ఈపాటికి అతను క్లబ్‌నుండి వచ్చేఉంటాడు" అనుకొంది. తను వెళ్ళి ఈ కాగితాలు అతనికి అప్పగించేస్తే తన పూచీ తీరి పోతుంది; ఇంటికి వెళ్ళిపోవచ్చునన్న తొందరలో అరవింద ఆ కాగితాల దొంతర మోసుకుంటూ మేడమెట్లు ఎక్కడం మొదలుపెట్టింది.

గుమ్మందగ్గర నిలచి 'సార్" అంటూ బెరుకుగా పిలిచింది అరవింద.

వెంటనే 'కమిన్' అన్నమాట విని పించడంతో తెరిపినపడ్డ మనసుతో ఒంటినిండుగా కొంగు కప్పుకొని నెమ్మదిగా అడుగులు ముందుకువేసింది.

అది విశాలమైన హాలు. అందరి భాగ్యవంతుల ఇళ్లలాగే అదీ అధునాతన మైన ఫర్నిచర్‌తో గృహమేధి అభిరుచిని వ్యక్తంచేస్తూ తీరుగా అలంకరించబడి ఉంది. గోడవారగా ఉన్న టేబుల్‌మీద వ్రాతపరికరాలు, కాగితాలు పేర్చి ఉన్నాయి. అక్కడ ఉన్న కుర్చీలో తల బల్లకు ఆన్చుకొని కూర్చుని ఉన్నాడు చంద్రమోహన్.

"సార్! థీసిస్ తెచ్చా" అంది అరవింద చేతిలోని కాగితాల దొంతర చూపుతూ.

అతడు వాల్చిఉన్న తల భారంగా పైకెత్తి అరవిందవైపు వెర్రిగా చూశాడు. మత్తుగా తనవైపు చూస్తున్న ఎర్రని కళ్లనూ, చిందరవందరై ఉన్న జుట్టునూ, ఆ ముఖంలో ద్యోతకమవు తున్న భావాన్ని చూసి గతుక్కుమంది. అరవింద కంగారుగా థీసిస్ బల్లమీద ఉంచి గుమ్మంవైపుగా పరుగెత్తింది. ఆమె గుమ్మాన్ని చేరిందో లేదో, అతడు ఒక్క అంగలో అందుకొని, ఒక్క

ఊపులో ఆమెను ఇవతలకు లాగి తలుపును దగ్గరగా నెట్టాడు. పెద్ద చప్పుడుతో మూసుకుపోయింది ఆ తలుపు. వెంటనే బిగుసుకుపోయింది ఆటోమెటిక్ లాక్.

అప్పుడే మెట్లదగ్గరకు వచ్చిన ప్యూన్ వెంకన్న కళ్లబడి ది ఆ దృశ్యం. ఒక్క పరుగున మెట్లన్నీ గడిచి వచ్చి తలుపును దబదబా బాదడం మొదలు పెట్టాడు.

"బాబూ! కన్నెపిల్ల. అన్యాయం చెయ్యకండయ్యా. బాబూ! ఇది మీకు తగిన పనికాదు. రక్షించండి బాబూ! బాబూ!" అంటూ గోలగా అరుస్తూ తలుపులు మోదసాగాడు. కాని అతని దంతా అరణ్యరోదనమే అయ్యింది. లోపలనుండి అంతవరకు వినిపిస్తున్న గందరగోళం ఆగిపోగానే ఉసూరుమని అక్కడే కూలబడిపోయాడు వెంకన్న.

హఠాత్తుగా స్పృహలోకి వచ్చి కళ్ళు తెరచి చూసిన అరవిందకు కొంత సేపటివరకు ఏ స్ఫురణ లేకుండా పోయింది దేదీప్యమానంగా వెలుగు తున్న దీపపు కాంతిలో పరిసరాలను గమనించిన ఆమెకు నెమ్మదిగా అంతా గుర్తుకురావడం మొదలుపెట్టింది. పాల రాతితో చెక్కబడిన గ్రీక్ శిల్పంలా, తన ప్రక్కనే పడుకొని గాఢనిద్రలో సొక్కిఉన్న చంద్రమోహన్‌ని చూసే సరికి ఆమె అంతులేని దుఃఖంతోనూ, భయంతోనూ వణికిపోయింది. అతడు లేవకముందే తాను అక్కడినుండి పారి పోవాలని కంగారుపడింది. తొందరగా, చెదిరిఉన్న రూపాన్ని చక్కదిద్దుకొని, నెమ్మదిగా తలుపు తెరచుకొని కక్ష్యాంతరా లన్నీ గడిచి వీధినిపడిఅరవింద వేగంగా ఇంటివైపు పరుగెత్తడం మొదలు పెట్టింది

అర్ధరాత్రి నిర్మానుష్యంగా ఉన్న వీధులవెంట తన్ను తానెరుగకుండా పరుగెత్తుకొంటూ వచ్చి ఇంటిని చేరు కొన్న అరవింద ఇంటి తలుపులు తెరిచి ఉండడమూ దీపపు వెలుగు హెచ్చుగా ఉండడమూ చూసి కంగారుపడి ఒక్క అంగలో తల్లి మంచాన్ని చేరుకొంది.

ఎక్కిళ్ళతో ఇంతెత్తున ఎగిరిపడు తున్న తల్లిని చూసి "అమ్మా! ఏమిటే ఇది ?" అంటూ రెండుచేతులా తల్లిని పొదువుకొని మనసులోని గుబులు ఎగ దన్నగా భోరున ఏడ్చేసింది అరవింద.

"అక్కా! నీ కోసమే చూస్తున్నా. నువ్వు వచ్చేశావుగా, నేను డాక్టర్‌ని తీసుకువస్తా" అంటూ మరి మాటకోసం ఎదురుచూడకుండా పరుగెత్తాడు ప్రసాద్.

తన్ను తాను సంబాళించుకొని, తల్లి మంచాన్ని కరచుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్న చెల్లెల్ని దగ్గరకు తీసుకొంది అరవింద "కల్యాణీ! ఏడవకు. అమ్మచూస్తే బాధపడుతుంది. బాబ్జీ



డాక్టర్‌ని తీసుకొస్తాడుగా, అమ్మకు నయమైపోతుంది. నా బంగారువు కదూ! నువ్వెళ్ళి దొడ్డమ్మగారిని లేపుకురా. మనకు సాయంగా ఉంటారు" అంది.

చెల్లెలు అటు వెళ్లగానే ఇక నిగ్రహించుకోలేకపోయింది అ ర వి ం ద. "అమ్మా! అన్యాయమైపోయానే" అంటూ తన దుఃఖాన్ని వెళ్ళబోసుకొని తల్లి ఒడిలో ఓదార్పు పొందాలని గంపెడాశతో తను ఇంటిని వెతుక్కుంటూ వస్తే తల్లి పరిస్థితి ఇలా అయోమయంగా ఉంది. తమకు తల్లి అసలు దక్కేనా !?

గుండె లవియజేసే బాధను బలవంతంగా నిగ్రహించుకొనే ప్రయత్నంలో ఆమె నిలువునా వణికింది. చెంపల వెంట కన్నీటిధారలు కారిపోతూ ఉండగా ఎలాగైనా తల్లికి కాస్త ఉపశమనం కలిగించాలని శుష్కించి ఉన్న ఆ గుండెలమీద మెల్లగా రాస్తూ తాపత్రయ పడడం మొదలుపెట్టింది అరవింద.

కాని ఆ తల్లి ఇవేమీ తెలుసుకోగల స్థితిలో లేదు. ఒకవిధమైన మాంద్యం ఆమెను క్రమ్మి ఉంది. తెరలు తెరలుగా ఎగిరిపడుతున్న శరీరోద్వేగమే తప్ప ఇతరమేమీ ఆమెకు తెలియటంలేదు. ఆ సమయంలో శీలాన్ని కోల్పోయి దిక్కు-

చక అసహాయంగా దుఃఖిస్తున్న కూతురు స్థితి ఆమెకు తెలియనే తెలియదు. ఈ భవబంధాలనుండి విముక్తికోసం పెనుగులాడుతోంది జీవం.

కల్యాణి వెంట వచ్చిన రాజమ్మ, కమలమ్మ పరిస్థితి చూసి కంగారు పడింది.

"అదేమిటే ! అలా చూస్తూ ఊరు కొన్నావు – ప్రాణం కంఠంలో గుర గురమంటూ ఉంటే భూశయనం చేయించవద్దా ! ఇల్లు మయిలపడి పోదూ ! లేవండి - అమ్మడూ ! ఆ పాత చాప అందుకొని వీధివార పరవ్వే అరవిందా! నువ్వు కాళ్లదగ్గర పట్టుకో. నారాయణ నారాయణ –" అంటూ రోగి తల పట్టుకొని దబ్బున లేవదీసింది రాజమ్మ.

"డాక్టరు ఇప్పుడు రానన్నారు. రేపు అమ్మనే ఆసుపత్రికి తీసుకు రమ్మన్నారు" అని చెప్పడం ఎలాగా అని బాధపడుతూ ఇల్లు చేరిన ప్రసాద్‌కు ఇంక ఆ అవసరమే లేకపోయింది. తన చుట్టూ చేరి దారుణంగా విలపిస్తున్న బిడ్డలవైపు జాలిగా ఒక్కచూపు చూసి కళ్లు మూసుకొంది కమలమ్మ. కడసారం మూతలుపడ్డ ఆ కళ్ళు మరి తెరవబడ లేదు.

* * *

తెల్లవారేసరికి గుమ్మంలో కారు దిగిన రఘురామయ్య, తలుపులన్నీ బారుగా తెరచి ఉంచి కటిక నేలమీదపడి నిద్ర పోతున్న వెంకన్నను చూసి కోపంతో కేకలు వెయ్యడం మొదలుపెట్టాడు.

ఆ సందడికి మెలకువ వచ్చిన చంద్రమోహన్ ఉక్రోషంగా నీళ్లగది లోకి పరుగెత్తి తలుపులు మూసు కొన్నాడు. తన దగ్గరఉన్న తాళం చెవితో తలుపుతెరిచి మేడమీదకు వచ్చిన రఘురామయ్య ఆ గదిఉన్న తీరు చూసి దిగ్భ్రాంతుడయ్యాడు. నేలంతా చిట్లిపడి ఉన్న ఎర్రగాజుముక్కలు కనుల్లెర్రజేసి తనను సంజాయిషీ అడుగుతున్నట్లుగా భావించి అతడు కించపడ్డాడు. తన ఏకైక పుత్రుడు అందరికీ మిన్నగా, చుక్కల్లో చంద్రుడిలా ప్రకాశించాలని కోరుకొన్నాడేగాని – ఇప్పుడిప్పుడే పరి పూర్ణత్వాన్ని సంతరించుకొంటున్న ఆ నునులేత హృదయంలో ఏ యే ఆశలు పుడుతూ ఉంటాయో, ఏ యే కోరికలు ఊరుతూ ఉంటాయో ఏనాడూ తాను ఆలోచించినపాపాన పోలేదు. నిండు జవ్వనం తొందరచేయగా తన కొడుకు నిన్న రాత్రి ఏ విలాసి కౌగిలిలోనో గడిపిఉంటాడు. ఇంక ఉపేక్ష చెయ్యకూడదు. తిరిగి రాగానే వీడి పెళ్ళి చేసెయ్యాలి — అనుకొంటూ తనలో తను నవ్వుకొన్నాడు.

గాజు ముక్కలన్నీ పోగుగా తుడు స్తున్న వెంకన్న నుద్దేశించి - "ఇదిగో వెంకన్నా ! ఈ గది వాటం చూస్తూంటే

ఇక్కడ ఏదో కథ జరిగినట్లుగా ఉంది. నీ కేమైనా తెలుసా ?" అని అడిగాడు

ఆ అవకాశం కోసమే ఎదురు చూస్తున్న వెంకన్న వెంటనే చెప్పడం మొదలుపెట్టాడు - "వట్టి కథ కాదు బాబయ్యా ! చాలా ఘోరమైన కథ జరిగిపోయింది. తమరు క్షమించాలి. చినబాబు తప్పేమీలేదు. తప్పంతా ఆ వయసుది."

ఇంకా ఉపోద్ఘాతమైనా పూర్తికాక ముందే "హల్లో చాంద్ ! హౌ డు యు డు?" అంటూ వచ్చిపడ్డారు చంద్రం స్నేహితులు

* * *

బాత్‌రూమ్‌లో ప్రవేశించిన చంద్ర మోహన్ టాప్ తిప్పి షవర్ ఓపెన్ చేశాడు చలివెచ్చని నీళ్ళు జల్లుగా కురుస్తూంటే గడచినరోజు సంఘటన లన్నీ ఒక్కొక్కొటిగా తీయని కలలా గుర్తుకురావడం మొదలుపెట్టాయి. 'ఈవెనింగ్ స్టార్' లో కాక్‌టెయిల్‌పార్టీ, కాబరే డాన్సు - అంతా ఏమిటో అపూర్వమైన అనుభవం రాత్రి—ఎవరు తన ఎదుట నిలచిన అప్సర !? అంతా మధురమైన కల - అనుకొన్నాడు చంద్రమోహన్.

కాని అతని శరీరంమీద అక్కడక్కడా ఎఱ్ఱగా విచ్చుకొని, నీరు తగలగానే మంటపుట్టి సలుపుతున్న గోటిచారికలు జరిగినదంతా కలగా భావించనీయడం లేదు. అందమైన కళ్ళు రెండు భయంతో, దుఃఖంతో. అసహ్యంతో తనవైపు చూస్తున్నట్లు అనుభూతి కలిగి అతడు ఒక్క క్షణం ప్రాన్పడి ఉండిపోయాడు. ఆలోచించినకొద్దీ తలదిమ్ము మరింతగా పెరిగిపోతోందే తప్ప అతనికి ఏమీ గుర్తుకు రావడంలేదు. అయినా తీరు బడిగా ఆలోచించే వ్యవధి మాత్రం ఎక్కడ ? పదకొండు అయ్యేసరికల్లా అతను ఏయిరోడ్రమ్‌లో ఉండాలి. తొందరగా స్నానం పూర్తిచేసి, నీటుగా ముస్తాబై బయటికి వచ్చాడు చంద్రమోహన్

* * *

బొంబాయిదాకా వెళ్ళి కొడుకును "బోయింగ్ జట్"తో ఎక్కించి కను చూపుమేర సాగనంపి తిరిగి వచ్చాడు రఘురామయ్య వరసకూ అశ్రద్ధ జరగ డంతో ఆఫీసుపని పేరుకుపోయింది. అర్జంటుగా పంపవలసిన కాగితాలు ఎంచి టైపు చెయ్యడానికి పంపించాడు.

టైపిస్టు వారంనుండి ఆఫీసుకు రావడంలేదనీ సెలవైనా పంపలేదనీ తెలిసి మండిపడ్డాడు రఘురామయ్య.

"ఆ అమ్మాయికి ఈ ఉద్యోగం ఇష్టం అవునో, కాదో అడిగి, రాదలచు కొంటే వెంటనే రమ్మని చెప్పి వెంట తీసుకురా" అంటూ వెంకన్నకి పురమా యించాడు.

"బాబూ ! ఆ అమ్మాయి ఇంటికి

వెళ్ళాలంటే నాకు ముఖం చెల్లటం లేదండీ" అంటూ నీళ్ళు నములుతూ నిలబడిపోయాడు వెంకన్న.

"నువ్వేం చేశావురా అపచారం" అంటూ విసుక్కున్నాడు రఘురామయ్య.

వచ్చిన అవకాశం జారవిడుచుకో లేదు వెంకన్న. "అపచారం జరిగి పోయిందండయ్యా, చాలా పెద్ద అపచారం. ముసలిముండావాణ్ణి బ్రతికి ఉండీ ఏమీ చెయ్యలేకపోయాను. కన్నె పిల్ల అన్యాయమైపోయింది. తలుచు కొంటే నా గుండెలు పగిలిపోతున్నా యండి" అంటూ గుడ్లనీరు కుక్కు కొంటూ తను చూసిందంతా వివరిం చాడు.

నీరుకారిపోయాడు రఘురామయ్య. "ఎంతపని జరిగింది వెంకన్నా! అప్పుడే చెప్పలేకపోయావా? ఇంత జాప్యం చేశా వెందుకు" అంటూ నొచ్చుకున్నాడు.

"అప్పుడే తమరికి చెప్పాలనుకొన్నా. కాని ప్రయాణం హడావిడిలో సందు దొరకలేదు బాబూ!"

"ఎంత పనయ్యింది! నా బాబు మచ్చలేని చంద్రుడనుకొన్నారా వెంకన్నా! ఇంత ఘోరం జరుగుతుం దని అనుకోలేదు.

"పోనీలేండి బాబూ! తమరు తలచుకొంటే క్షణంలో అన్నీ సద్దుబాటై పోతాయి. రెండేళ్లంటే ఎంత! చిటికలో తిరిగిపోతాయి. బాబు తిరిగిరాగానే ఆ ఇద్దరినీ ఏకం చేస్తే..." మాట పూర్తి చేసేందుకు ధైర్యం చాలలేదు వెంకన్నకు.

కాని ఆ మాటకు రఘురామయ్య ముఖం వికసించింది. గుబురు మీసాల చాటున చిరునవ్వు తొంగిచూసింది. "అవును. అలా చేస్తే బాగుంటుంది. నా చంద్రుడికి మచ్చ రావడం నేను సహించలేనురా ఒక్కసారి నువ్వు వెళ్ళి ఆ అమ్మాయిని పిలుచుకు వస్తావా?"

వెంకన్న సంతోషంగా లేచాడు. కాని అంతలో ఏం తోచిందో వెంకన్నను వారించాడు రఘురామయ్య.

"ఆగు వెంకన్నా, తప్పు మనదై ఉండగా ఆ పిల్లని ఇక్కడకు పిలిపిం చడం ఏం బాగుంటుంది? మనమే వెడదాం టాక్సీని పిలు," అంటూ కండువా భుజాన వేసుకుని ముందుకు దారితీశాడు.

* * *

కాలచక్రం గిఱ్ఱున తిరిగింది రెండేళ్లు గడిచిపోయాయి. చంద్రమోహన్ స్టేట్సులో చదువు పూర్తిచేసి విజయియై ఇంటికి తిరిగివస్తున్నాడు కొడుక్కి ఘనమైన స్వాగతం యివ్వడం కోసం చక్కని ఏర్పాట్లు చేసి ఉంచాడు రఘురామయ్య.

చెయ్యవలసిన పనులు అందరికీ పురమాయించి వచ్చి సోఫాలో

కూర్చున్నాడు రఘురామయ్య. అంతలో తప్పటడుగులతో దోగాడుతూ తనవైపు వచ్చిన ఏడాది పసివాణ్ణి చూసి "రారా తాతా" అంటూ చేతులు చాపి దగ్గరకు పిలిచాడు.

"తాత ! తాత !" అంటూ తనకై చాపి ఉంచిన చేతుల్లో దూకి గారాలు పోతున్న పసివాడిని చూసి "ఎవరు బావా వీడు" అని అడుగుతూ లోపలకు వచ్చాడు కామేశం.

హఠాత్తుగా వచ్చిన ప్రశ్నకు తబ్బిబ్బు పడిన రఘురామయ్య బావ మరిది ముఖంలోకి చూస్తూ "అరవింద కొడుకు" అన్నాడు.

టాక్సీలోని సామాను దింపించే హడా విడిలో పడిపోయిన కామేశం అప్పటికి మరేమీ ప్రశ్నించకుండా ఊరుకొన్నాడు.

కుశల ప్రశ్నలూ మర్యాదలూ అయ్యాయి భోజనాలు చేసి వచ్చి గదిలో పిచ్చాపాటీ మాటాడుకొంటూ కూర్చున్నారు బావమరుదులు. దగ్గరలోనే కర్ర గుర్రం మీద ఊగుతూ ఆడుకొంటున్నాడు పసివాడు.

యదాలాపంగా గదినంతటిని కలయ జూస్తున్న కామేశం చూపులు ఒక ఫొటో పైన నిలచి అక్కడే ఆగిపోయాయి. ఫొటోవైపూ ఆటలో లీనమైఉన్న పసి వాని వైపు మార్చి మార్చి చూస్తున్న బావమరది ఉద్దేశ మేమిటో తెలియక చెపుతున్న మాట మధ్యలోనే ఆపేసి మౌనంగా ఉండిపోయాడు రఘురామయ్య.

"చూడు బావా ! ఆ ఫొటో మన చంద్రానిది కదూ ?" గోడమీది ఫొటో వైపు చూపిస్తూ అడిగాడు కామేశం.

"అదేమిటి బావా ! ఆ ఫొటో మీ ఇంట్లోనూ ఉందిగా. ఏడాది పుట్టిన రోజునాడువాళ్లమ్మపట్టుపట్టితీయించింది" అంటూ ఆ ఫొటో గోడనుండి తీసి కామేశానికి అందించబోయాడు రఘురామయ్య.

కాని కామేశం దాన్ని అందుకోలేదు. ఆడుకొంటున్న పసివాడివైపు వేలు చూపిస్తూ "మరి ఈ ఫొటో" అని అడిగాడు.

తీక్షణంగా వినవచ్చిన ప్రశ్నతో వెన్ను చరచినట్లై అంతలోనే తమాయించుకొని, "ఇదీ చంద్రానిదే" అన్నాడు శాంతంగా రఘురామయ్య.

"ఔను నేనూ అదే అనుకొన్నా. అదే కనుముక్కుతీరు, అదే పోలిక ! అంతా అదే ముద్ర. ఆ ఫొటోలో ఉన్న చంద్రానికి వీడికి ఏమీ తేడాలేదు. అప్పు డప్పుడూ వినిపించిన మాటల్ని కిట్టని వాళ్ళు కల్పించిన రూమర్సు అని కొట్టి పారేశా ! హుం."

తీక్షణంగా తనవైపే చూస్తూ మాటాడుతున్న కామేశాన్ని, మాట మాటకూ కదలుతున్న అతని బారు మీసాల్ని చూసి ఝడిసిన పసివాడు ఆట

మాని ఒక్కసారిగా 'బాపురు' మన్నాడు. కొడుకు ఏడుపు వినిపించగానే ఒక్క పరుగున వచ్చి వాడిని ఎత్తుకొని వెళ్లింది అరవింద.

"అరవిందంటే ఆ అమ్మాయేనా? మీ ఆఫీసులో చూసిన జ్ఞాపకం. టైపిస్టు కదూ?'' అడిగాడు కామేశం.

'ఔను, రెండేళ్ల క్రితం మన ఆఫీసులో పనిచేసేది, ఇప్పుడింక అదేమీ లేదు, ఇక్కడే ఉంటోంది.''

''పెళ్ళి కూడా చేసుకొన్నాడా?''

''ఇంకా లేదు. వాడు రాగానే ఏ గుళ్లోనో ఆ మూడుముళ్లూ వేయించి..."

రఘురామయ్య మాట పూర్తి అవ్వక ముందే ''ఏమిటీ!'' అంటూ లేచాడు కామేశం ''వాడు భ్రష్టుడైనది చాలక ఆ సంతంతా ఇక్కడ ఉంచి వెళ్లాడా? వాడికి బుద్ధి ఎలాగా లేదు, నీకు మతికూడా లేకుండా పోయిందేమి పాపం! ప్రతి కులటా....''

"అబ్బ! ఆపరా కామేశం. నన్ను పూర్తిగా చెప్పనియ్యి. ఆ అమ్మాయి అయినింటి ఆడపిల్ల. తండ్రి చిన్న తనంలోనే పోతే గతిమాలి ఉద్యోగంలో చేరింది. అంతే కాని నీతిమాలినది కాదు. నీతిమాలి ప్రవర్తించినవాడు నీ మేనల్లుడు. ఆ తప్పు దిద్దవలసినవాడిని నేను. అదీ కథ ఓపిక ఉంటే అంతా చెపుతా విను" అంటూ తను విన్నదంతా ఏకరువు పెట్టాడు రఘురామయ్య..

అంతా విని పగలబడి నవ్వాడు కామేశం

"ఓష్ ఇంతేకదా! వెంకన్న మాటమీద ఇంత బ్రహ్మాండం చేశా వన్నమాట! అసలు ఇందులో నిజ మెంతో! వాడు ఈ విషయాలు వ్రాస్తాడా ఎప్పుడైనా?"

బావమరిది నవ్వుతో డీలాపడిన రఘురామయ్య "నాకు అంతా తెలుసన్నది వాడికి తెలియదు కదా! వచ్చాక నెమ్మదిగా చెప్పవచ్చు లెమ్మని నేనూ ఏమీ వ్రాయలేదు" అన్నాడు.

"అయినా నీ కింత బులబాటం ఏమిటి బావా? చంద్రం మైనర్ కాదు. వాడి జీవితాన్ని నిర్ణయించుకొనే హక్కు వాడికి ఉంది. నౌఖరు మాటలు పట్టుకొని నువ్వింత ఆర్భాటం చెయ్యడం నాకేమీ బాగా లేదు."

"వెంకన్న నంత పరాయివాడుగా తీసెయ్యకు కామేశం. చంద్రాన్ని ఇంతప్పటినుండి ఎత్తుకు పెంచింది వాడే. అబద్ధాలు చెప్పేపని వాడి కేముంది?"

అంతవరకు గుమ్మంలోనే నిలబడి వీళ్ళ సంభాషణ అంతా వింటున్న చంద్రంతల్లి కల్పించుకొని చెప్పింది, "తమ్ముడు చెప్పినదాంట్లో తప్పేముంది? మీ మంచి, మీ నౌకరు మంచి ఆలో చించుకుంటున్నారే కాని, తన భార్యను ఎన్నుకొనేపాటి స్వతంత్రమైనా తనకు

ఇవ్వకపోతే చంద్రం ఏమనుకొంటాడో నని ఎప్పుడైనా ఆలోచించారా! ఇన్నాళ్ల సహచర్యంలో నే నెప్పుడూ నోరువిడిచి మిమ్మల్నేమీ అడిగింది లేదు. ఈ ఒక్కటే కోరుకొంటున్నా —చంద్రానికి మీరేమీ చెప్పిపెట్టవద్దు. వాడు తప్పుచేస్తే వాడే దిద్దుకొంటాడు. వాడి స్వేచ్ఛకు అడ్డురానని మాట ఇవ్వండి" అంటూ చేయి చాపింది రాజేశ్వరి.

* * *

పేకాట జోరుగా సాగిపోతోంది. మేనమామా మేనల్లుళ్ళ మధ్య మంచి పోటీ వచ్చింది ఆట రసకందాయనంలో పడింది. ఇంతలో తప్పటడుగులతో ఇల్లంతా తిరుగుతూ అటుగా వచ్చిన పసివాడు గడప దాటలేక బోరగిలా పడ్డాడు. చేతిలోని పేక బోర్లించి ఒక్క అదుటున వెళ్ళి వాణ్ణి సందిట చేర్చుకొని ఓదార్చడం మొదలుపెట్టాడు చంద్రమోహన్. అది చూచి కామేశం అసహనంతో చేతిలో పేక నేలకేసి కొట్టి లేచి నిలబడ్డాడు.

గుమ్మాలెక్కి లోనికి వస్తున్న వెంకన్న సంతోషంతో పసివాడిలా కేరింతలు కొట్టాడు —

"నాన్నగారు తమరు వస్తున్నారని వ్రాస్తే వెంటనే బయలుదేరి వచ్చేశా. వచ్చినందుకు నా కళ్ళు చల్లబడ్డాయి. బుల్లిబాబు అంతా తమ పోలికే. చిన్న బాబూ! ఆ అమ్మ తమ పక్కన నుంచుంటే కళ్ల కరువుతీరా..."

వెంకన్నను మాట పూర్తిచెయ్యనివ్వ లేదు కామేశం. మధ్యలోనే తన కల్పించుకొని "సరి సరి, వెంకన్నా! ఎప్పుడొచ్చావు? పెద్దముండావాడివి, అమ్మగారు నీ కోసమే చూస్తోంది. వెళ్ళి కాస్త ఎంగిలిపడిరా. మాటలకేం తరువాత చెప్పుకోవచ్చు వెళ్ళు" అంటూ తొందరపెట్టి అతన్ని పెరటి వైపుకు పంపేశాడు.

"ఏమిటి మామయ్యా వెంకన్న చెబుతున్నది?" అని అడిగాడు చంద్రమోహన్.

"బాగానే ఉంది నీ ప్రశ్న! వెర్రి వాడి మాటలకు భాష్యం చెప్పడం నా తరమా! ఈ మధ్య వాడికి మతి చలించింది. వయసూ అయిపోయింది. అందుకే మీ నాన్న వాడికి "నెలకింత" అని ఏర్పాటుచేసి కొడుకు దగ్గరకు పంపేశాడు."

"అయ్యో! పాపం!" అని నిట్టూర్చాడు చంద్రం.

చంద్రమోహన్ పసివాణ్ణి కిందకు దింపకుండగా ఎత్తుకొనే ఉండడం కామేశానికి ఉడుకెత్తిస్తోంది. కాని పైకి తేలకూడని పరిస్థితి. గుంభనంగా "అదేమిటిరా చంద్రం! వాణ్ణి అలాగే ఎత్తుకొని ఉండిపోయావు! బట్టలు

మురికి చేస్తాడు. క్రిందకు దింపేయ్. ఇంటికి పోతాడు.

"నువ్వు కాస్త స్టేషన్‌కి వెడితే నే నొక్క క్షణం కునుకుతీస్తా. మెయిల్లో మంజుల వస్తుంది. నువ్వు దానిని రిసీవు చేసుకొంటే నాకు ఎంతో ఉకారంచేసిన వాడి వవుతావు" అన్నాడు సోఫాలో వాలి కళ్ళు మూసుకొంటూ.

మేనమామ ఆ పసివాని యెడల అంత నిర్దయగా మాటాడడం నచ్చలేదు చంద్రమోహన్‌కి. వాడిని ఎత్తుకొనే వంటగది వైపుగా వెళ్ళాడు.

మధ్యాహ్నం టిఫిన్ చెయ్యడానికి సంబారాలు సమకూర్చుతూ అలమారు దగ్గర నిలబడి ఉంది అరవింద. తల్లిని చూడగానే "అమ్మ అమ్మ అంటూ గుంజుకోడం మొదలుపెట్టాడు పసివాడు. ఆ సందడికి వెనుదిరిగిన అరవింద చూపులు చంద్రమోహన్ ముఖంమీద క్షణం తారాడాయి. వెంటనే తలవంచు కొని పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

అంతలో రాజేశ్వరమ్మ లోపలకు వచ్చింది. పసివాణ్ణి చూపుతూ "అమ్మా ఎవడే ? వీడు మన ఇల్లంతా సందడిచేస్తూ ఇంత ముద్దుగా తిరుగు తున్నాడు" అని అడిగాడు చంద్ర మోహన్.

తెల్లబోయింది రాజేశ్వరి. చివరకు "వీడా ? వీడు అరవింద కొడుకు" అంది.

ఔను. అరవింద. తను ఇందాకా చూసింది అరవిందనే. తమ ఆఫీసులో టైపిస్టు. అప్పటి చలాకీతనం లోపించడం వల్లనో ఏమో తను వెంటనే ఆనవాలు పట్టలేకపోయాడు. ఈమాటు కనిపిస్తే తన కృతజ్ఞత చెప్పాలి. ఆమె థీసిస్ ఎంత చక్కగా టైప్ చేసింది. అనుకొన్నాడు చంద్రం.

"ఒరే చందూ ! వాళ్ళ వీళ్ళ పిల్లలు నీకెందుకురా. త్వరలోనే నీ పెళ్ళి జరిపిం చెయ్యాలి అనుకొంటున్నాను. మంజూ చదువుకూడా అయిపోయింది. మామయ్య ఏకంగా ముహూర్తం పెట్టించుకొని వెళ్ళడానికే వచ్చాడు," అని రహస్యంగా మందలించింది రాజేశ్వరి.

"మావయ్య అంతస్తుకి మనం ఎప్పుడు ఎదిగామమ్మా ?" అడిగాడు చంద్రమోహన్.

"అదేమిటిరా ! మొదటినుండి పెట్టినా, తిట్టినా వాళ్లే కదురా మనల్ని ఆదుకొన్నది ! మంజు చిన్నతనంచేత కొంచెం పెంకిగానే ఉండేదనుకో, కాని ఇప్పుడు పెద్దదయ్యిందిగా, చాలా మారింది. కాసేపట్లో వస్తుంది కదా, నువ్వే చూద్దువుగాని."

"అమ్మా ! నాన్న ఏరి ? నేను వచ్చాక కాసేపు కనిపించారు, అంతే. మళ్ళీ ఆయనతో మాటాడడమే పడలేదు. ఎక్కడకు వెళ్లారు ?"

"ఏమో ! కన్నబిడ్డకు ముఖం తప్పించి తిరగవలసిన పని ఏమి

వచ్చిందో ఆయనకు ! ఒక్కగా నొక్క కొడుకువి, నీ బాగుకోసం..."

ఇంకా ఆమె మాట పూర్తవ్వకముందే "ఏరా ! నువ్వింకా ఇక్కడే ఉన్నావా!" అంటూ వచ్చాడు కామేశం

"ఇదిగో, ఇప్పుడే వెడతా" అంటూ బయలుదేరాడు చంద్రమోహన్.

"వాడిని ఇక్కడ దించి వెళ్ళరా" అంటూ వెనుకనుండి కేకేసింది రాజేశ్వరి.

"వంటగది పిల్లలు ఆడుకొనే చోటు కాదమ్మా, మళ్ళీ ఏదైనా దెబ్బతగుల్చుకో గలడు" అంటూ పసివాడిని ఎత్తుకొనే వెళ్ళిపోయాడు చంద్రమోహన్

* * *

మంజుల వచ్చినదగ్గరనుండి క్షణం విడవకుండా చంద్రమోహన్‌ని అంటి పెట్టుకు తిరుగుతోంది. ఆరోజు తరువాత అరవింద మళ్ళీ అతనికి కనిపించలేదు. పసివాడు ఇదివరకటిలా ఇంట్లో తిరగటం లేదు. కాని అరవిందని చూసినది మొదలు అతనిలో ఏవేవో జ్ఞాపకాలు తెరలుతెరలుగా పుట్టి అతని మనసును కలత పెడుతున్నాయి ఆమెను గురించి తెలుసుకోవాలన్న తహతహ బయలు దేరింది అతనిలో.కాని ఎవరినీఅడగడం?

వెంకన్న కోసం వెతికిన చంద్రమోహన్‌కి అతడు ఆ రోజునే వెళ్ళి పోయాడని తెలిసింది. తీరికగా తనతో మాటాడకుండగా వెళ్ళిపోయినందుకు బాధపడినా స్థిరంలేని మనిషి కదా అని సరిపెట్టుకొన్నాడు.

ఆ రోజు మంజుల సినిమా ప్రోగ్రాం పెట్టింది. ఎంతకీ ఆమె ముస్తాబు తెమలక పోవడంతో కొంచెంసేపు తోటలో తిరిగి రావాలనిబయలుదేరాడు చంద్రమోహన్. పొన్నచెట్టు తిన్నెమీద కూర్చొని తల వంచుకొని జాజిపూలు మాలగా కడుతోంది అరవింద. ఆ సమీపంలోనే ఆడు కొంటున్నాడు పసివాడు. ఆ అవకాశాన్ని జారవిడుచుకోదలచలేదుచంద్రమోహన్. ఆమెను సమీపించి-

"మీరు-మీరు అరవింద కదూ" అన్నాడు.

అనుకోని పలకరింపుకు తబ్బిబ్బై ఉలికిపాటుతో లేచినిలబడింది అరవింద.

"మీరు సరిగా సమయానికి ఫీసిన్ అందించారు. అప్పుడు మీకు నేను సరిగా థాంక్సయినా చెప్పలేదు. క్షమించాలి" అన్నాడు.

అంతలో మంజుల పడిగాలిలా దూసుకువచ్చి "ఏమిటి ! ఇంకా మాల కట్టనే లేదూ ! పోనీ, అయిన మట్టుకు ఇవ్వు,చాలు" అంటూ అరవింద చేతిలోని మాలను లాక్కొని జడలో తురుము కొంది.

హతాశురాలైన అరవింద నీరు నిండిన కళ్లతో ఒక్క క్షణం చంద్రమోహన్ వైపు చూసి తలవాల్చి పసివాడి వైపుగా నడిచిపోయింది.

"రా బావా! అసలే ఆలస్యమయి పోయింది అనుకొంటూంటే నీకోసం వెదకడం ఒక పనై పోయింది" అంటూ చనువుగా అతని నడుముచుట్టూ చెయ్యి వేసి నడిపించుకుపోయింది మంజుల.

* * *

"అవే కళ్ళు! అదే చూపు!! ఈ రెండు సంవత్సరాలు తన్ను అనుక్షణం వెంటాడినవి ఈ చూపులే. దిగులు, భయము, తిరస్కారము-ఒక్క చూపులో ఎన్ని భావాలు!!!"

మంజులతో సినిమాకు వెళ్ళాడన్న మాటేగాని చంద్రమోహన్ దృష్టి తెరపై నిలువలేదు. అతనికి ఆ క్షణం అరవిందే గుర్తుకు రావడం మొదలుపెట్టింది. మస్తిష్కంలోని మారుమూల గవాక్షాలు తెరుచుకొని ఏవేవో జ్ఞాపకాలు తొంగి చూడడం మొదలుపెట్టాయి.

ఆ రాత్రి ఇంటికి వచ్చి పడుకొన్నాడన్నమాటేగాని అతనికి నిద్ర పట్టింది లేదు. క్రమంగా అతని ఆలోచనలు ఒక రూపం దాల్చడం మొదలుపెట్టాయి. ఆ నీరవ నిశీధిని చీల్చుకొంటూ "అయ్యో! వదలండి, నేను-నేనుఅరవిందను. నన్ను విడిచిపెట్టండి," అన్న ఆర్తనాదాలు గుండె లవియజేస్తూ వినవచ్చాయి. పశ్చాత్తాపంతో అతని హృదయం దహించుకుపోయింది. భ్రాంతితో నిండి ఉన్న అతని మనసుకు తిరిగి ఆనాటి సంఘటనలు ప్రత్యక్షం కావడం మొదలుపెట్టాయి.జాలిగా, దీనంగా రక్షించమని ప్రార్థిస్తూ తనవైపు చూస్తున్న ఆ కళ్లు, అంతులేని అసహ్యాన్ని, దుఃఖాన్ని విరజిమ్ముతున్న ఆ చూపులు, అసహాయతతో అదరే పెదవులు, కందిపోయిన చెక్కిళ్ళ వెంట ధారగా కారిపోతున్న కన్నీరు, సుకుమారమైన చేతులు ముందుకు చాపి తన దశ్చర్యలను అరికట్ట ప్రయత్నించే ఆమె రూపం అతని కనులకు కట్టింది. "అరవిందా!" అంటూ ఆక్రోశించాడు చంద్రమోహన్

ఆదరంతో అక్కున జేర్చుకొని ఆకలి తీర్చేవారు కనిపించక ఏడుస్తూ ఇల్లంతా తిరుగుతున్న పసివాణ్ణి,అప్పుడే లేచివచ్చిన మంజుల నిద్రాభంగమయ్యిందన్న కసితో "వెధవ పోరు అప్పుడే మొదలయ్యింది" అని కసురుతూ చెయ్యెత్తి అదిలించబోయింది. కాని అంతలోనే "ఆగు" అన్న గద్దింపు వినరావడంతో కంగారుగా ఎత్తినచెయ్యి దించేసి తెల్లబోయి చూసింది.

ఒక్క పరుగున వచ్చి పసివాణ్ణి రెండుచేతులా ఎత్తి గుండెలకు హత్తుకొని ఓదార్చసాగాడు చంద్రమోహన్. ఆ సందడికి గదిలోనుండి బయటకు వచ్చాడు రఘురామయ్య.

"నేను చెయ్యరాని అకార్యం చేశానని ఇప్పటికి గాని తెలుసుకోలేకపోయా. నన్ను క్షమించి నా తప్పు దిద్దుకొనే అవకాశం నా కియ్యండి నాన్నా" అన్నాడు

తండ్రిదగ్గరకు వస్తూ. రఘురామయ్యకు అంతా అర్థమయింది. తనంత ఉన్నతంగానూ ఎదిగిపోయిన కొడుకు ముఖంలోకి వెర్రిగా చూసి "అవకాశం చెయ్యి జారిపోయింది బాబూ!" అన్నాడు అతని కనుకొలుకుల్లో రెండు బాష్ప బిందువులు తళుక్కుమన్నాయి.

"నాన్నా! ఏమిటి మీరు అంటున్నది" ఆక్రోశించాడు చంద్రమోహన్.

రఘురామయ్య మరి మాటాడకుండా జేబులోనుండి నలిగిపోయిఉన్న కాగితం మడతతీసి కొడుక్కి అందించాడు.

"మామయ్యగారూ–అని పిలిచే చనువు మీరు నాకు ఇచ్చారు. ఆ ఆత్మీయతతోనే కలకాలం మీరు నన్ను జ్ఞాపకం ఉంచుకో గలరని నాకు తెలుసు.

గాజు పూసవంటి ఆడబ్రతుకు ఒక సారి చితికిపోతే మరి అతుకబడదు మీరు ఔదార్యంతో నా బ్రతుకు బాగు చెయ్యాలని చూశారు కాని అది మీ గృహ ఛిద్రాలకు దారితియ్యడం నేను సహించలేను.

నేను ఎవరికోసం బ్రతకడం తప్పని సరి అనుకొన్నానో వాళ్ళను గురించిన చింత ఇంక నాకు లేదు ప్రసాద్ కల్యాణి మీ చల్లని నీడలో మంచి జీవితాన్నే అందుకోగలరన్న ధైర్యం నాకు ఉంది. ఇంక పసివాడా–వాడు మీవాడే.

ఇక ఉంటా

నమస్కారములతో అరవింద."

"అరవిందా!" అంటూ దుఃఖంతో కుప్పకూలిపోయాడు చంద్రమోహన్.

* * *

"మీ రిచ్చిన టెలిగ్రాం ఆ మన్యం చేరుకొనేందుకు మూడురోజులు పట్టింది. అందగానే బయలుదేరినా మరి మూడు రోజులు సాగింది నా ప్రయాణం. నిజంగా మీరు పూనుకొని నా బాబును నాకు దక్కించారు."

"మేము చేసినదెంత. అంతా ఈమే చేసింది. ఉద్యోగానికైతే నర్సుగాని, బాబును కన్నతల్లిలా ప్రతి క్షణం కనిపెట్టిఉండి సేవచేసింది."

బాబును నిద్రపుచ్చి వంగి దుప్పటి సరి చేస్తున్న నర్సు దగ్గరతో సరళ మాటలు వినిపించేసరికి వెనుదిరిగి చూసింది. కాని తనకు ఎదురుగా నిలచిఉన్న వ్యక్తిని చూడగానే ఆమె ముఖంలో రంగులు మారాయి. క్షణంలో సగం అతని ముఖంలోకి చూసి చూపులు మరల్చుకొని రెండడుగులు వెనక్కి వేసింది.

"అవే కళ్ళు! సంవత్సరాల తరబడి నా మనసు నంతటిని ఆక్రమించుకొని ఉన్న ఆ కళ్ళను నేనెలా మరచి పోగలను" అంటూ గొణుక్కున్నాడు చంద్రమోహన్.

"నన్ను క్షమించగలవా అరవిందా" అంటూ తన చేతులను అందుకొని దీనంగా క్షమాభిక్ష నర్థిస్తూ తనవైపే

చూస్తున్న చంద్రమోహన్‌ని కాదనలేక పోయింది అరవింద.

"మరి పెళ్ళిమాట తలపెట్టకుండా బిడ్డతోడిదే లోకంగా బ్రతుకుతున్నాడు మానవుడు!" అన్న సరళ మాటలు జ్ఞప్తికివచ్చి తెరిపినపడ్డట్టయింది ఆమె మనసు.

పరిసరాలను మరచి,తమ్ము తామెరుగకుండా పెనవేసుకుని గుండెల బరువు తీరా దుఃఖిస్తున్న ఆ జంటను చూసి "హేపీ రియూనియన్" అంటూ కొంగుతో కళ్లు ఒత్తుకుంది సరళ.

అప్పుడే అక్కడకు వచ్చిన మేట్రన్ "మరే! నేను చెపితే ఒక పట్టాన నమ్మిందికాదు చచ్చిపోడానికి దూకితే సముద్రం ఒడ్డుకు కొట్టేసింది పుణ్యాత్ము లెవరో తెచ్చి ఆసుపత్రిలో చేర్పించారు చావుబతుకులతో పోరాడి మొత్తానికి బ్రతికింది. ఎందుకు బతికించారంటూ గోలచేసింది. ముందు ముందు ఏమి యోగముందో చావు తప్పింది. అని బలవంతాన నచ్చజెప్పి నా దగ్గరే ఉంచుకొని నర్సు ట్రైనింగులో చేర్పించా.

ఇన్నాళ్లకు ఆ దేవుడికి దయకలిగింది. అయినవాళ్ళు తా ఒకటయ్యారు. నా బాధ్యత తీరింది" అంటూ చేతులు జోడించింది.

విజిటింగ్ అవర్సు పూర్తి అయిన దానికి గుర్తుగా ఆసుపత్రి గంట గణగణా మ్రోగింది.

*           *           *

శిశిరం గడిచిపోయింది. వసంతం ముదిరింది. చల్లగాలికోసం తపించిపోతున్న జనం ఆరుబయట పక్కలు పరచుకొంటున్నారు.

ఆవేళ వైశాఖ పూర్ణిమ. చల్లదనాన్నిచ్చే వెన్నెల అంతటా పరుచుకొని ఆహ్లాదకరంగా ఉంది డాబామీద పరచబడి ఉన్న పరుపుమీద పడుకొని ఉన్నాడు చంద్రమోహన్. తండ్రి ప్రక్కన పడుకొన్నాడు కొడుకు.

అంతలో మల్లెల వాసన మగువ రాకను సూచించగా లేచాడు చంద్రమోహన్. చప్పుడుకాని అడుగులతో అతనిని సమీపించిన అరవింద "చంద్రుడు బాగున్నాడు కదూ" అంది కొంటెగా.

చేయిచాపి ఆమెను చేరదీసుకొంటూ, "ఆ మచ్చకనక లేకపోతే ఇంకెంత బాగుండేవాడో" అంటూ నిట్టూర్చాడు చంద్రమోహన్.

"అది మచ్చకాదు, కుందేలు పిల్ల. తాతయ్య చెప్పాడు" అంటూ లేచి వచ్చాడు బాబు.

"ఒరి! నువ్వింకా నిద్రపోలేదా" అంటూ కొడుకును ఎత్తుకొన్నాడు చంద్రమోహన్.

"శశాంకుడు అందగాడే" అంటూ తృప్తిగా నవ్వుకొంది అరవింద.



# గరళకంఠుడు

— శర్వరి

స్వామీజీ పేరు చాలా కాలంగా పత్రిక లలో చదవటం, శ్రీవారి లీలలు వినడమే కాని, వారిని చూచింది లేదు. నాకు చిన్నప్పటినుండీ స్వాములన్నా, బాబాలన్నా వల్లిమాలిన ఇష్టం. నేనూ ఒకనాటికి సన్యసించి తీరతానని నేను పుట్టకముందే మా తాతయ్య జోస్యం చెప్పాడట. అందుకేనేమో నాది పుట్టి నప్పటినుండి సన్నాసి బ్రతుకైంది.

స్వామి శివప్రసాద్ పేరు మన దేశంలోనే కాదు, విదేశాలలోనూ మ్రోగి పోతున్నది. ఆయన వయస్సు 35 అయినా, 8500 సంవత్సరాలు హిమాల యాల్లో తపస్సు చేశారని భక్తులు చెబు తుంటారు. ఆయన నిత్య యవ్వనుడు. తెల్ల గడ్డంలేని స్వాముల్ని జ్ఞానులుగా మన మనస్సు అంగీకరించదు. కాషాయ

బట్టలు, కమండలం అందరూ ఆమో దించే మేకప్, స్వాములకు.

స్వామి శివప్రసాద్‌కు సినిమా హీరోలకున్న గ్లామర్ వుంది. కారణం ఆయన సహజ అందగాడు. అధ్యాత్మి కంగా ఆయన ఎంతటి గొప్పవాడో, చాలామందికి తెలియనట్లే నాకూ తెలి యదు. తెలుసుకుందామనే ఆయన పాద సేవ ప్రారంభించాను. ఆయన కళ్ళు మూసుకుని శూన్యంలోంచి విభూతి, విగ్రహాలు, స్మగల్డ్ గడియారాలు, బంగారం గొలుసులు, నోట్ల కట్టలు సృష్టించి భక్తులకుబహూకరిస్తుంటే నాకు మతిపోయినట్లయ్యేది.

స్వామీజీ మా వూరు వచ్చినప్పటి నుండి శుశ్రూష ప్రారంభించాను. జనం వేల సంఖ్యలో ఆయన దర్శనానికి రాసాగారు. నగరంలో డబ్బుగలవా రెందరో వచ్చేవారు. పేదవారికి ఓ పట్టాన శ్రీవారి దర్శనభాగ్యం లభించేది కాదు. ఒక్కసారి ఆయన్ని దర్శిస్తే ఆయన పాదధూళి స్వీకరిస్తే ఈ జన్మంలోచేసిన పాపాలన్నీ పటాపంచలై పోతాయి.

ఆ రోజు మామూలుగా భక్తులు రాసాగారు. ఒకామె వచ్చి ఆయన పాదా లకు నమస్కరించగానే స్వామీజీ షాక్ కొట్టినట్లు ఉలిక్కిపడ్డారు. పాదాలు వెనక్కి లాక్కొని ఆమెవైపు తీక్ష ణంగా చూచారు. క్షణంలో ఆయన కళ్లు అగ్నిగోళాలైనాయి. ఆమె ఆయన పాదాలు పట్టి వదలలేదు. కన్నీటితో అభిషేకం చేస్తూ "నన్ను క్షమించరూ" అని వేడుకుంది

"సుజాతా" అన్నారు స్వామి దగ్గుత్తికతో. ఆమె లేచి విసవిస పరుగు తీసింది. ఆయన పిలుస్తున్నా వినిపించు కోకుండా, వెనుతిరిగి చూడకుండా వెళ్ళి పోయింది.

స్వామీజీ మొహం వివర్ణమైంది. మిగతా భక్తులు ఎవ్వరికీ దర్శనం యివ్వమని పంపించివేశారు.

కొన్ని క్షణాల తర్వాత నేనే ధైర్యం చేసి, "ఎవరు స్వామీ ఆమె?" అని ప్రశ్నించాను.

ఆయన బవిరిగడ్డాన్ని సవరించు కుంటూ చిద్విలాసంగా నవ్వారు.

"ఈ లోకం చాలా విచిత్రమైంది నాయనా! ఎప్పుడు ఏ సంఘటన, ఏ విపరీతానికి దారితీస్తుందో చెప్పలేం. నేను సన్యాసి కాకముందు, మీలాగా సంసారినే. అప్పుడు నాకో మిత్రుడుండే వాడు మోహన్ అని. అతని ఇల్లాలు ఈ సుజాత. కర్మవశాత్తు మోహన్ జైల్లో పడ్డాడు. ఆ రోజు జైలునుండి అతను విడుదలయ్యే రోజు."

స్వామీజీ చెప్పడం సాగించారు...

"పెరిగిన గడ్డం చీదరగా వుంది. అవును కదూ! అది మనిషి నిరాశకు చిహ్నం. మోహన్ అడుగులో అడుగు వేసుకుంటూ బయటపడ్డాడు. గేటువద్ద

ఇద్దరు సెంట్రీలు తుపాకులతో వీడ్కోలు చెప్పారు. ఇంతకాలం తనకు ఆశ్రయం యిచ్చిన జైలును వెనుతిరిగి చూచాడు. ఎత్తైనగోడలు ఇనపగేటు,దానిలో చిన్న ద్వారం... కొన్ని క్షణాలు నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. జీవితంలో ఓ దుర్భర మైన అధ్యాయం ముగిసింది... విధి మనిషిపట్ల ఎంత క్రూరంగా ప్రవర్తి స్తుంది అనుకున్నాడు.

మోహన్ కళ్లు వర్షిస్తున్నాయి. అవి ఆనందబాష్పాలు. ఇంతకాలం జైలు జీవితం గడిపి, ఇప్పుడు విడుదల అయి నందుకు తనకు కలిగింది ఆనందమా! సెంట్రీల నవ్వులు అతన్ని ఈ లోకం లోకి తెచ్చాయి

"ఎరోయ్, జైలొదిలి ఎల్లబుద్ధి కావడంలేదేటి! ఏడుస్తున్నావ్?" అని పరిహాసం చేశాడు ఒకడు

"ఒరే అబ్బాయ్ అంతబెంగపడకు. మనసుంటే మార్గమేలేదా! మళ్ళీ రావా లనుకుంటే ఎవడ్నో చావకొట్టేయ్ సరా సరి తిరుగుటపాలో వచ్చేస్తావ్!" రెండవ సెంట్రీ వాఖ్య.

ఆ సెంట్రీల నవ్వులు,వ్యాఖ్యానాలు, చెవుల్లో గింగురుమన్నాయి. వినలేక చెవులు మూసుకున్నాడు. తను జైలు జీవితంకోసం మోహంవాచిపోయాడా! ఏమిటీ లోకం! అనుకుంటూ ముందుకు సాగాడు ఈ లోకంలోకి, వెలుగులోకి, సభ్య ప్రపంచంలోకి నడిచాడు. ఊరు జ్ఞాపకం రాగానే, కళ్ళు మెరిశాయి. గుండె ఆశలతో నిండింది. అనురాగంతో పులకరించింది. కోటి కోర్కెలతో స్వంత ఊరు బయలుదేరాడు.

నడిచి నడిచి, వేసారి, గంపెడాశతో కొండంత కోర్కెతో ఊరు చేరు కున్నాడు. అల్లంత దూరంలో ఆ కని పించేదే తన ఇల్లు. అందులో ఉంటుంది తన ఇల్లాలు. తనను చూడగానే ఎంత సంబరపడిపోతుందో! అసలు తనను గుర్తిస్తుందో లేదో! మూడేండ్లలో ఎంత మారిపోయిందో! తను గుర్తించగలడా అసలు! ఆనందం పట్టలేక, తనను కావిలించుకుని, భోరున విలపిస్తుంది. తను ఊరడించి ఇంక జీవితాంతం నిన్ను వదలిఉండనని ప్రమాణం చెయ్యాలి. అప్పుడు తన కౌగిలిలో కరిగిపోతుంది. ఓహ్... స్వర్గం...

ఆ స్వర్గం, సుఖాలు ఊహించుకో గానే అతని కళ్ళలోకి వెలుగు వచ్చింది. గుండె గుబగుబ లాడింది. మూడేండ్ల క్రితం సుజాత ఏడ్చింది. ఆ కన్నీరు తనకింకా జ్ఞాపకమే. ఎంతగా కుమిలి పోయింది. ఆమె కన్నీరు తుడిచే శక్తి ఆనాడు తనకు లేకపోయింది.

నాటికి, నేటికి ఊరెంతగా మారి పోయింది. అక్కడక్కడ కొత్త మిద్దెలు, భవనాలు లేచాయి. దేశం సుభిక్షంగావుంది. పొలాలు పచ్చగా వున్నాయి. పంటలు బాగా పండుతున్నట్లుంది. మనుషులు

కూడా సంతోషంగా వున్నారు. తను జైల్లోఉన్న మూడేళ్ళలో దేశ వ్యవస్థే మారిపోయింది. ఊరు రూపు రేఖలే మారాయి. ఎక్కడా కరువు కాటకాలు కనిపించడం లేదు. అప్పుడు ఎండి బీట వారిన పొలాలే. ఇప్పుడు పచ్చగా ఉన్నాయి. కడుపునిండా తినడానికి తిండి దొరుకుతున్నది. చేసుకో డానికి పని దొరుకుతున్నది. అదే మూడేళ్ళ క్రితం పట్టెడు మెతుకులకోసం ఎంత పోరాటం ఇప్పుడు గింజలకోసం ఎంత తపన.

అప్పుడు కరువు విలయతాండవం చేసింది. వర్షం చినుకులేక నేల బీటలు వారిపోయింది. నూతుల్లో తాగడానికి నీళ్ళు లేవు. చచ్చేమనిషిలో సైతం చావని ఆశ. మనిషిని చావనీయని ఆశ. ఒక ప్రక్క జనం మందులమాడి చస్తు న్నారు. మరోప్రక్క పేదల ఆకలిని ఆసరా చేసుకుని కొందరు భాగ్య వంతులవుతున్నారు. తనకు జైలుకు వెళ్ళినందుకు విచారంలేదు. అడకత్తెరలో నలిగిపోలేకపోయాడు. తాను జైల్లోపడ్డా ఒక ప్రాణిని రక్షించగలిగాడు. అదే తృప్తి. ప్రేమకోసం తను ఎంత త్యాగం చేశాడు. కానీ తన త్యాగానికి చిహ్నంగా ఎవరూ తాజ్‌మహల్ నిర్మిం చరు... ఎర్రని ఎండలో మూడేళ్ళ ముందరి జీవితాన్ని-మూడేళ్ళ కారాగారా జీవితాన్ని బేరీజు వేసుకుంటూ వచ్చాడు.

తన ఇల్లు... తన భార్య... ఎంత మధురమైన భావన. తలచుకుంటేనే ఉద్రేకం కలుగుతోంది...కానీ...కానీ.. ఇల్లు ఊహాతీతంగా, నిశ్శబ్దంగా వుంది. సుజాత తనకు ఎదురుగా వచ్చి స్వాగతం చెప్పలేదు. ఎంతటి నిస్తబ్దత. తను రాసిన ఉత్తరం అందలేదా? జైలునో ఉన్న మూడు సంవత్సరాలలో తను ఉత్తరమే రాయలేదని అలిగి ఉంటుంది. కోపం వచ్చి వుంటుంది. అలగడం ఆడవాళ్ళకి జన్మహక్కు. ఏమిటో! తాను మొహం చెల్లక ఉత్తరం రాయలేదు గానీ, ప్రేమ లేక కాదుగా! ఆ విషయం సుజాతకు తెలియదా! ఆమెకోసంగదా, తను అన్ని పాట్లు పడ్డది. చివరకు ఆమె ప్రేమ కోసమేగదా జైలుకు వెళ్ళింది.

జైలుకు వెళ్ళిన కొత్తలో సుజాత రెండురోజుల కొకసారి ఉత్తరం రాసేది. ఆ ఉత్తరాల్లో ఎంత బాధ వక్త్యం చేసేది! తను ఒక్కదానికీ సమాధానం రాయలేదు మొహంచెల్లక.

ఇంటి ఆవరణలో అడుగు పెట్టగానే ఏదో అపశృతి—శంకించింది మనస్సు. ఆ ప్రేమమయి కోసం వేయికళ్ళతో ఎదురు చూసాడు. కోటి కోరికలతో ఎదురు చూసాడు. స్మశాన నిశ్శబ్దం అక్కడ.

ముందర గదిలో ఎవరూ లేరు. కానీ గదినిండా బూజు గలీజుగా, పాడుబడ్డ



కొంపలావుంది. తాను ప్రాణప్రదంగా అలంకరించిన ఫోటోలు లేవు. తనదీ సుజాతదీ పెళ్ళిఫోటో లేదు. తనవైన ఏ వస్తువులూ కనిపించకపోయేసరికి గుండె గుభిల్లుమంది. వెన్నులో శూలం దిగ బొడిచినట్లయింది. ఇది తన ఇల్లు కాదా! పొరపాటున ఏ పాడుపడ్డ కొంపలోనో ప్రవేశించలేదు గదా !

మోహన్ వస్తుతః పిరికివాడు కాదు కానీ ఆ క్షణంలో భయంతో వణికిపోయాడు. లోపలి గదిలోంచి వెకిలి నవ్వులు వినిపించాయి. భయంగా అనుమానంగా లోపలిగదిలోకి చూచాడు. కాళ్ళకు మద్యం సీసాలు తగిలాయి. ఆ ధ్వనికి లోపలున్నవాళ్ళు ఇటు తిరిగి చూచారు. అది తాగుబోతులకు నిలయమైంది. వాళ్ళను చూచి తనెంతగా భయపడ్డాడో, తనను చూసి వాళ్ళు అంతగానే భయపడి పరుగు లంకించుకున్నారు. దొడ్డిగుమ్మాన వెళ్ళి, గోడ దూకి వుడాయించారు తన యిల్లు నిర్మానుష్యం అయింది. తన ఇల్లు వల్లకాడైంది. పిచ్చి ఆవేశంతో వెనుతిరిగి వస్తుండగా తను సుజాత పేర రాసిన కవరు కాళ్ళకు తగిలి వెక్కిరించింది. అయితే సుజాత ఏమైనట్లు ? చచ్చిపోయిందా !

పిచ్చిగా, భారంగా రోజంతా తిరిగాడు. మారిపోయిన ఊరు మహా స్మశానంలా కనిపించింది. తన కళ్ళకు తను సుజాతతో కలిసి గడిపిన రోజులు, అనుభవాలు ఒక్కొక్కటే బాధించసాగాయి. అప్పుడు ఎంత అనుభవించాడో ఇప్పుడు అంత విలపిస్తున్నాడు. కొన్ని నిముషాల క్రితంవరకు తనలో ఎన్ని కోర్కెలు, తన వెన్ని బంగారు కలలు. ఇప్పుడు వాస్తవం కటిక చేదుగా, విషతుల్యంగా మారింది. సుజాత స్థానే శూన్యం మిగిలింది. ఆనందం స్థానే మహా శూన్యం మిగిలింది.

"నా భార్య ! నా సుజాత ఏది ? ఏమైంది ఆమెకు ? ఎవరిని అడగాలి ? ఎదురైన ప్రతి వ్యక్తి తను అడిగేలోగా పారిపోతున్నాడు. తనను చూచి భయపడి ఇళ్ళలో దూరి తలుపులు బిగించు

కుంటున్నారు. తనను పిచ్చివాణ్ణి చూచినట్లు చూస్తున్నారు.

కాళ్ళీడ్చుకుంటూ కాలువగట్టుకు వచ్చాడు. నీ లా టి రే వు లో ఒక అమ్మాయి కనిపించింది. నీళ్ళబిందె చంకన పెట్టుకుని వయ్యారంగా వస్తోంది. ఆమెను అడిగితే సుజాత జాడ తెలియవచ్చునేమో ? తనను చూచి భయపడి పారిపోకపోతే సుమా!

ఆ అమ్మాయి గిరిజ. తను గుర్తించ గలిగాడు. అబ్బ ఎంత ఎదిగింది మూడేళ్ళలో. ఈడొచ్చిన ఆడపిల్ల బుస్సున పొంగుతుంది.

"గిరిజా !" భయంగానే పిలిచాడు, దగ్గరగా వెళ్ళి.

ఆమె నమ్మలేనట్లు చూసి, నొసలు చిట్లించింది.

"నువ్వా" అని ప్రశ్నించబోయింది.

"నేను గిరిజా ... మోహన్‌ని ... గుర్తుపట్టలేవా?"

"అ యి తే, మోహన్, నువ్వు నువ్వేనా ?" ఇంకా ఆ అమ్మాయికి అనుమానం తీరలేదు.

"అవును పాపా, నేనే ! నువ్వు చాలా ఎదిగావు గుర్తించలేకపోయాను సుమా!"

"అయితే నువ్వు చచ్చిపోలేదా మోహన్ ! బ్రతికే వున్నావా ?''

"నేను చచ్చిపోయానని ఎవరు చెప్పారమ్మా ?"

"నిన్ను జైల్లో ఉరిశిక్ష వేశారని చెప్పుకున్నారే మరి !''

"ఎవరు చెప్పుకున్నారు ?"

''సుజాత చెప్పింది."

గిరిజ అబద్ధం చెప్పదు చదువుకున్న పిల్ల. కలవారి బిడ్డ

"లేదమ్మా ! నా సుజాత అంత అభాండం వేసిందంటే నమ్మలేకుండా వున్నాను......నా భార్యకు నేనంటే ప్రేమ కదూ, అందుకని నేను జైల్లో పడ్డాక అలా అబద్ధం చెప్పివుంటుంది." కళ్ళల్లో నీరు ఉబుకుతుండగా, డగ్గుత్తికతో అన్నాడు.

"పోనీ నా సుజాత ఏమైందో చెప్పు పాపా ! ఎక్కడుంది?" గిరిజ నెమ్మదిగా ఓ రాయిమీద కూర్చుంది.

"కూర్చో మోహన్ ! అసలు జరిగిందేమిటో నాకు చెప్పవూ ? నిన్ను గురించి ఎం దు కి న్ని అబద్ధాలు చెప్పారు ?" అడిగింది.

"ఇంకా నా కథ ఎందుకులే పాపా?"

"చెప్పాలి ! చెబితేనే సుజాత ఎక్కడుందో చెబుతా."

మోహన్‌కు చెప్పక తప్పలేదు.

"మూ డే ళ్ళ క్రి త ం పాపా ! నువ్వప్పుడు పట్నంలో చదువుకుంటు న్నావు అప్పుడో పెద్ద కరువొచ్చింది. ఇక్కడ తినడానికి తిండిలేక, త్రాగ డానికి నీళ్ళులేక జనం చచ్చిపోయారు. ఇప్పుడీ పొలాలు- కాలువ చూస్తే అప్పు

దంత కరువొచ్చిందంటే ఎవరూ నమ్మరు. ఎందరో చచ్చిపోయారు. కొందరు వలసపోయారు. జంతువుల్ని చంపి పచ్చిమాంసం తిన్నారంటే నమ్మ్క. మట్టి తిని ఆకలి తీర్చుకున్నారు."

గిరిజ వణికిపోయింది. మోహన్ చెప్పసాగాడు.

"మేము ఎన్నోరోజులు పస్తులున్నాం దాచుకున్న గింజలన్నీ దొంగలు దోచుకుపోయారు. రోజురోజుకీ కరవు అధికమైంది. కూలిచేద్దామన్నా పని దొరకలేదు రూపాయి డబ్బులు దొరికేవి కావు ప్రభుత్వం ఎంతో సహాయం చేసింది పేదలకు గంజి కేంద్రాలు ఏర్పాటుచేశారు. అదీ అందినవారికి అందేది పెద్దల అనుగ్రహం.

నేనెంత ఏడ్చేవాణ్ణో నీకు తెలియను పాపా ! కన్నీరు ఆకలి బాధను తీర్చలేరని తెలుసుకున్నాను. ఎలాగో డబ్బు సంపాదించాలి. నా సుజాతను బ్రతికించుకోవాలి ! అదే నా లక్ష్యం. అదే నా ధ్యేయం.

నా ప్రాణానికి ప్రాణంగా, నా జీవన జ్యోతిగా ప్రేమించిన సుజాత ఆకలితో చచ్చిపోతుంటే చూడలేకపోయాను. గంజినీళ్ళు కూడా దొరకని పరిస్థితుల్లో గుండెను రాయి చేసుకున్నాను. పట్నం బయలుదేరాను. చేతికి అందిన వస్తువల్లా దొంగిలించి పట్నంలోనే అమ్మివేసి డబ్బు సంపాదించాను. ఆ క్షణంలో దొంగతనం పాపమని అనిపించలేదు. నిజాయితీగా బ్రతికే అవకాశం లేక, ఆకలిబాధ తట్టుకోలేక దొంగనైనాను. రెండురోజులు ఎంతగా కుమిలిపోయానో మాటల్లో చెప్పలేను పాపా ! ఎవరికీ ముహం చూపించలేకపోయాను. వెలుగును చూడలేకపోయాను. నేను ప్రేమించిన సుజాతకోసం, నా భార్య కోసం, దొంగనై, ఆమెకే నా మొహం చూపించలేకపోయాను క్రుంగిపోయాను. సిగ్గు, భయం నన్ను క్రుంగదీసింది.

చివరికి తెగించి సుజాతతో చెప్పాను, నేను చేసిన నీచపు పనిగురించి. ఆమె ఏడ్చింది. నేను అంతగా దిగజారిపోతానని ఆమె అనుకొని ఉండదు

"తిండికిలేకపోతే చద్దాం దొంగతనం మాత్రం చేయకండి. ఆ పాపపు కూడు నేను తినలేను...ఆ పాపం నేను చూడలేను" అని ఏడ్చింది.

"ఏది పాపం ! బ్రతకడమే ఒక పాపం అయినప్పుడు, ఏ పాపం చేస్తేనేం !"

మూడు నెలలు గడిచాయి. తన మాంగల్యం పై ప్రమాణం చేయించుకుంది నా చేత. 'నేను దొంగతనం చేయనని.' అలా చేస్తే తనకూ నాకూ ఋణం తీరినట్లే అన్నది.

ఓ రోజు పట్నం వెళ్ళాను ఉద్యోగం కోసం ఉద్యోగం కాదుకదా, కనీసం

కూలిపని కూడా దొరకలేదు. కరువు మరీ విజృంభించింది. ఇంటికి తిరిగి వచ్చాను. చనిపోయిన వాళ్ళని పూడ్చ డానికి ఊరిపెద్దలు, పొలిమేరల్లో గోతులు త్రవ్వించారు. ఓ రాత్రిపూట వెళ్ళి ఆ గోతుల్లో పడుకుని మట్టి కప్పు కుంటే ఈ బాధలుండవు అనిపించింది. సుజాతకిచ్చిన మాట నిలబెట్టుకోవడం నా వల్లకాదు. పాపం చేయాలి. రేపు నరకానికి వెళ్ళినా సరే! ఏది పాపం, ఏది పుణ్యం! రెండింటికి కర్త భగవంతుడే రెండు పనులూ మనచేత చేయిస్తున్నది ఆ భగవంతుడే మనం నిమిత్తమాత్రులం అనిపించింది. భారం భగవంతునిపై వేసి బయలుదేరాను. పట్నం చేరాను. చీకటిపడేవరకు అక్కడక్కడ తచ్చాడాను.

అలసిపోయి ఓ దేవాలయ ప్రాంగణంలో చేరి ఇన్ని నీళ్ళు త్రాగి సొమ్మ సిల్లిపోయాను. ఎంతసేపు నిద్ర పోయానో తెలియదు కళ్ళు విప్పే సరికి చుట్టూ పండువెన్నెల. నాలో కరకరలాడే ఆకలి. ఎదురుగా దేవాలయం గర్భగుడిలో దేవుడి ఉనికిని చెప్పే ప్రమిద దీపం. గుళ్ళో ప్రవేశించాను. కొన్ని నిమిషాలు దైవాన్ని ప్రార్థించాను. ఈ బ్రతుకునుండి విముక్తి కలిగించమని కష్టాలలో దేవుడు గుర్తుకు వస్తాడంటారు. అసలు కష్టాలు వచ్చినప్పుడే దేవునిపై నమ్మకం పోతుంది. విగ్రహంముందు తన్మయత్వంతో గడిపాను.

నా ప్రార్థన భగవంతుడు విన్నాడా? పేదవాడి ఆకలి అరుపులు, విన్నపాలు దేవుడనేవాడు వింటే, ఇంత కరువు, ఇన్ని ఇక్కట్లు వుండవు ... దరిద్రు డంటే దేవుడికీ అసహ్యమే.

"భగవాన్ నన్ను క్షమించు. ఇప్పటికే నన్ను దొంగగా అబద్ధాల కోరుగా, దుర్మార్గుడుగా నీవు ఖర్చురాసి వుంటావని తెలుసు. ఏం చేస్తాను చెప్పు. నా కర్మ, నా పూర్వజన్మ దుష్కృతం. నేను కలవారి ఇంట అద్దాల బిడ్డగా పుట్టివుంటే ఈ పని ఎందుకు చేస్తాను చెప్పు! ఈ తప్పు దరిద్రుడుగా పుట్టించిన నీదికాని, నాది కాదయ్యా! నే నొకడినే అయితే చచ్చిపోయేవాణ్ణి. ఆత్మహత్య చేసుకుని వుండేవాణ్ణి. కాని నన్ను నమ్ముకున్న నా ఇల్లాలు, సుజాత, ఆమెను పోషించవలసిన బాధ్యత నాది కదా! నువ్వే చెప్పు భగవాన్! నేను దొంగతనం చేసేది ధనాశతో కాదు. ఒకరిని దోచుకోడానికి కాదు. ఈ కడుపు కోసం. ఆకలి తీరడంకోసం! ఓ ఆడ కూతురును చేజేతులా చంపలేకనయ్యా. హత్యకన్న దొంగతనం మేలుకదా!

నా ప్రార్థన భగవంతుడు విన్నాడు! ఎదురుగా దీపం వెలుగులో వెండి పళ్ళాలు ధగధగలాడాయి. పళ్ళాల నిండుగా పళ్ళు, ఫలహారాలు. ఎవరో ధర్మాత్ములు పూజలుచేసి వెళ్ళారు. ఈ వెండి పళ్ళాలు అమ్మివేస్తే రెండు నెలలు గడుస్తుంది ఈలోగా వర్షాలుపడవచ్చు. రోజులు మారవచ్చు

భగవంతునికి వెండిపళ్ళాలు లేక పోతేనేం. అవి ఇరువురు జీవాల్ని నిలపడం మేలుగదా! భగవంతుడు సంతోషిస్తాడు. నేను దొంగను కాను. అనుకుంటూ ఆ వెండిపళ్ళాలు తీసి జేబులో దాచాను వెనుదిరిగి, ద్వారం దాటి, మండపం వద్దకు వచ్చానో లేదో జనం చుట్టుముట్టారు. నాకు ముచ్చెమట్లు పోశాయి నిర్దోషిలా తలవంచుకున్నాను. కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. కొద్ది నిమిషాలలో పోలీసులు వచ్చి నన్ను అరెస్టు చేశారు. మూడేళ్ళు శిక్ష పడింది.

"నువ్వు చెప్పమ్మా, పాపా! నేను దొంగనా! ఇతర్త్రా ఎన్ని దొంగతనాలు చేసినా భగవంతుడు తనకు పట్టనట్లు ఊరుకున్నాడు చూచావా! తన విషయం వచ్చే సరికి నన్ను క్షమించలేక పోయాడమ్మా!

గిరిజకు దుఃఖం ఆగిందికాదు.

"మోహన్ నువ్వు దొంగవు కావు మంచివాడివి. కానీ..."

"చెప్పు పాపా ఇప్పుడు చెప్పు. సుజాత ఏమైంది?" మోహన్ అడిగాడు.

"సుజాత మళ్ళీ పెళ్ళిచేసుకుంది మోహన్"

మోహన్ నెత్తిన పిడుగుపడ్డట్లయింది. అది నమ్మశక్యం కాని విషయం. అంతగా ప్రేమించిన సుజాత మళ్ళీ పెళ్ళి చేసుకోవడమా! అదీతను బ్రతికిఉండగా.

"నమ్మలేను పాపా" అన్నాడు

"నువ్వు చచ్చిపోయ్యావని సుజాత చెప్పింది. ఊళ్ళో అందరూ అదే చెప్పుకున్నారు. ఎవరో ఓ పెద్ద లక్షాధికారిని పెళ్ళిచేసుకుని పట్నం వెళ్ళిపోయింది."

మోహన్ విలపించాడు.

"మా యింటికి వెడదాం రా మోహన్." పిలిచింది.

"వద్దమ్మా! ఈ పాపిమొహం ఎవరికీ చూపించలేను. నేను పాపిని, శాపగ్రస్తుణ్ని. నన్ను భగవంతుడు క్షమించలేదు. ... మీ రెవరూ జాలిపడి నన్ను మన్నించనవసరం లేదమ్మా!" అంటూ మోహన్ వెళ్ళిపోయాడు.

అది నిజం! ఒకసారి దొంగతనం చేసి జైల్లో పడ్డవాణ్ని లోకం క్షమించదు. మళ్ళీ జైలుకు వెళ్ళాలంటే ఏదో నేరం చేయాలి అతనికి పాపం చేయడానికి యిష్టంలేదు.

ఆ మోహన్ భార్య ఈ సుజాత. ఇప్పుడు వచ్చినామె. ఆమెను చూడగానే ఆ విషయాలన్నీ జ్ఞాపకం వచ్చాయి. అని కళ్ళు వత్తుకున్నారు స్వామి.

నాకు నమ్మబుద్ధికాలేదు. స్నేహితుని కథ వల్ల కన్నీరు రావలసిన పనిలేదు. దయ చూపవచ్చు. సుజాతను చూడగానే అయన కళ్ళు నిప్పులు కురిపించనవసరంలేదు నిజానికి.

"అయితే స్వామీ! సుజాత వచ్చి మళ్ళీ క్షమించమని అడిగితే" అన్నాను.

"ఆ మోహన్ చచ్చిపోయి ఈ స్వామీజీగా అవతరించాడని చెబుతాను" అన్నారు సీరియస్‌గా

———




ఆమెవైపు మౌనంగా చూస్తున్న శేఖర్‌ను చూసి వర్మావేదు మెత్తబడ్డాడు. ఈ సంబంధానికి ఒప్పుకునేట్లే వున్నాడు అని ఆ తల్లి హృదయం ఆనందపడింది. ఆశగా శేఖర్ వైపు చూస్తుంది శ్యామలా దేవి.

"క్షమించమ్మా !" నా అసహాయత మిమ్మల్ని చాలా బాధపెడుతోంది. నాకు పెళ్ళిచేసుకోవాలని లేదమ్మా !" అంటూ ముఖం దిండులో దాచుకున్నాడు శేఖర్. అతని దగ్గరగా వచ్చి తలమీద చేయి వేసి ఓ దృఢ నిశ్చయంతో.

"బాబూ ! నీ మనసు మధుమీద వుందని ఆలస్యంగానైనా తెలుసు కున్నాను. పోనీ ఆ పిల్లనే పెళ్ళి చేసుకో. మీ నాన్నగారి కాళ్ళావేళ్ళా పడి ఎలాగో ఒప్పిస్తాను. కానీ నువ్విలా అన్నీ పోగొట్టుకున్న విరాగిలా తిరుగు తుంటే నేను చూడలేనురా" అంటున్న తల్లి చేతుల్లో ముఖం దాచుకొని ఓ అయిదునిమిషాలు అలాగే ఉపశమనం పొందిన శేఖర్, నెమ్మదిగా లేచి కూర్చొని ముఖం తుడుచుకున్నాడు.

"అమ్మా ! నాకు తెలుసమ్మా ! నా కోసం మీరేమైనా చేస్తారనీ, చేయగలరనీ నమ్మకముంది. అయినా నాకా అదృష్టం లేదమ్మా! మధు వివాహానికి సుముఖంగా లేదు." అంటూ లేచి బయటకు వెళ్ళి పోతున్న కొడుకువైపు ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయారు శ్యామలాదేవి. మధు ఈ యింటికి కోడలయ్యే భాగ్యాన్ని

కాదనగలగటం ఆమె వూహ కందటం లేదు.

* * *

చంద్రం, సుషమ వెళ్ళి మధుకు ధైర్యం చెప్పాలనీ, వీలైతే ఏదైనా సహాయం చేయాలనీ అనుకున్నారు. వాళ్ళు వెళ్ళేసరికి యిల్లు వూడుస్తున్న మధు చీపురు లోపల పడేసి, నవ్వుతూ వచ్చి వాళ్ళను ఆహ్వానించింది లోపలికి. అంత అపవాదుపడిన ఆడపిల్ల, అసహాయురాలు ఎంత బాధపడుతుందో ఓదార్పుగా మాట్లాడి ధైర్యం చెప్పాలని వచ్చిన సుషమకు నిరాశే ఎదురైంది. ధైర్యంగా నవ్వుతూ తిరుగుతున్న మధును చూసి ఓ రకమైన అసూయ కలిగింది. "ఏం చూసుకొని అంత ధైర్యం?" అని తనలో తాననుకుంటూ చంద్రం వైపు చూసింది. చంద్రం కూడా మామూలుగా నవ్వుతూ, ఏమీ జరగనట్లే మాట్లాడుతున్నాడు. అసలే మానసికంగా దెబ్బతినివున్న మధుకు మళ్ళీ అవన్నీ జ్ఞాపకంచేసి బాధ పెట్టడం చంద్రాని కిష్టంలేదు. అందుకే కావాలనే ఆ విషయం తప్ప మిగతా విషయాలన్నీ మాట్లాడుతున్నాడు. శేఖర్ పేరు కూడా ఎత్తలేదు.

సుషమకు విసుగ్గా వుంది. పొలాల గురించీ, పంటల గురించీ, శ్యాం చదువు గురించీ యివే కబుర్లు.

"శాంతను ఎప్పుడు తీసుకొస్తున్నారు బావా! గర్భిణితో వుందట కదూ!" అని అడుగుతోంది మధు. యింక వూరికే కూర్చోడం అసాధ్య మన్పించిన సుషమ "ఈ నెల్లో ఎలాగూ శేఖరన్నయ్య పెళ్ళి వుంటుందిగా అప్పుడు వస్తుంది. యింక ప్రసవించేవరకూ ఇక్కడే వుంచేస్తాం," అంది.

చంద్రానికి జీవితంలో మొట్టమొదటి సారిగా సుషమమీద అంతులేని కోపం వచ్చింది.

మధులో ఎంత నిబ్బరం, ఎంత ప్రశాంతత! అదేదో అతి సాధారణ విషయమైనట్లు చిన్నగా నవ్వుతూ "లగ్నాలు పెట్టుకున్నారా సుషమా?" అంది. ఏదో కష్టగా, చెప్పాలని చెప్పింది కానీ చంద్రం తన వైపుచూసిన చూపుకు సుషమ తల వంగిపోయింది. తప్పని సరిగా మెల్లగా సమాధానం చెప్పింది "లేదు. యింకా పెట్టుకోలేదు మహీపూర్ సంబంధం నిశ్చయం చేసుకుంటున్నారని విన్నాను." పైకి నవ్వుతూ అడిగినా మధు అంతరంగంలో ఎలాంటి తుఫాను చెలరేగిందో ముఖంమీద నిలిచిన స్వేద బిందువులే చెప్పక చెబుతున్నాయి.

వెంటనే టాపిక్ మార్చిన చంద్రం "మధూ యీ సంవత్సరంతో శ్యాం చదువు యిక్కడ అయిపోతుంది కదూ! కలకత్తా వెళ్ళిపోవచ్చు. నిన్ననే మావయ్య గారు లెటర్ వ్రాశారు. పరీక్షలైపోగానే మీ యిద్దరినీ కలకత్తా తీసుకెళ్ళి ఆయన

కప్పగించే బాధ్యత నా కప్పగించారు," అని నెమ్మదిగా "మధూ ! ఈలోగా ఏం కావలసినా నన్నడగటానికి మొహమాట పడకు" అన్నాడు మధు ముఖంలోకి చూస్తూ.

ఏవీ అడగదని తెలుసు. అయినా ఏదో ఆశ. యిప్పుడు యిల్లు ఎలా గడుస్తుందనే ప్రశ్న ఎలా వేయాలో అర్థంకాక తన సహాయం తీసుకొమ్మని పరోక్షంగా సూచించాడు.

"తప్పకుండా అడుగుతాను బావా ! నాకీ ప్రపంచంలో మిగిలిన ఆత్మీయు లెంతమంది ? వాళ్ళను కూడా దూరం చేసుకొని నేనెలా బ్రతగ్గలను ?" అని ఓ క్షణ మాగి "బావా ! ఓ సహాయం చేసి పెట్టు." అంటూ లోపలి కెళ్ళి ఓ భరిణ తీసుకొచ్చి చంద్రం చేతి కిచ్చింది.

మూత తీసి చూసిన చంద్రం ఆశ్చర్యంతోనూ, అవమానంతోనూ అలాగే చూస్తుండిపోయాడు. అందులో మధు చేతిగాజులు రెండు; ఓ లాకెట్ గొలుసూవున్నాయి. బొమ్మలా కూర్చొని జరుగుతూన్న తమాషా చూస్తోంది సుషమ.

"బావా ! వాటిని అమ్మించి వచ్చి నంత డబ్బు తీసుకురా ! ప్రస్తుతం అదే నువ్వు నాకుచేయవలసినసహాయం" అంది మధు చిన్నగా నవ్వుతూ. అలాంటి పరిస్థితుల్లోకూడా మధు అలా ఎలా నవ్వ గలుగుతోందో సుషమకూ, చంద్రానికీ బోధపడటంలేదు. "మధూ ! నువ్వు నన్నిలా అవమానిస్తావని నేననుకోలేదు. ఏమిటిది? అంటే, నీకు కావలసిన డబ్బు నేను సర్దలేననా, నీ వుద్దేశ్యం?" అన్నాడు ఆవేశాన్ని అపుకోవాలని ప్రయత్నిస్తూ.

"కాదు బావా ! నిన్నవమానించాలని కాదు. నువ్వు సర్దగలవనీ నాకు తెలుసు. అయినా యిప్పుడా గొలుసూ, గాజులూ లేకపోతేనేం జరగదా ? అవసరానికి వుపయోగపడనప్పుడు అవెందుకు ? నా సంగతి నీకు పూర్తిగా తెలుసు బావా ! నన్ను అర్థంచేసుకున్న వాళ్ళెవరైనా వున్నారంటే అది నువ్వేనని నా నమ్మకం. నా మీద నీకున్న అభిమానంతో, నా అభిమానాన్ని చంపుకోమని చెప్పకు. దయచేసి నేను చెప్పినట్టు చెయ్యి బావా ! ఈ పని నువ్వు తప్ప నాకు చేసిపెట్టగల వాళ్ళెవరూ లేరు ఈ వూళ్ళో !" అంటున్న మధు స్వరం వణకడం గమనించి, మారు మాట్లాడకుండా ఆ భరిణ తీసి జేబులో వేసుకొని, లేచి నుంచున్నాడు చంద్రం. ఆశ్చర్యంగా మధు వైపు, చంద్రం వైపూ చూస్తున్న సుషమ-

"మధూ" అంటూ ఏదో చెప్పబోయే లోపలే-

"పద వెళ్దాం !" అంటూ, దాదాపు సుషమను చేత్తో లాక్కొని వెళ్ళిపోతున్న చంద్రం కళ్ళలో మెరిసిన సన్నటి నీటి పొర, అతనెంత బాధపడుతున్నాడో మధుకు తెలియజెప్పింది. అలాగే

వాళ్లు వెళ్లిన వైపే చూస్తూ శిలాప్రతిమలా నిలబడిపోయిన మధు కళ్ళు ధారా పాతంగా వర్షించడం మొదలుపెట్టాయి.

* * *

తండ్రి యాక్సిడెంట్‌లో చనిపోవడానికి సరిగ్గా నెల ముందు తను స్కూల్ ఫస్ట్ వచ్చిందని విని, ఒకేసారి మధుకు ఆ రెండు గాజులూ, లాకెట్ గొలుసూ కొనిచ్చాడు. బాంక్‌లోవున్న కొద్ది డబ్బూ తీసి, కూతురికి నగల రూపంలో అలంకరించాడు ఆ ఆనందంలో తను బ్రతికుండగా పిల్లలకు తల్లి జ్ఞాపకం రాకూడదనీ, ఆడపిల్లలకు ఆభరణాలు అవసరమనీ తల్లిలా, తండ్రిలా తనే ఆలోచించి ఆ పని చేశాడు శ్రీరాం.

ఈ రోజు వాటికీ, తనకూ రుణం తీరిపోయింది. ప్రాణం లేని ఆ వస్తువుల మీద తీపిలేకపోయినా, ప్రాణమున్నపుడు తండ్రి కొనిచ్చిన తీపి గురుతుగా యిన్నాళ్ళూ వాటిని ప్రాణాంలా దాచుకుంది. తను కలకత్తా వెళ్ళి శ్రీధర్ మావయ్య దగ్గరుంటే... శ్యాం చదువుకు, తన ఖర్చులకు సరిపడ తను సంపాదించగలదా? ఆప్యాయంగా ఆదరించే చంద్రం బావని యివాళ అవి అమ్మిపెట్టమని చెప్పడం తప్పనిసరైంది. అవి ఎలాగూ అమ్మక తప్పదు. తనంతట తను ఎవరికీ అమ్మలేదు. మరొకరికి ఆ పని చెప్పడం యిష్టంలేదు. బాధపడ్డా తన ఆత్మాభిమానాన్ని అర్థంచేసుకొని అమ్మిపెట్టగలవాడు చంద్రం ఒక్కడే అందుకే ఆ పని అతనికే అప్పజెప్పింది.

* * *

చంద్రం డబ్బు తీసుకొచ్చియిచ్చాడు. అయితే మధు చెప్పినట్లు వాటిని అమ్మలేదు. వాటిని అతిప్రియంగా దాచుకునే వ్యక్తి చేతికి వాటిని అందించి తృప్తిగా నిట్టూర్చాడు. మధు కవసరమైన డబ్బు చేతి కందింది. రోజులు కొంత ప్రశాంతంగానే గడిచిపోతున్నాయి. శేఖర్ అసలు కనిపించడం లేదన్న బాధ తప్ప మరోవిధమైన బాధలేవీ లేవనే చెప్పాలి.

అపవాదులు వేసినవాళ్ళకు కూడా అదేపనిగా ఒకేవిషయాన్ని చెప్పుకోగా, చెప్పుకోగా విసుగుపుడుతుంది. చివరికి వాళ్ళంతట వాళ్ళే మానేస్తారు. శేఖర్, మధులను గురించి చెప్పుకునేవాళ్ళ నోళ్ళకు, కొంత విశ్రాంతి దొరికింది. అదీగాక వాళ్ళ నోళ్ళ ప్రభావానికి దడిసి శేఖర్ మధు యింటికి రావడం మానేశాడని గర్వంగా నవ్వుకునేవాళ్ళు. అసలు నిజం తెలీదు వాళ్ళిద్దర్నీ, వాళ్ళు కలుసుకోదలుచుకుంటే ఎవ్వరూ ఆపలేరని !

శేఖర్ మధును బాధపెట్టడం యిష్టం లేక ఆమె కంటబడటం మానేసినా, మానసికంగా ఆ వ్యధ అతణ్ణి కృంగదీసి మంచం పట్టించింది. ప్రయివేట్ డాక్టర్ యింటికొచ్చి ట్రీట్‌మెంట్ యిస్తున్నారు. మనోవ్యాధికి మందేముంది ? ఎన్ని మందు లిచ్చినా మనిషి రోజు రోజుకూ నీరసించిపోవడం తప్ప గుణం కనిపిం

చడంలేదు. శేఖర్‌ను ఆ పరిస్థితిలో చూస్తున్న రఘుపతిగారి గుండెల్లో అంతు లేని బాధ నింపుకొంది, ఆ పరిస్థితుల్లో వివాహ మేవిటని ? మహీపూర్ వాళ్ళకు కబురు చేశారు క్షమించి మీరు మరో సంబంధం చూసుకోండని.

ఒక్కగా నొక్క కొడుకు, కుల దీపకుడు. వాడికంటే తనకు ఆస్తి అంతస్థులు ముఖ్యం కావు. వాడిష్ట ప్రకారమే కానివ్వాలనే నిశ్చయానికి వచ్చారు. పుత్రవాత్సల్యం ముందు, ఆస్తీ అంతస్థూ, పరువూ ప్రతిష్టా, అన్నీ తృణప్రాయాలుగా కనిపించాయి. ఎన్ని మందులు వాడినా రోజు రోజుకూ క్షీణించిపోతున్న శేఖర్‌ను చూసి డక్టర్‌కు కూడా అతని జబ్బేమిటో అంతుబట్టకుండా వుంది. పోనీ ఓ సారి కలకత్తా తీసుకెళ్ళి స్పెషలిస్ట్‌లకు చూపిస్తే ఏమైనా పయోజన ముంటుందేమోననే అభిప్రాయం వెలిబుచ్చారు. శేఖర్ తను గంగాపూర్ వదలి వెళ్ళనని మొండి కేశాడు.

ఊళ్లో అందరూ యిప్పుడు శేఖర్ అనారోగ్యం గురించే చెప్పుకుంటున్నారు. సుషమ, చంద్రం రోజూ ఏదో ఒక టైమ్‌లో వెళ్ళి శేఖర్‌ను చూసి వస్తున్నారు.

ఓ రోజు చంద్రం మధు దగ్గర్ కొచ్చాడు. ఏదో అడగాలని వచ్చిన చంద్రం మధు ముఖం చూసి సంశయించడం చూసిన మధు తనే పలకరించింది.

"శేఖర్‌బాబు దగ్గరకు వెళ్ళావా బావా ? యిప్పుడెలా వున్నారు ?" అంది. ఎంత మామూలుగా అడగాలని ప్రయత్నించినా, మనసులోని బాధ మాటల్లో ధ్వనించింది. చంద్రానికి సమస్య తేలికైంది, కొంచం ధైర్య మొచ్చింది.

"మధూ! నవ్వొకసారి రాకూడదూ! వాడు రోజూ నిన్ను గురించి అడుగు తున్నాడు. చాలా బలహీనంగా తయా రయ్యాడు. వాడిని చూస్తే మన శేఖరేనా అనే అనుమానం కలుగుతోంది. తినే మందులేమైపోతున్నాయో తెలీదు. మామూలుగా వున్నట్లే కన్పిస్తున్నా ఆ నవ్వులో జీవం లేదు. ఆ ముఖంలో మునుపటి కళాకాంతులు లేవు. ఒక్కసారి వెళదాం రా మధూ!" అంటున్న చంద్రం వైపు కళ్ళెత్తి చూసిన మధు, అతను అంతగా బాధపడుతున్నాడంటే, బాధగా గొంతు చలిస్తోందంటే, కళ్ళ వెంట నీళ్ళు కారుతున్నాయంటే...నిజంగా శేఖర్ పరిస్థితి చాలా ప్రమాదంగా వుందేమో, అన్పించింది. అంతే ఆ ఆలోచన రావడమే తడవుగా యింక ఆపుకుందామన్నా ఆపుకోలేక రెండు చేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చేసింది, చంద్రం అక్కడే వున్నాడనే విషయం కూడా మరిచిపోయి. అలా

ఏడుస్తున్న మధును చూసి తనను తాను కంట్రోల్ చేసుకుంటూ, కళ్ళు తుడుచుకొని, మధు ముఖం మీదనుంచి చేతులు తొలగిస్తూ "పద మధూ! ముఖం కడుక్కోనిరా వెళదాం" అన్నాడు బొంగురుపోతున్న స్వరంతో.

"లేదు బావా! నేను రాను. నా గాలి తగిలితే ఆయనింక కోలుకోరు. నా దురదృష్టం నాఆత్మీయులందరినీ పొట్టను పెట్టుకుంది. నేను రాను బావా! నా నీడ కూడా ఆయనమీద పడకూడదు. నేను రాను...నేను రాను..." అంటూ వెళ్ళి మంచం మీద పడి భోరుమని ఏడుస్తున్నమధుకు ఏమని చెప్పాలో ఎలా ఓదార్చాలో అర్థంకాక కొంచంసేపు అలాగేనిలబడి,నెమ్మదిగా వెనుదిరిగి వెళ్ళిపోయాడు, చంద్రం. మనసులోని బాధ కన్నీళ్ళ రూపంలో బయటపడటమే మంచిదనిపించి మధు ఏడుపుకు అంతరాయం కలిగించకుండా వెళ్ళిపోయాడు చంద్రం

చంద్రం వ్రాసిన లెటర్ ద్వారా శేఖర్ అనారోగ్యం విషయం తెలిసి శ్రీధర్ గారు కూడా వచ్చి ఓ నాలుగు రోజులుండి వెళ్ళారు "కలకత్తా వెళదాం శేఖర్ ?" అని ఆయన కూడా అన్నారు. "వద్దు అంకుల్.అయాంమాల్ రైట్,"అని కలకత్తా వెళ్ళడానికి ఒప్పుకోలేదు,శేఖర్. ఎవరు వచ్చి చూసినా చేయగలిగిందేముంది? ఏదైనా కాలమే నిర్ణయించాలి. శేఖర్ పెళ్ళికి వస్తుందనుకున్న శాంత శేఖర్ అనారోగ్యం విషయం తెలిసి చూడటానికి వచ్చి శేఖరింటికి వెళ్ళింది. పాలిపోయిన ముఖంతో, తెచ్చిపెట్టుకున్న జీవంలేని నవ్వుతో-

"ఏమ్మా శాంతా! బావున్నావా ?" అంటూ పలకరిస్తున్న శేఖర్‌ను చూసి కన్నీళ్ళాగలేదు శాంతకు. తను పెద్దగా శేఖర్‌తో ఎప్పుడూ మాట్లాడింది లేదు. సుషమ వాళ్ళు మొట్టమొదటిసారిగా గంగాపూర్ వచ్చినప్పుడు కలిగిన చనువుతో అప్పుడప్పుడూ మాట్లాడుతుండేది.ఎంతో ఆప్యాయంగా పలకరించేవాడు. మధుతో కలిసి తన పెళ్ళి హడావుడిలోపాల్గొన్న శేఖర్,జమిందారు గారబ్బాయనే భావం, ఆ తర్వాత శాంతకెప్పుడూ కలగలేదు.చంద్రంతో మాట్లాడినంత చనువుగానూ మాట్లాడేది. ఇప్పుడు శేఖర్‌ను, అలా చిక్కిపోయి, రూపం మారిన శేఖర్‌ని చూడటం ఎంతో బాధగా వుంది. నోరు విప్పి శేఖర్‌ను అలా చూస్తూ మాట్లాడలేకపోయింది. అయిదునిముషాలు కూర్చొని యింటికి వచ్చేసింది.అలా చూస్తూ ఎలా వుందని ఎలా అడగటం? అప్పుడు కూడా ఓపిగ్గా నవ్వుతూ, తనే శాంత మంచి చెడ్డలు అడిగాడు శేఖర్. ప్రత్యక్షంగా పూర్తిగా మారిపోయిన శేఖర్‌ను చూస్తూ అతని పరిస్థితి ఎలా వుందని ఎవర్ని

అడగలేక మౌనంగా "వస్తానన్నయ్యా" అని మాత్రం అనేసి వెళ్ళి పోయింది.

* * *

ఒంటరిగా యింటి కప్పుకేసి చూస్తూ పడుకున్న శేఖర్‌కు నిశ్చయంగా అనిపించింది. తనను అంటిపెట్టుకొని వెంటాడుతున్న యీ మానసికావేదన నుంచీ ఆలోచనల నుంచీ పారిపోవాలి రకరకాలుగా పయనిస్తూ గమ్యం చేరుకోలేకపోతున్న ఆలోచనలకు ఓ మార్గదర్శి కావాలి. తన మధు కావాలి. ఆమె సమక్షంలో తప్ప తన బాధను మరిచిపోలేడు. ఎందరో వచ్చారు తనని చూడటానికి. కానీ మధు తన దగ్గరకు రాదు. మరి ఎలా! ఓసారి ఆమెను కళ్ళారా చూసి, ఆమెతో మాట్లాడితే తప్ప మనస్సుకు శాంతి, విశ్రాంతి వుండదు." చాలాసేపటి నుంచీ పడుకొనివున్నాడేమో, మరీ చికాగ్గా అనిపించి లేచి నుంచున్నాడు నెమ్మదిగా. గిర్రున కళ్ళు తిరిగాయి. మంచం పట్టుకొని అలాగే కూర్చున్నాడు ప్రక్కనే వున్న గ్లూకోస్ వాటర్ తాగి మంచానికి తలానించి కిటికీలో నుంచి కనిపిస్తున్న చిక్కబడుతున్న చీకటిని చూస్తున్నాడు. అలా చీకట్లోకి చూస్తున్న శేఖర్‌కు కిటికీ దగ్గర ఏదో నీడ కదలాడినట్లైంది. ఆ సమయంలో అప్పుడు ఎవరలా కిటికీలో నుంచి చూస్తున్నారా ?" అని వెళ్ళి పక్కగుమ్మం తలుపు తీసిన శేఖర్ త్వరగా తప్పించుకొని వరండా మెట్లు దిగబోతున్న ఆ ఆకారాన్ని చేత్తో పట్టుకోబోయి ముందుకు తూలాడు.

వెళ్ళబోతున్న ఆ ఆకారం అప్రయత్నంగా వెనక్కు తిరిగి శేఖర్‌ను పడిపోకుండా పట్టుకుంది.

ఆ స్పర్శ శేఖర్ శరీరంలో ఎక్కడ లేని శక్తిని యిచ్చింది. తడబడుతున్న గొంతుతో "మధూ! నువ్వా? నువ్వేనా? చాటుగా వచ్చి చూసి వెళ్ళిపోతున్నావా? యిన్నాళ్ళకు నన్ను చూడాలనిపించిందా మధూ! యిప్పుడైనా యింక నేను ఎలాగూ చచ్చిపోతానని విని, ఓసారి చూసి వెళ్దామని వచ్చావు కదూ! ఇంక ఫర్వాలేదు...నేను హాయిగా, తృప్తిగా ప్రాణాలు వదిలేయగలను. ఇంకా బ్రతికుండి నిన్ను బాధపెట్టను మధూ!" అంటూ ఆవేశంగా మాట్లాడుతూ నీరసం వల్ల ఆయాసపడుతున్న శేఖర్ నోటిపై చెయ్యి వుంచి–

"అంత మాటనకండి. మీరు తప్పకుండా కోలుకుంటారు. నాకు నమ్మకుంది. మరో వారానికి మామూలుగా లేచి తిరుగుతారు. ఇంక లోపలికెళ్ళి పడుకోండి మళ్ళీ ఎవరైనా లేస్తే, గొడవవుతుంది. నే వెళ్ళొస్తాను" అంటూ ఆయాసపడుతూ వుద్వేగాన్ని అణచుకోలేకపోతున్న శేఖర్ గుండెలమీద చేత్తో రాస్తూ, శేఖర్ ముఖం వైపు చూసిన మధు, ఆ చీకట్లో కూడా మిలమిలా

మెరుస్తున్న శేఖర్ కళ్ళలోని కాంతికి తనను తాను నిగ్రహించుకోలేక శేఖర్ కాళ్ళ పైకి జారి, కన్నీళ్ళతో శేఖర్ కాళ్ళను అభిషేకిస్తోంది. నెమ్మదిగా మెట్టు మీద కూర్చున్న శేఖర్, మధు తల రెండు చేతులతో పైకెత్తుతూ-

"మధూ ! ఏవిటిది ? పిచ్చి ? ఎందు కేడుస్తున్నావు ? నాకిప్పుడేమైందని ? మరో వారానికి నువ్వన్నట్లు లేచి తిరుగు తాను చూడు" అంటూ మధు కన్నీళ్ళు తుడిచాడు. ఆ పదినిముషాల్లో ఒకళ్ళ నుంచీ ఒకళ్ళకు, కావల్సినంత శక్తీ, మనోధైర్యం సరఫరా అయ్యాయి.

నెమ్మదిగా లేచి కన్నీళ్ళు తుడుచు కుంటూ వెళ్ళిపోతున్న మధు వైపు చూస్తూ కూర్చున్న శేఖర్ నెమ్మదిగా లేచి లోపలికెళ్ళి తలుపులు వేసుకున్నాడు.

శేఖర్ మనసు తృప్తితో నిండి పోయింది. ఎవరేమనుకున్నా, తనేమై పోయినా, మధు మనస్సు తనది అనే తృప్తి చాలు భవిష్యత్ మీద ఆశతో బ్రతకడానికి. కొద్దో గొప్పో ఒకరిని గురించి ఒకరికి సందేహాలేవైనా వుంటే అవి ఆ క్షణంలో కలసి కురిసిన కన్నీటిలో కరిగిపోయాయి.

తెల్లవారి నిద్రలేచిన శేఖర్‌కు కొంత తేలిగ్గా వున్నట్లనిపించింది. మరి రోజూలా పక్కమీదే వుండిపోలేదు. మరో పదిరోజులకు లేచి తిరుగుతున్న శేఖర్‌ను చూసి ఆశ్చర్యపోయిన డాక్టర్ "శేఖర్ ! నా అనుభవంలో యిలాంటి విచిత్రమైన కేసు చూళ్ళేదోయ్. అంత దేంజరస్‌గా కనిపించిన నువ్వు మళ్ళీ యింత త్వరగా కోలుకుంటావనుకోలేదు. ఎంత భయపెట్టావు మమ్మల్నందరినీ. ఏ అద్భుతశక్తి వరమిచ్చిందో ? యూ బికేమ్ ఆల్‌రైట్. అసలు జబ్బేమిటో తెలీకుండా, రోజు రోజుకూ డౌన్ అయిన నువ్వింత త్వరగా కోలుకోడం రియల్లీ లక్కీ. ఎనీహౌ గాడ్ ఈజ్ గ్రేట్" అంటూలేచి శేఖర్‌తో కరచాలనం చేసి జమిందారుగారికి నమస్కరించి నవ్వుతూ వెళ్ళిపోయాడు డాక్టర్.

చినబాబుగారు లేచి తిరుగుతున్నా రంటే యింట్లో అందరికీ మళ్ళీ కన్నుల పండువగా వుంది. అసలు రహస్యం, శేఖర్ గది కిటికీ తీసి వుంచిన రామికి తప్ప ఎవరికీ తెలీదు. ఆ రాత్రి మాధవిని తప్పకుండా చూట్టానికి రమ్మని చినబాబు గారు, కింద గదిలోనే పడుకొని వున్నా రని, ఎవరూ చూడకుండా నేను చూసు కుంటానని అభయమిచ్చిన రామితో రానని చెప్పినా వస్తుందనే నమ్మకంతోనే అది ఆ రోజు, చినబాబు గది కిటికీ తలుపులు వేయకుండా తీసి వుంచింది.

"మాదవమ్మగారి దయవల్లే మళ్ళీ మా చినబాబుగారు మామూలు మడి సయ్యారు" అనుకుంది రామి సంతోషంగా.

శేఖర్ లేచి తిరుగుతున్నాడనే వార్త విని మధు శివాలయానికి వెళ్ళి తన మొర ఆలకించిన విశ్వేశ్వరుడికి అర్చన చేయించింది. మధు మనసుకు కొంత నిశ్చింత ఏర్పడింది.

శ్యాం శ్రద్ధగా చదువుతున్నాడు. రాత్రులు దగ్గిర కూర్చొని చదివిస్తూ వాడికి తెలీనివి తనకు తెలిసినంత వరకూ చెబుతూ, తన సర్వశక్తులూ ధారపోసైనా సరే వాడు ఆ సంవత్సరం మంచి మార్కులతో పాస్ అయ్యేలా చూడాలని తంటాలు పడుతోంది. ఈ సంవత్సరం పరీక్షలైపోతే, యింక కలకత్తా వెళ్ళి, ఏదో వుద్యోగం సంపాదించవచ్చు.

వూళ్ళో ఎదురుగా తిరుగుతూ శేఖర్‌ను తప్పించుకొని తిరగటం ఓ శాపంలా మధును క్షోభపెడుతోంది. తను కళ్ళకు కనిపించకుండా దూరంగా వెళ్ళిపోతే కొంతకాలానికి మర్చిపోయి మరో అమ్మాయిని పెళ్ళిచేసుకోగలడని మధు అభిప్రాయం. అలా అనుకున్నపుడల్లా మనసులోని మరోభాగం "అబద్ధం! శేఖర్ నిన్ను తప్ప వేరే ఎవరినైనా పెళ్ళాడడ మనేది, ప్రేమించడ మనేది కల్ల" అంటుండేది.

ఎదుట మాట్లాడుతూ వెనక్కు తిరగ్గానే వెక్కిరించేవాళ్ళ మనస్తత్వాలు అర్థమైన తర్వాత సాధ్యమైనంతవరకూ అలాంటివాళ్ళను తప్పుకు తిరుగుతోంది. తప్పనిసరిగా మాట్లాడినా మనసు విప్పి మాట్లాడలేకపోతోంది. కుళ్ళు మనసు నిండుగా నింపుకొని నవ్వుతూ పలకరించాలని చూసే కాంతమ్మలాంటి వారికి సాధ్యమైనంత దూరంగా తిరుగుతోంది.

పరీక్షలు మొదలయ్యాయి. శ్యాం ఎప్పటి కంటే ఎక్కువగా కష్టపడి చదువుతున్నాడు. రోజూ తెల్లవారు ఝామున నాలుగు గంటలకే లేపి చదివించడం మధు డ్యూటీ. తనకు మిగిలిన ఆ ఒకే ఒక్క వెలుగు కోసం తన జీవితమంతా ఖర్చుచేయడానికైనా సిద్ధంగా వుంది మధు.

ఆ రోజు శ్యాం ఎందుకో చాలా దిగులుగావున్నట్లు కనిపించాడు. కారణం అడిగితే "ఏమీ లేదక్కా!" అని తేల్చేశాడు. ఆ రోజు పేపర్ సరిగా ఆన్సర్ చేయలేదేమోనని భయం పట్టుకుంది మధుకు. అనుమానంగా అడిగింది "ఇవ్వాళ పేపర్ సరిగా ఆన్సర్ చేయలేదా శ్యాం?" అని.

"బ్రహ్మాండంగా చేశానక్కా! ఆప్షనల్ మాత్స్ నూటికి నూరు మార్కులు గ్యారంటీగా వస్తాయి," అని చెబుతున్న వాడి మాటల్లో వుండవలసిన వుత్సాహం కనిపించలేదు.

"ఏవిటో యీ పిల్లాడు ఏవీ అర్థం కాడు" అనుకుంటూ, "ప్రొద్దుపోయింది, యీ పూటకు చదివింది చాల్లేరా, పడుకో మళ్ళీ తెల్లవారుఝామున లేపుతా"నంది.

"సరే !" అని పడుకున్నాడు శ్యాం.

మధ్యాహ్నం పరీక్ష వ్రాసి వచ్చిన శ్యాం యింకా దిగులుగా కనిపించాడు. మళ్ళీ మధు అడిగిన ప్రశ్నకు అదే జవాబిచ్చాడు. "చాలా బాగా వ్రాశానక్కా!" అని. గబగబా ఏదో ఒకటి తినేసి స్కూలుకు పరుగెత్తే శ్యాం, అన్నం గెలుకుతూ కూర్చున్నాడు. మాటిమాటికీ కళ్ళు తుడుచుకుంటున్నాడు. మధుకు ఖంగారు ఎక్కువైంది. వాడిని దగ్గరకు తీసుకొని "ఏవిటిరా ? ఏమైంది నీకు ?" అని అడుగుతున్న మధును రెండు చేతుల్తో చుట్టేసి బావురుమన్నాడు. కానీ ఏడవటానికి కారణం చెప్పలేదు. ఇంతలో స్కూల్ బెల్ విన్పించింది.

"ముందు అన్నం తినరా ! మళ్ళీ పరీక్ష కెళ్ళాలి. యివ్వాళ నీకేమైందిరా శ్యాం ?" అంటున్న మధు కళ్ళలో నీళ్ల నిలిచాయి. వాడి చేతులు తననుంచి విడదీసి గబగబాతనే అన్నంకలిపినోట్లో

## మార్చి నెల క్విజ్

### సమాధానాలు

1 — బి  2 — సి  3 — డి

4 — బి  5 — ఎ

6. ఆంధ్రజ్యోతి 7. ఖేమర్ రిపబ్లిక్ 8 గుంటూరు

9 గోల్కొండ 10. 1936

అన్నీ కరెక్టుగా పంపినవారు చాలా ఎక్కువగా ఉండటంవల్ల, మా నిబంధనలలో పేర్కొన్నట్టు, లాటరీవేసి, 10 మందికి ఒక్కొక్కరికి రూ 11-60 చొప్పున బహుమతిసొమ్ము మొత్తాన్ని పంచడం జరిగింది. లాటరీలో వచ్చినవారి పేర్లను కింద ఇస్తున్నాం.

1. పి. రమ, సికింద్రాబాద్ 2. అంగర వెంకటసుబ్రహ్మణ్యం, వాల్తేరు 3. సి. విజయకుమార్, హైదరాబాద్ 4. లక్ష్మీవల్లి కార్తికేయ, శ్రీకాకుళం 5. సి. రాధాబాయి, గుంటూరు 6. ఎం. సుందరి, కాకినాడ 7. ఎం. పున్నయ్య, గుంటూరు 8. ఎస్. వి. ఆర్. వి. ప్రసాద్, గుంటూరు 9. సి. అజయ్‌కుమార్, వరంగల్ 10. వై. విజయలక్ష్మి, తిరుపతి.

పెట్టింది. ఆప్యాయంగా అన్నం కలిపి పెడుతున్న అక్కను చూస్తూ, ఓ ప్రక్క కన్నీళ్ళు కారుస్తూ, అన్నం ఎలాగో తినేసి పాడ్ తీసుకొని బయలుదేరాడు శ్యాం.

వీధివరకూ వెళ్ళిన మధు వెళుతున్న శ్యాంని చూస్తూ నుంచుంది. శ్యాం చొక్కాతో మాటిమాటికీ కన్నీళ్లు తుడుచుకుంటూ, వెనక్కు తిరిగి తిరిగి చూస్తూ స్కూల్‌వైపు వెళ్ళిపోయాడు. వాడు కనుమరుగయ్యేంతవరకూ చూసిన మధు లోపలికొచ్చి పళ్లెంలో అన్నం పెట్టుకుంది. ఒక్క ముద్దకూడ తినలేకపోయింది. ఆఖరి పరీక్షరోజు శ్యాం ఎందుకలా వున్నాడో అర్థంకాక మనసంతా వికలమైంది. వివరంగా అడిగి తెలుసుకోడానికి టైమ్ లేకపోయింది. చెయ్యి కడిగేసుకుంది అన్నం తిన కుండానే. అన్నీ సర్దేసి, లోపలి గదిలో కెళ్లి చంద్రం దగ్గరనుంచి తెచ్చుకున్న నవల తీసుకుంది చేతుల్లోకి. మనసు పుస్తకంమీద లగ్నం కావడంలేదు మధుకు. ఏవేవో ఆలోచనలు. తనకు వూహ తెలిసినప్పటినుంచీ జరిగినవన్నీ ఒక్కటొక్కటే మనసులో మెదులు తున్నాయి.

* * *

ఆరోజు తను స్కూల్‌నుంచి రాగానే ఎదురుగా కూర్చుని వున్న తండ్రి దగ్గరగావెళ్లి "నాన్నా! నన్ను డాక్టర్‌ని చదివించాలి నాన్నా" అంది డిమాండ్ చేస్తూ. "అలాగేనమ్మా!" అంటున్న తండ్రి దగ్గరకొచ్చి ఒళ్ళో కూర్చుంటూ "నాన్నా! మరి నన్నేమో! పేద్ద... ఆఫీచర్‌ని చేయాలి... అక్కయ్యకంటే పే...ద్ద ఆఫీచర్ని" అటూ చేతులు చాపి అభినయిస్తూ చూపిస్తున్న శ్యాంని చూసి తండ్రీ కూతుళ్ళిద్దరూ తనివితీరా నవ్వుకున్నారు.

వాళ్ళ నవ్వులు చూసి మూతి ముడుచుకున్న శ్యాంని రెండుచేతుల్తో పైకి ఎత్తి గాలిలో గిరగిరా తిప్పి అప్పుడే వినువీధి కెగసి మేఘాల్ని చీల్చు కుంటూ పోతున్న ఏరోప్లేన్ చూపించి "శ్యాం నిన్ను పే...ద్ద పైలట్ ఆఫీ సర్‌ను చేస్తానురా! అల్లదిగో అలాంటి ఏరోప్లేన్స్ నడుపుతూ ప్రపంచమంతా తిరగొచ్చు." అంటూంటే ఆశగా ప్లేన్ వెళుతున్న దిశగా చూస్తూ "బలే బలే నేను పైలత్ ఆపీచర్‌నవుతా!" అంటూ గంతులేస్తున్న శ్యాంని చూసి వెక్కి రిస్తూ,

"ఔనవును. పైలత్ ఆపీచరు!" అంటూ నవ్వుతున్న కూతుర్ని మంద లించి,

"తప్పు మధూ! తమ్ముడినలా ఏడి పించకూడదు వాడు తప్పకుండా పైలట్ ఆఫీసరవుతాడు. చూస్తూండు నువ్వు" అంటోన్న శ్రీరాం బుగ్గల్ని ముద్దుపెట్టు కొని "మంచినాన్న" అంటూ మధును

చూసి వెక్కిరిస్తూ పోతున్న తమ్ముడిని చూసి నవ్వుతూ నిల్చున్న మాధవిని దగ్గరకు తీసుకొని

"మధూ! ఇప్పుడు చెప్పమ్మా! నువ్వు డాక్టరెందుకు చదవాలనుకుంటు న్నావ్" అని అడుగుతున్న నాన్నగారిని చూసి సిగ్గుపడి తలవంచుకొని

"ఏమో నాన్నా! పక్కింటి జతిన్ అన్నయ్యను చూసినప్పుడల్లా నాకూ డాక్టర్ చదవాలనిపిస్తుంది. అన్నయ్య కూడా 'మధూ! నువ్వు డాక్టరైతే బావుంటావమ్మా' అన్నాడు ఇవాళ స్కూల్‌నుంచి వస్తుంటే తెల్లటి కోటు వేసుకొని అన్నయ్యతోపాటు వెళు తున్న ఓ అక్కయ్య కనిపించింది. అన్నయ్య నన్ను పిల్చి

'చూడు మధూ! ఈ డాక్టరమ్మ ఎలా వుంది?' అంటూ ఆ అక్కయ్యని చూపించాడు.

'చాలా బావుందన్నయ్యా' అన్నాను ఆ అక్క నన్ను చూసి నవ్వింది. నేను నెమ్మదిగా 'మీ పేరేమిటి?' అన్నాను. 'వసుధ' అని చెప్పి, 'మరి నీ పేరే మిటి?' అంది చిన్నగా, గడ్డం పట్టు కొని. నేను 'మాధవి' అన్నాను. అయితే మా జతిన్ చెప్పే 'డాక్టర్ మాధవి' నువ్వేనన్నమాట". అంటూ నవ్వుతూ చెయ్యివూపి అన్నయ్యతో కలిసి వెళ్ళిపోయింది జతిన్ అన్నయ్యతో వున్న వసుధ అక్కయ్యను చూసిన దగ్గర్నుంచీ నాకు కూడా తప్పకుండా డాక్టరే అవ్వాలనిపిస్తోంది నాన్నా!" అంటూ అంతా ఒక్క గుక్కలో చెప్పేసి మళ్ళీ తండ్రి గుండెల్లో తల దాచుకుంది మాధవి.

"అలాగేనమ్మా! నాకు మీ ఇద్దరూ రెండు దీపాలు, నా కంటిపాపలు, మీ యిష్ట ప్రకారం చదువుదురు గాని. అందుకు నేనెంత కష్టపడాల్సి వచ్చినా పడతాను, పదమ్మా లోపలికెళ్దాం" అంటూ లోపలికి తీసుకెళ్ళారు.

(సశేషం)

Printed and Published by A. Chandra Sekar Rao at 5-8-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO





# నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారీ భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి కోల్గేట్. ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు. పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు. దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క సమ్మతమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియ పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకు చేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం. దంతక్షయంనుండి రక్షణ.

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్న ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు !




**ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.**

DC.G.64 Tl

# శ్రీ చక్రపాణి అవార్డులు

తెలుగులో ఉత్తమ నవలా, కథాసాహిత్యాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో గత సంవత్సరం శ్రీ చక్రపాణిగారి అవార్డులను ప్రవేశపెట్టాం. వాటి ఫలితాలను ఈ సంచికలో ప్రచురించాం. అయితే 1978 సంవత్సరం అవార్డులను మరో రూపంలో ఇస్తున్నాము. ఈ సంవత్సరం మూడు ఉత్తమ నవలలకు మూడు అవార్డులను, అయిదు ఉత్తమ కథలకు అయిదు అవార్డులను ఇవ్వడానికి నిర్ణయించాం.

## అవార్డుల వివరాలు

| | | | |
|---|---|---|---|
| **నవల :** | మొదటి అవార్డు | — రూ | **2,250** |
| | రెండో అవార్డు | — రూ | **1,116** |
| | మూడో అవార్డు | — రూ | **850** |
| **కథానిక :** | మొదటి అవార్డు | — రూ | **1,000** |
| | రెండో అవార్డు | — రూ | **750** |
| | మూడో అవార్డు | — రూ | **500** |
| | నాలుగో అవార్డు | — రూ | **350** |
| | అయిదో అవార్డు | — రూ | **250** |

పై అవార్డులను పొందటానికి రచయితల, రచయిత్రుల నుంచి ఉత్తమ నవలలను, కథలను ఆహ్వానిస్తున్నాం.

*అవార్డులను పొందగోరేవారు పాటించవలసిన నిబంధనలు :*

1. నవల, కథానిక — ఆంధ్రుల సమకాలీన సామాజిక జీవనానికి ప్రతిబింబంగా ఉండాలి.

2. నవల అరఠావు సైజులో 100 పేజీలకు మించకుండా 80 పేజీలకు తగ్గకుండా ఉండాలి. అచ్చులో 80 పేజీలకు మించరాదు. ఒక్కొక్క పేజీలో 25 లైన్లు మించకుండా, ఒకే ప్రక్కన వ్రాయాలి.

3 కథానిక అరఠావు సైజులో 16 పేజీలకు మించకుండా ఉండాలి. పేజీకి ఒకవైపునే వ్రాయాలి.

4. అనువాదాలూ, అనుసరణలూ అవార్డులకు ఆమోదించబడవు రచన స్వంతమేననీ, దేనికీ అనువాదం, అనుసరణ, ఆధారం కాదనీ హామీ పత్రాన్ని ప్రతి రచనకూ జతపర్చాలి. కలం పేర్లతో వ్రాసేవారు తమ అసలు పేర్లను తప్పకుండా తెలియజేయాలి.

5. అవార్డులకు పంపే నవలల, కథల కవర్లపై 'శ్రీ చక్రపాణి అవార్డుల కోసం' అని స్పష్టంగా వ్రాయాలి.

6. అవార్డులు పొందని నవలలను, కథలను కూడా 'యువ'లో ప్రచురణకు స్వీకరించే హక్కు మా కున్నది.

7. అవార్డులు లభించని నవలలు, కథలను తిరిగి పొందగోరే వారు తగినన్ని తపాలా బిళ్ళలు అంటించిన కవర్లను విడిగా జతపర్చాలి. లేకపోతే వాటిని తిప్పి పంపడం సాధ్యంకాదు.

8. అవార్డులను పొందినవారి జాబితాను ఆగస్టు 1978 'యువ' సంచికలో ప్రకటిస్తాం. అవార్డులు పొందిన నవలలు, కథలను ఆగస్టు సంచికనుంచి ప్రచురించడం జరుగుతుంది.

9. అవార్డులను ఇచ్చే విషయంలో 'యువ' సంపాదకులదే తుదినిర్ణయం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

చాలామంది రచయితలూ రచయిత్రులూ కోరినమీదటనే అవార్డుల నిమిత్తం నవలలు, కథలు మాకు చేరవలసిన ఆఖరు తేదీని ఏప్రిల్ 12, 1978 వరకూ పొడిగిస్తున్నాం.

— సంపాదకుడు, యువ






# అమృతాంజన్

## శక్తివంతమయిన బాధానివారిణి

# అనోలియమ్

## జలుబుకి సున్నితమయిన మందు







AM-1578 TEL

అమృతాంజన్
శక్తివంతమయినది. తల నొప్పులు, వెన్ను నొప్పులు, కండరాల నొప్పులు, బెణుకులు మరియు జలుబుల నుంచి శీఘ్రంగా ఉపశమనం కలిగించడానికి దానిలో పది శ్రేష్ఠమైన ఔషధాలు వున్నాయి.
అనోలియమ్ జలుబులని, దగ్గులని పారద్రోలుతుంది. మృదువయిన చర్మాలకోసము అది ప్రత్యేకంగా తయారుచేయబడింది.
మీ ఇంట్లో వాటిని ఎప్పుడూ అందుబాటులో వుంచుకోండి.

అమృతాంజన్ మరియు అనోలియమ్ — ఇంటింటా అవసరమయిన నమ్మకమయిన దివ్య ఔషధములు.
అమృతాంజన్ లిమిటెడ్.
80 సంవత్సరాలకు పైగా నమ్మకమయిన గృహ ఔషధములను తయారుచేస్తున్నవారు.

# ప్రియమైన భారత దేశ ప్రజలకు స్విట్జర్లెండ్ నుంచి ఒక మిత్రుని వ్యక్తిగత సందేశం

**మీ** దేశాన్ని రెండుసార్లు వేర్వేరు సందర్భాలలో సందర్శించే అవకాశం నాకు కలిగింది. ఒక సందర్భన సందర్భంగా నేను ఇద్దరు భారతీయ మిత్రులతో హిమాలయ పర్వతాలకు వెళ్లాను ఆ పరిసరాలలో నాకు స్వగృహంలో వున్నట్లే తోచింది. కారణం ఏమిటంటే స్విట్జర్లెండ్‌లో నేను పర్వత ప్రాంతాలలో నా జీవితంలో చాలా కాలం గడిపాను గనుక.

నేను చేసే కలప దూలాల వ్యాపారం మూలంగా పెక్కు పర్వత ప్రాంతాలకు వెళ్లేవాడిని. నా వ్యాపారం తొలి దశలో ఎత్తైన కొండలలోని అడవుల నుంచి, డబ్బు ఖర్చు ఎక్కువ కాకుండా విశిష్టంగా కలపను రవాణా చెయ్యవలసిన సమస్యల నెదుర్కొనవలసి వచ్చింది. కొన్ని సంవత్సరాల పరిశోధనలకు పిమ్మట స్పెషలైజు చెయ్యబడిన మెషీన్లు, కేబుల్ వేస్ ఉపయోగిస్తూ చివరకు ఒక స్కైలైన్ క్రేన్ రూపొందించాను. దానితో కలప కోసం కొండల మీది అడవులలో ప్రవేశించి అక్కడ చెట్లు కూల్చి, కలప దూలాలను సేకరించే అసాధ్యమైన పరిస్థితి ఇప్పుడు సులభమైంది. ఈ క్రేనుతో 330 అడుగుల వెడల్పు కలిగి 1¾ మైళ్ల నిడివికల అటవి ప్రాంతం నుంచి కలప సేకరించడం సుసాధ్యమైనది. కలపను మోసుకురావడానికి ప్రత్యేకంగా ఒక క్యారేజి డిజైన్ చెయ్యబడింది. ఒక్క సింగిల్ ఆపరేటింగ్ కేబిలు, ఒక్క స్కైలైన్ మాత్రమే అవసరమయ్యేవి. కలప దూలాలు రవాణా మార్గాన్ని రెండువైపుల నుంచి పైకి పంపడానికి, క్రిందికి రప్పించడానికి కూడా వీలయ్యేది. ఈ సందర్భంలోనే ఎంతగానో ఉపకరించిన స్కైలైన్ క్రేన్లు, యిప్పుడు ఇతర ఇంజనీరింగ్ ప్రాజెక్టులకు కూడా భారతదేశముతో సహా 34 దేశాలలో ఉపయోగించబడుతున్నవి.

ఈ సాంకేతిక సాహసిక చర్యలో నేను సాధించిన అన్ని విజయాలకు ఘనత ఈ ప్రపంచాన్ని అందులోని అన్నిటిని సృజించిన ఆ దేవునికే యిస్తాను. ఆయన మహామహిమాన్వితుడైన సృష్టికర్త అయినప్పటికీ, మన వ్యక్తిగత వ్యవహారాలలో శ్రద్ధాసక్తులు వహిస్తారు.

దేవునిలో నాకు గల విశ్వాసం నేను చేసే ప్రతి పనిలోను ఉన్నది. వారానికో, రోజుకో ఒకసారి చర్చికి వెళ్లడంతో అది పరిమితం కాలేదు. నేను ఎప్పుడైనా ప్రత్యేకంగా ఒకపనిచేయ వలసివస్తే దేవుని నమ్రతతో ప్రార్థిస్తాను. ఆయన నా ప్రార్థనలు నాలకిస్తాడు. నన్ను ఆశీర్వదిస్తాడు. అందుకే నా వ్యాపారము మూడు పూలు, ఆరు కాయలుగా వృద్ధి చెందుతూ వుంది స్విట్జర్లాండులోనేమి, ఇతర దేశాలలోనేమి అనేకమంది ప్రజలు తాము క్రైస్తవులమని చెప్పు కొంటారు. వారు పేరుకు మాత్రమే క్రైస్తవులు కాని, నిజానికి వారు క్రీస్తు లేని క్రైస్తవులు

(1) వారెన్నడు యేసు క్రీస్తును దేవుని కుమారునిగా అంగీకరించలేదు. తమ ఆత్మరక్షకుడుగా పరిగణించ లేదు.

ఏమైనప్పటికి యేసు క్రీస్తును మనసార అంగీకరించిన చిత్తశుద్ధిగల క్రైస్తవులు ప్రయోజనాత్మకమైన, సంతోషభరితమైన జీవితాలు గడుపుతూ ఉండడము నేను గమనించాను. వారు దుర్భాషలాడరు. కోపించరు. కలహించరు చౌర్యం చెయ్యరు అబద్ధము లాడరు (2) వారు క్రీస్తుచే సృజింప బడినవారివలె దేవుని సహాయ, మార్గ దర్శకత్వాలపైనే ఆధారపడి జీవిస్తారు. వారి మనస్సులలో శాంతి నిరంతరము తాండవిస్తుంది. దేవుని సమక్షంలోనే తమ జీవితమంతా గడిపివేయగల మన్న విశ్వాసంతో వారు యిలా జీవిస్తున్నారని నేను ఆ తర్వాత గ్రహించాను.

ఇదంతా చూచిన పిదప నా మట్టుకు నేను అటువంటి జీవితాన్నే అభిలషించాను. నేను చేసిన పాపాలకు పశ్చాత్తాప పడ్డాను నా హృదయంలో ప్రవేశించమని యేసుక్రీస్తును వేడుకొన్నాను (3;4;)

ఆయన అలాగే చేసారు అది దివ్యానుభూతి అప్పటినుంచి నేను యేసు క్రీస్తుతోనే నడిచాను, నా జీవితం యిప్పుడు నిర్భరానంద భరితం. నా హృదయంలో అనిర్వచనీయమైన శాంతి, నాతోటివారితో నెమ్మది. ఈ వినూత నానుభూతి కలిగినప్పటినుండి ప్రజలు నిజమైన దేవునైనా ప్రార్థిస్తారని, లేక వ్యక్తి, డబ్బు, ఐహికసుఖాలు భాగ్య భోగాలు, జంతువులు, విగ్రహాలు, తాము చేసుకొన్న వాటినైనా పూజిస్తారని గమనించాను (5,6)

మానవులకు దైవము అవసరం. అయితే వారి పాపాలే వారిని ఆయనను దరిచేర కుండా వారిస్తున్నాయి. మానవులు పాప పంకిలములో మునిగిపోయినపుడు, భగ వంతుడు వారిని రక్షించడానికి, తన్ను గ్రహించేటట్లు చెయ్యడానికి పూను కుంటాడు. అందుకే యేసు క్రీస్తును చట్టం అవసరాలను తీర్చే నిమిత్తం మరణించ

వలసిందని శాసించాడు. మానవుని పాపాలవల్లనే ఆయన మరణించాడు. (7) యేసుక్రీస్తు మనం వున్న చోటనే మృతిచెందాడని మన హృదయాలలోనే విశ్వసించి, మన పాపాలను క్షమించమని ఆయనను కోరితే మనం తప్పక రక్షించబడతాము మన పేర్లు జీవి గ్రంథంలో వ్రాయబడతాయి. మనం కాపాడబడినపుడు ప్రార్థనలో దేవునితో స్వయంగా మాట్లాడగలిగే అద్భుతావకాశం లభిస్తుంది. (8) మనకు సహాయం అవసరమైనపుడు తన సింహాసనం వద్దకు రావలసినదిగా దయతో ఆయన చేసే ఆహ్వానాన్ని మనం అందుకొంటున్నాము. (9) మనం ఇతర దేవతలను కొలిస్తే ఆయన మన మొర నాలకించరు. ఆయనకు మాత్సర్యం ఎక్కువ. ఆయన అన్య దేవుళ్లను మనం ప్రార్థించడాన్ని సహించరు. (11)

పాపం నుంచి ముక్తికి దారిచూపే ఈ మార్గాన్ని గురించి యావత్ప్రపంచానికీ తెలియజేయడం అవసరం. ప్రజలందరికీ రేడియో ద్వారా, పత్రికల ద్వారా, టెలివిజన్ ద్వారా, బహిరంగసభల ద్వారా వినిపించవలసిన శుభసమాచార మిది. యేసుక్రీస్తు ప్రభువు సందేశాన్ని వినే అవకాశం అందరికీ కలగాలి. తన కుమారుడు యేసుక్రీస్తు ద్వారా ప్రజలకాయన అందించే సందేశాన్ని గురించి తమకు తామై నిర్ణయించుకొనే అవకాశం యివ్వాలి. (12)

దేవుని గురించి మనకు వెల్లడిఅయిన విషయాలన్నీ బైబిల్‌లో తనిఖీ చేసుకోవచ్చును. ఈ పుస్తకం 300 భాషలలోనికి తర్జుమా చెయ్యబడినది. బైబిలులో భగవంతుడు తన ప్రజల కోసం తాను చేసే ఆలోచనలను గురించి తెలియజేశారు. తన ప్రజల కోసం గతంలో ఏమి చేసినదీ, భవిష్యత్తులో ఏమి చెయ్యవలచినదీ వివరించారు. (13) పవిత్ర ఆత్మ ప్రభోదం సంపాదించినవారిచే అది వ్రాయబడినది. మన ప్రశ్నలకు, సందేహాలకు అందులో సమాధానములున్నవి. ఈ జన్మలోను, రానున్న జన్మములలోను మనం ఎదుర్కొంటున్న, ఎదుర్కొనవలసిన సమస్యల పరిష్కార మార్గాలను ఆయన సూచించారు

మొత్తంమీద బైబిలులో వున్న ఒకే ఒక ధోరణి ముక్తికి భగవంతుడు చూపే మార్గం. ఈ ప్రపంచంలో సిలువపై అసువులు బాసిన దేవుని కుమారుడు యేసుక్రీస్తులోనే అది ముగిసింది. మనం చెయ్యవలసినదంతా ఒక్కటే ఆయన ఆహ్వానాన్ని అంగీకరించడం, లోగడ మనం పూజించిన దేవుళ్లందరిని వదలివేయడం, మన పాపాలకు పశ్చాత్తాపపడడం, మన రక్షకుడుగా ఆయనను పరిగ్రహించడము. ఆయన మనలను తన కుటుంబసభ్యులుగా చేసుకొంటాడు. భూలోకంలో అపూర్వమైన, అద్భుతమైన జీవితానికి మనము ఎదురుచూడవచ్చు.

ఆయనతోపాటే స్వర్గంలో మనం శాంతి యుతంగా వుండవచ్చు.

భగవంతునితో వినూతన జీవితానికి ఈ వ్యాసం ఒక సంక్షిప్త పరిచయం మాత్రమే అయితే మనం చెప్పవలసిన దంతా చెప్పలేము. కాని భగవంతుడు అంతా బైబిలులో చెప్పినాడు. మీ వద్ద బైబిలు లేకుంటే ఒకటి కొనండి. ప్రపంచములో ఇది అత్యంత విలువైన, మరియు ప్రధానమైన గ్రంథము. మీరు బైబిలు కొనలేకపోతే ఈ క్రింది చిరునామాకు అధిక సమాచారం కోసం వ్రాయండి.

స్విజ్జర్లెండు నుంచి ఇండియాలోని ప్రియతమ ప్రజల కందరకు నా శుభా కాంక్షలు. వాటితో పాటు అనిర్వచ నీయమైన భగవంతుని ఆశీస్సులు కూడ మీకు అందుతాయి

జె. వైస్సెన్,
కేరాఫ్ టీన్ ఏక్షన్ ఇంటర్నేషనల్
తాజ్‌నగర్, నాగపూర్
440003 ఇండియా.

ఈ వ్యాసంలోని అంకెలు "లివింగ్ బైబిల్" నుంచి పేర్కొనబడినవి.

1. అవును అందరూ పాపాలు చేశారు. అందరూ భగవంతుని వైభవోపేతమైన లక్ష్యాన్ని చేరుకోలేకపోయారు. అయితే మనం యేసుక్రీస్తును నమ్మితే "దోష లము కాదు" అని ఆయన ప్రకటిస్తారు. ఆయన దయార్ద్ర హృదయంతో మన పాపాలను తొలగిస్తారు.

రోమా : 3 : 23, 24.

2. అయితే మీరు మీ అభిమతాను సారము నడుచుకొని జీవిస్తే దుష్ఫలి తాలే కలుగుతాయి. అపరిశుద్ధ భావాలు జనిస్తాయి. పాశవిక ప్రవృత్తి ప్రబలు తుంది. విగ్రహారాధనేచ్ఛ ఉత్పన్న మవుతుంది. ప్రేతశక్తి, జుగుప్స, ఆగ్రహం, ద్వేషం, పోరాడే ఇచ్ఛ — మీ వర్గంలోని వారు తప్ప మిగిలిన వారందరిదీ తప్పే అనే దురభిప్రాయా లన్నీ కలుగుతాయి. అసూయ, త్రాగు బోతుతనం, హత్యాజిగీష అన్నీ పెన గొంటాయి. అటువంటి జీవితం గడిపే వారెన్నటికీ భగవంతుని రాజ్యం చేరుకోలేరని నేను మరొకసారి చెప్ప గోరుతున్నాను.

గలతీ 5 : 19–21.

3. అడగండి. మీరేమి కోరితే అది వస్తుంది. ప్రయత్నించండి. మీరు దేని నభిలషిస్తారో దానినే పొందగలరు. తట్టండి తలుపులు తెరుచుకొంటాయి.

మత్తయి 7:7

4. చూడండి. నేను ద్వారం దగ్గరనే నిలబడి వున్నాను. అదేపనిగా తలుపు తట్టుతున్నాను. నేను పిలుస్తున్నది ఎవరైనా విని, తలుపు తెరిస్తే నేను లోపలికివెళ్ళి అతనితో నేను, నాతో అతను జతగా ముందుకు పోతాము.

ప్రకటన 3:20

5. నాకంటె మీకు వేరు దేవుళ్లుండ రాదు. ద్వి.కాం. 5:7

ఓ ఇశ్రాయేలు ప్రభువా! దేవతల పైనే సింహాసనాన్ని అధిష్టించి వున్న నీవే భూలోకంలోని అన్ని రాజ్యాలకు అధినాధుడవు. స్వర్గాన్ని భూతలాన్ని కూడ మీరే సృజించారు ... 2 రాజులు 19:15

6. నేనే యెహోవాను. ఇతర దేవుళ్లెవరూ లేరు. యెషయ 45:5

7. చూడండి. అందరి ఆత్మలు నావే. నాది తండ్రి ఆత్మ వంటిది. కుమారుని ఆత్మ కూడా నాదే. పాపాలు చేసే ఆత్మ నశించాలి.

యెహెజ్కేలు 18:4

8. ఇప్పుడు మనం నిర్భయంగా భగవంతుని సమక్షం లోనికి రాగలము. క్రీస్తుతో కలిసి మనం వచ్చినపుడు ఆయనను నమ్ముకొన్నప్పుడు ఆనందంతో స్వాగతమిస్తారు. ఎఫెస్సీ 3:12.

9. కాగా మనం తెగువతో భగవంతుని సింహాసనం ముందు నిలబడి ఆయన కరుణను పొందుదాము. ఆయన దయ మనలను అవసర సమయాలలో కాపాడుతుంది. హెబ్రీ 4:16

10. ఆయనను మీరు వదలివేసి ఇతర దేవుళ్లను పూజిస్తే ఆయన మీకు ఎదురు తిరిగి మిమ్మల్ని నాశనం చేస్తారు. యెహోషువ 24:20

11. ఏ ఇతర దేవుని మీరు ఎప్పుడూ పూజించరాదు. మీ ఇంటిలో ఏ విగ్రహమూ వుండరాదు. కీర్తనలు 81:9

12. భగవంతుడు ఈ ప్రపంచంలో జీవించాడు. తన ఏకైక కుమారునే యిచ్చివేశాడు. ఆయనను నమ్ముకొన్న వారు ఎన్నటికీ నాశనం కారు. శాశ్వతంగా జీవిస్తూనే వుంటారు.

యోహాను 3:16

13. ఈ సిద్ధాంతాలను గురించి మీరు ప్రజలకు తెలియజేయండి. మీ మట్టుకు మీరున్నూ వీటిని గురించి ఆలోచించండి. రోజూ పగలు, రాత్రి వీటిని గురించి ఆలోచిస్తే అన్ని సిద్ధాంతాలను మీరు ఆచరించగలుగుతారు. అప్పుడే మీరు విజయం పొందగలరు. యెహోషువ 1:8

హాలెలూయ–హల్లెలూయ

రెవ. సతీష్‌రాయి బోర్డే రచన

Abundant Power for Abundant living (ఇంగ్లీషులో) మీరు పొందగోంనచో పైన ఇవ్వబడిన చిరునామాకు రూ. 3/- పంపగోరెదము.

– ప్రకటన




## బహుమతి : రూ. 116

ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాం. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తిచేయాలి. మిగతా అయిదింటికి పాఠకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి.

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1 సమాధానాలు "యువ" కూపనుమీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరుమీద "క్విజ్" అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపన్ తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దుళ్ళు ఉండరాదు. కూపన్లను పోస్టులోనే పంపాలి. ఆఫీసుకు వచ్చి ఇచ్చేవాటిని స్వీకరింపబడవు.

2. ఒకరికంటే ఎక్కువమంది ఆల్ కరెక్ట్ సమాధానాల్ని పంపితే, వారికి బహుమతి సొమ్ము పంచడం జరుగుతుంది. సంఖ్య మరీ ఎక్కువైతే లాటరీ పద్ధతి అమలుపరుస్తాం.

3. సమాధానాలు సీలువేసిన కీ సొల్యూషన్‌తో సరిపోవాలి.

4. దీనికి సంబంధించిన విషయాలలో "యువ" సంపాదకునిదే తుది నిర్ణయం. క్విజ్ సమాధానాలను మే సంచికలో ప్రకటిస్తాము. ఎట్లాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

5. మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ ఏప్రిల్ 1. ఆ పైన వచ్చిన వాటిని పరిశీలించడం జరగదు.

## ఏప్రిల్ నెల క్విజ్

1. ఆంధ్రదేశాన్ని పాలించిన ఇక్ష్వాకులకు ఇది రాజధాని

   ఎ) అమరావతి బి) నాగార్జునకొండ సి) హంపి డి) నెల్లూరు

2. తొలి తెలుగు–ఇంగ్లీషు నిఘంటువు ప్రకటన

   ఎ) 1825 బి) 1845 సి) 1835 డి) 1815

3. కాక్స్ (Cox) అనే పదము కిందిదానికి సంబంధించినది

ఎ) బేస్‌బాల్ బి) బిలియర్డ్స్ సి) బోట్ రేస్ డి) బాక్సింగ్

4. "పిల్లలను చెరొక చేత్తో పట్టుకొని, మరచెంబు చంకలో పెట్టుకొని, ఆ హోటలుకి దారితీశాడు నారాయణరావు—" పై వాక్యం కింది నవలలోని ఆఖరి వాక్యం.

ఎ) యమపాశం బి) పాపికొండలు సి) నారాయణరావు డి) కొత్త ఇల్లు

5. యూరప్‌లో అతి చిన్న దేశం

ఎ) మొనాకో బి) మాల్టా సి) శాన్ మారినో డి) టోంగా

6. మనదేశంలో ప్రచురించబడ్డ తొలి వార్తా పత్రిక————

7. "సింకోనా" వృక్షంనుంచి లభించే మందు————

8. బాల్‌పాయింట్ పెన్‌ను కనిపెట్టింది————

9. ఆంధ్రప్రదేశ్ జిల్లాలన్నింటిలోకి వైశాల్యంలో పెద్దది————

10. మనదేశంలో పోస్టేజి స్టాంపులు ప్రింటు అయ్యే పట్టణం————

యువ

క్విజ్ క్వశ్చన్ - ఏప్రిల్ '78

సమాధానాలు

1- [ ] 2- [ ] 3- [ ] 4- [ ] 5- [ ]

6 ............ 7 ............ 8 ............

9 ............ 10 ............

పేరు: ____________

అడ్రసు: ____________

____________

____________

YUVA, APRIL '78 Three Rupees Regd. No. H/HD 7



సీతారామపట్టము